

శ్లో॥ సా౽౽శుప్రసాదినీ బ్రహ్మా। ౽స్త్రైశ్వరీ చిన్మయీ జయేత్
స్మృత్యర్థ్యేయే చసర్వస్మి। స్నతకారా౽౽హ్వాయదా౽స్తి యూ.

౯-వ సంపుటము.

# గ్రంథాలయ సర్వస్వము.

౨-వ సంచిక.



## సరస్వతీ దేవి స్తుతి.

కం॥ గ్రంథమునాలయమను నీ, పంథాలను దెలయుటకై మానుష్య మనన్.
కంథకు గతిలేకుండిన గ్రంథాలయమహిమ తెలియగ ఘనుడై నెగడున్. శ్రీ. శా.

శా॥ మాతా కుప్యతు వా పితా త్యజతు వా ప్రీణాతు నో సోదరాః
తావ ద్బంధుగణా ద్విష స్త్వపి గురు శ్శప్త్వా న వా శామ్యతు
జాయా నో సహతాం క్రమేణ నృపతి శ్శాస్త్వన్యథా నామ సా
వాగ్దేవీ వదనాంబుజే వసతిచే త్కో౽ నామ దీనో జనః. శ్రీ. శా.

శా॥ లక్ష్మీశ్చే ద్గజపూర్వకా౽స్త్వయి ధనే మా మాశ్రయేర న్నమా
ఇత్యేవం తవ కల్పనేతి కలయే వేషే౽త్ర భాషే౽౦బ! తే
తస్యాశ్చాపి హి నామదా౽౽క్షరరుచే! వేషః కుత స్తేక్షరో।
భ్రాంతిః కస్య నహీంతి వక్తు ముచి తాహో౽౦బా౽స్త్వహో శారదే. శ్రీ. శా.

# 16వ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ,

## కాకినాడ.

జనవరి నెల 21, 22 తేదీలు, 1934 సం॥

ఆంధ్రదేశమందున్న వివిధమండలములనుండి పలువురు గ్రంథాలయముల ప్రతినిధులు 20 వ తేదీ సాయంకాలమే వచ్చేసిరి. ప్రతినిధులందరకిని అప్పనవారి సత్రమందు బసలు భోజనవసతులు ఏర్పాటు చేయబడెను. పలువురు స్త్రీలుగూడ ప్రతినిధులుగా వచ్చియుండుట గమనింపదగిన విషయము. ప్రతినిధుల సౌకర్యమునకై ఆహ్వానసంఘమువారు విశేషపరిశ్రమ చేసి చక్కని ఏర్పాటులను గావించిరి.

21 వ తేదీ ఉదయము 8-30 గంటలకు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘముయొక్క వార్షిక సమావేశము జరిగెను.

మధ్యాహ్నము 2-30 గంటలకు అన్నదాన సమాజమువారి ఆవరణలో వేయబడిన విశాలమగు పందిరిలో 16 వ ఆంధ్రదేశ గ్రంథాలయ ప్రతినిధుల మహాసభ ప్రారంభమయ్యెను.

ప్రథమమున కొందరు పండితులు వేదమంత్రములతో ప్రార్థనలను గావించిరి.

### శ్రీ దుగ్గిరాల వెంకటసూర్యప్రకాశరావుగారి ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసము.

పదునారవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభకు వ్యయప్రయాసల కోర్చి దూరప్రదేశములనుండికూడ విచ్చేసిన భాషాభిమానులరగు మీకు ఈ సభాసన్నాహ సంఘము వారిపక్షమున మనఃపూర్వక స్వాగత మొసంగుచున్నాను. వెనుకటి కోఆపరేటివ్ రిజిస్ట్రారులలో నొకరు ఆ డిపార్టుమెంటు వార్షిక సభలలో నుదాహరించినట్లుగా చెన్నపురరాష్ట్ర దక్షిణమండలములందు ఐకమత్యాభివృద్ధికి పరపతిసంఘోద్యమ్ము కారణభూతమగుచున్నదనియు ఆంధ్రమండలములందు గ్రంథాలయ స్థాపనకార్యక్రమము వృద్ధిమగుచున్నదని వ్రాసినవిషయము క్రమక్రమముగ స్థాయియగుచున్నదని చెప్పుట అతిశయోక్తి కాదు. ఆయుద్యోగీయుడు పైన వ్రాసినదానిని బలపరుచుచు పరపతిసంఘస్థాపనాభివృద్ధి కూడ వెంబడించి, ఆంధ్రదేశమున ప్రజైకమత్యమునకు జనసామాన్యజ్ఞానాభివృద్ధికి రెండుమార్గములు ఏర్పడినవి.

నాగరకత చెందినదేశము లని చెప్పబడిన ఏష్యాయూరపుఖండపుభాగములందు ప్రజలు లిపిని సృష్టించుకొనినకాలమునుండియు తమజ్ఞానమును గ్రంథరూపమున చిరస్థాయిచేయుటకు ప్రయత్నించినట్లు దృష్టాంతములు ప్రబలముగ గానబడుచున్నవి. కాగితములు, ముద్రాయంత్రములు మొదలగు సాధనములు లేని పూర్వకాలమున లోహము, రాయి, ఇటుక, భూర్జపత్రము, చర్మము, తాటిపత్రము మొదలగు పరికరముల సాహాయ్యముతో భాషాభిమానులు, విద్యాభిమానులు, వివేకమహితులు తమ యభిప్రాయములను లిఖించి చిత్రించి చెక్కించి పురాతన జ్ఞానమును మనకు లభ్యముగావించిరి. గ్రంథము సేకరించుట కర్తవ్యమని యెంచి పాటుపడిరి. పురాతన దేశములలో చీనా, ఈజిప్టు, హిందూఖండము, పారసీకము, బాబిలను, అస్సీరియా, ఇటలీ, గ్రీసు మొదలగునవి ప్రధానముగ చెప్పదగినవి. క్రీస్తుశకారంభమునకు తరువాత యూరపుఖండమునందలి వివిధదేశములందు గ్రంథాలయస్థాపనమును, గ్రంథముల సేకరించు ప్రయత్నము ఎట్లు విజృంభించెనో తెలుప ప్రయత్నించుట అనావశ్యకమని తలచి దానినిగూర్చి చెప్పదలచలేదు.

ఈ దేశమున ముఖ్యముగా ఉత్తరహిందూస్థానమున మత, వైజ్ఞానిక, వైద్యక, శాస్త్రీయ, రాజకీయ విషయములనుగూర్చి గ్రంథబాహుళ్య ముండెననియు, అట్టి విజ్ఞానభాగ్యమువలననే వీరపురుషులతో పాటు ధీబలసంపన్నులు పెక్కురు ప్రతిచోట బ్రబలియుండుట

ప్రారంభమయ్యెను. ఇంగ్లీషువారు, ఫ్రెంచివారు, జర్మనీ వారు, ఈదేశపు టమూల్య పురాతన సంస్కృత గ్రంథ సముత్కరములను సమస్త విధోపాయావలంబనముచే నిచట లేకుండజేసిరి. తుదకు మనమిపుడు వానిప్రతులు కావలసినయెడల పాశ్చాత్యదేశములనుండి తెప్పించుకొనవలయును. ధన కనకరత్నాభరణములు మనచేయి జారిపోయినట్లే మనదేశమునందలి పురాతనచిత్రములు, తాళపత్రగ్రంథములు మొదలగునవికూడ నధికారబలము వలనను కొన్నివేళల న్యాయైక దూరమార్గావలంబనము వలనను, పశ్చిమముఖమునుబట్టినవి. సంశీరుజంగు బహదరు నేపాళమునందలి 15 వేల తాళపత్రగ్రంథములను బ్రిటిషుపుస్తక భాండాగారములకు బహుమానముగ నొసంగెను. బ్రిటిషురెసిడెంటు వానిని వందనములతో గైకొని రవానాచేసిన విషయము ప్రకటింపబడినపుడు అట్టి పురాతన నాగరక, వాఙ్మయమును గోలుపోవుటకన్న అర్ధరాజ్యమును ధారవోసియున్నయెడల దేశమునకట్టి విపరీతనష్టము సంప్రాప్తము కాకుండునని దూరదృష్టిగల దేశాభిమానులు కొందరపుడు వ్రాసియుండిరి. ఈదేశమునుండి మన వాఙ్మయము తొలగిపోయినవిధములు వర్ణించుటకు ప్రత్యేకోపన్యాస మావశ్యకమై యుండును. దాని నిచ్చట సంగ్రహముగ నేని వివరింప యత్నించినయెడల గ్రంథవిస్తరము తప్పనిసరి యగును

సంస్కృతభాషా పునరుద్ధారణము కొరకు జీర్ణగ్రంథ పరిశోధనము కొఱకును ఆంగ్లేయ విద్యావిధానానుకూలముగ సంస్కృతమును నేర్పుటకు ప్రభుత్వమువారు దొరకొనినప్పుడు, వారు చాలవరకు జర్మనీ ఆస్ట్రియా దేశములనుండి ఆచార్యులను నియమించుచుండిరి. ఈయాచార్యులు తమ యుద్యోగముతో పాటు పురాతన గ్రంథసంపాదనమునకు దొరకొని దాని కొరకవలంబించిన మార్గములు విషాదమును వింతను మోసమును స్ఫురింపజేయును. తంజావూరు సంస్థాన భాండాగారమును నెలకొల్పుటకు శరభోజీ మహారాజు పడిన శ్రమ,చూపినయోరిమి, వెచ్చించిన ధనము తెలిసికొనినయెడల ఆశ్చర్య సంతోషములు మనహృదయసీమల జనింపక మానవు. ఈ చొప్పుననే బ్యాంకిపూరులో ఖుదాబక్షు స్థాపించిన పుస్తకభాండాగార గ్రంథసంపాదనమున కాతడు పడినకష్టములు, పొందిన నిరాశలు మనము మరువదగినవికావు. రంగూను కలకత్తాలు మొదలు డెమాస్కసు, ఏష్యామైనరువరకు అతని యేజంట్లు ఉత్తమగ్రంథ సంపాదనార్థము చూపిన కౌతూహలము ప్రతివానికి ననుసరణీయము. దానికొరకాతడు సమర్థులైన ఏజంట్లను నియమించి వారికి విరివిగ ధనమిచ్చి యొక్కొక్క గ్రంథము చొప్పున సంపాదించెను. ఈగ్రంథసంపాదకులు 'ప్రాతపుస్తకాలు కొంటాము పాతకాగితాలు కొంటాము' అనువంటివారుగా నుండదగరుకదా? వారు, ప్రముఖులగువారి యింట చితుకాగితపు ప్రోవులను శ్రద్ధతో పరిశీలించి గులకరాళ్లలోనుండి మణుల నేరినట్లు ఆగ్రంథాలయమునకు పుస్తకముల సంపాదించిరి. ఖుదాబక్షు కొన్నియేండ్లు శ్రమపడి సంపాదించిన రెండు పార్సీగ్రంథములను పాట్నాజిల్లాజడ్జి చదువుటకని పుచ్చుకొని తాను ఉద్యోగమును చాలించుకొని స్వదేశమునకు బోవుచున్నపుడు పొరపాటున తన యితరసామగ్రితో పంపివేసితినని చెప్పి ఆగ్రంథములను హరింపదలచెను. విదేశమున కేగుచున్న యూరోపియను చేజిక్కిన యేవస్తువు సామాన్యముగ యజమానునకు మరలదక్కుట యపూర్వ విషయమగుటచే ఖుదాబక్షు ఖిన్నుడయ్యెను. తాను తనదేశమును జేరినపిమ్మట వాగ్రంథములను బంపుమనని దొరగారు పొరపాటుననైన నుదాహరించలేదు. కొన్నాళ్లకు ఖుదాబక్షుగారి లాహోరు ఏజంట్లు అచ్చట ప్రాతపుస్తకము లమ్మువాని దుకాణమున రెండు విలువగల పురాతనగ్రంథములుగ దోచినవానిని కొని బ్యాంకిపూరులైబ్రరికి పంపెను. ఆరెండును దొరవారు హరింపదలచిన గ్రంథములయ్యెను. దొరవారు తమ సామగ్రులను గ్రంథములను పెట్టెలలో బస్తాబందీచేయుట కాజ్ఞాపించినప్పుడు ఈ శిథిలగ్రంథములు పనికిరాని ప్రాతకాగితములక్రింద నెంచి వానినివిడిచిపెట్టి నిగనిగలాడుచు ముద్రింపబడిన రెండుమాసపత్రికలను వానిస్థానమున నమర్చిరి. స్వదేశమున కేగినపిమ్మట వాని కొరకు వెదకగ, అవి కాన్పించక దొరవారు ఖిన్నులై యుండుట నిశ్చయము. దైవము తనపాలిట నున్నాడనియు, మోసము సర్వదా జయము పొందదనియు ఖుదాబక్షు నమ్మియుండును.

హైందవవిజ్ఞాన నిలయమని చెప్పదగకున్నను కలకత్తా ఇంపీరియలు లైబ్రరీ అడయారు గ్రంథాలయము, మనదేశమున బేర్కొనదగిన గ్రంథాలయములు, బొంబాయి, కలకత్తా, ఏషియాటిక్కు సొసైటుల లైబ్రరీలు మనదేశసాహిత్యసామగ్రికి ముఖ్యనిలయములు. సర్వకళాశాలలున్న ప్రతిస్థలములందును గ్రంథాలయాభివృద్ధికి ఉత్తమగ్రంథసంపాదనకు ప్రయత్నములు ప్రస్ఫుటములగుచున్నవి. ఇక వేర్వేరు పట్టణములందును

గ్రామములందును స్థాపింపబడిన గ్రంథాలయములందు గ్రంథసంఖ్యను హెచ్చుగ చూపుటయే ప్రధానముగ నెంచి రైళ్లలో విక్రయింపబడు రూపాయికి 80 గ్రంథములవంటి వానివలన గ్రంథబాహుళ్యమే కాని చదువరులకు లేశము లాభము కలుగకున్నది. యూరపుఖండమందలి సుప్రసిద్ధగ్రంథాలయములందు నూరేండ్లక్రింద భద్రపరుపబడిన గ్రంథములలో నూటికి 70 వరకు నశింపుచేయబడ దగినవనియు కచ్చేరీలలోని రికార్డులవలెనే గ్రంథాలయములోని గ్రంథములను సంఖ్యాబాహుళ్యముకొరకు భద్రపరుప దగనివనియు దీనిని గుర్తించుచు నడుపబడుచున్న గ్రంథాలయములే లోకోపయోగకరములుగ నుండులనియు, అవి జరుగనినాడు ప్రకృతిశాస్త్రసిద్ధాంత ప్రస్తుతానుభవ విషయవిరుద్ధములగు విషయములతో నిండియున్న గ్రంథపఠనమువలన కాలము వ్యర్థమగుటయు నిష్ప్రయోజన జ్ఞానముతో మనసు నింపబడుటయు దప్ప లాభముండదనియు నొకానొకసమయమున లార్డు రోజుబరీ చెప్పియున్నాఁడు. ఇది ముమ్మాటికి నిజము. ఈసంగతిని ప్రతిగ్రంథాలయపాలకులు గమనించుట విధాయకము,

పాశ్చాత్యదేశీయులు పురాతనగ్రంథములు, వ్రాతప్రతులు, శిల్పములు. చిత్తరువులు, శాసనములు, మొదలగువానిని సంపాదించి వానిని లోకోపయోగముకొరకు గ్రంథాలయములకు, చిత్రవస్తు ప్రదర్శనశాలలకు, కళాభవనములకు, విశ్వ విద్యాలయములకు, సమర్పించుచుందురని మనము తరుచుగ పత్రికాముఖమున దెలియుచున్నాము. వీని కొరకచట విద్యాభిమానులు కళాభిమానులు వెచ్చించుధనము వెఱ్ఱివాని చేతిలోని రాతివలె కాన్పడును. ఒక్క పురాతన గ్రంథకర్త యొక్క గద్యకావ్యమునుగాని పద్యకావ్యమునుగాని సంపాదించుటకు వారు పరరాష్ట్రసంపాదనమునకు పడవలసినంతశ్రమ పడుదురు. రష్యాలో సోవియటుప్రభుత్వమువారివశమందున్న 'కోడెక్సుసినెయిటికసను (Codex cinaiticees) నాల్గవశతాబ్దమునాటి బైబిలువ్రాతప్రతిని బ్రిటిషు మ్యూజియమునకు సంపాదించుటకు విశ్వప్రయత్నముచేసి లక్షపౌండ్లకు దానిని కొనితెచ్చిరని గత డిశెంబరు 27 తేదిని తంతివార్తలలో నుదాహరింపబడెను. ఈ యపూర్వవ్రాతప్రతిని సంపాదించుటకు రాజు మొదలు రెడ్డివరకు విరాళములిచ్చుచున్నారు. చూచితిరా వారి భాషాభిమానము! దేశమున విద్యాభాగ్యాభివృద్ధికాంక్ష! గ్రంథముల విలువ నెఱుగని పండిత కుటుంబముల సంతతివారు తమ పూర్వు లతిక్రమములకు బాలై సేకరించి భద్రపరచిన తాళపత్రములను సంక్రాంతి భోగిమంటలకు సమర్పించినవారు కలరు. ఒక యున్నతపాఠశాలయం దిపుడు సంస్కృత పండితుడుగనున్న విప్రుడు కొంతకాలముక్రిందట తనబందుగు లింటికి చుట్టము చూపుగబోయి రాత్రి పరుండినపుడు వారాతనికి తలగడకు మారుగ వారింట మిగిలియున్న యొక లావైన తాళపత్రి గ్రంథమునిచ్చిరి. ఆరాత్రికి దానినాతడు తలగడగ నుపయోగించి మరుచటి యుదయమున దాని సూత్రమును విప్పి చూడగ నది శంకరభాష్యమయ్యెను. మనదేశ దురదృష్టమిట్లయ్యెను. అథర్వవేదము నిండుప్రతికొరకు అష్ట్రియాపోవలసివచ్చెను. విజ్ఞానసర్వస్వమువారు శివాజీ ప్రతిమను ప్యారీసునుండి తెప్పించిరి. అక్కన్న మాదన్నగారి ఛాయాపటము ఆంష్టరుడంనుండి రావలసివచ్చెను. లోక సౌభ్రాతృత్వము సాధ్యమై లోకకల్యాణము సమకూడిననాడు మనదేశమునుండి దేశాంతరములకు బలాత్కారముగ గొనిపోబడిన గ్రంథములు, శిల్పములు, చిత్రములు లోనగునవి మరల పూర్వాభిముఖములగునని నే నూహించుచున్నాను. పరమేశ్వరు డది సమకూర్చుగాక! ఆంధ్రమండలములందలి చాల వ్రాతప్రతులు చెన్నపురిప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము చేరినవి. కడచిన 10, 15 యేండ్లలో కొన్ని జర్మనీ యింగ్లండు దేశములకేగినవి. శ్రీ పిఠాపురం మహారాజాగారు కీర్తిశేషులైన చెలికాని లచ్చారావుగారు వ్రాతప్రతులను చాలవరకు సంపాదించిరి. ఆంధ్రసాహిత్య పరిషత్సభవారివద్దను మంచి గ్రంథసముదాయమున్నది. వీనిలో నూటికి 50 వంతున ముద్రితములని కనబడుచున్నది.

ఆంధ్రగ్రంథాలయోద్యమము స్వయంభువు. ఇది కేవల ప్రజాపోషణము వలన నిలిచియున్నది. దీనికి ప్రభుత్వాదరణము సున్న. దేశాంతరములందు వలె పట్టములందుగాక నిచట నీయుద్యమము గ్రామములందారంభమయ్యెను. ఆంధ్రోద్యమారంభముతో గ్రంథాలయ స్థాపన మారంభమయ్యెనని చెప్పనగును. దీనికి మహామహోపాధ్యాయ శ్రీపరవస్తు వేంకట రంగాచార్యులయ్యవార్లంగారు పితామహులుగ కనపడుచున్నారు. పిమ్మట పులివెందల, ఒంగవోలు, విజయనగరము, కుముదవల్లి; ఉండి, కొల్లూరు, గుంటూరు, రాజమహేంద్రవరము, హైదరబాదు, విజయవాడ, కాకినాడ లోనగు ననేక పట్టణము

యన్ని గ్రామములందు గ్రంథాలయములు స్థాపింపబడి స్వాంద్రాష్ట్రమున ప్రతిదినము నడుపుచున్నవి. ఈయుద్యమము మాట తలపెట్టునప్పుడు శ్రీయుత అయ్యంకి వేంకటరమణయ్యగారును, కీర్తిశేషులైన సూరి వేంకట నృసింహశాస్త్రిగారును తలపునకు రాకమానరు. భీష్మనిర్యాణమునకు శిఖండివలెగాక అర్జున సారథియగు శ్రీకృష్ణునివలె వేంకట రమణయ్యగారు మన మహాసభా రథమును నడుపుట కిపుడు మనమధ్య నున్నారు. గోత్ర నామములు చెప్పి పాదములు సోక మ్రొక్కుటను అభివాదనమందురు. పాదములు సోకుట మాట నటుండనిచ్చి, ఏకాత్రేయ శ్రీవత్సగోత్రోద్భవులైన అయ్యంకి వేంకటరమణశర్మగారికి మన కరయుగములను లలాటస్థలమున చేర్చి యభివాదన మొనర్చుటకు నిచట సమావేశమైన గ్రంథాలయాభిమాను లభ్యంతరము చెప్ప రని తలచుచున్నాను.

జనసామాన్యమును జ్ఞానవంతులను చేసి వారి కన్యోన్య స్నేహసహకార భావమును పెంపొందింపజాలిన ప్రతిష్ఠాపనము ధర్మగ్రంథాలయము. గ్రామజీవనమునకది కేంద్రస్థానము గావలయును. జాతి పరిజ్ఞానాభివృద్ధుల కేది సాక్షిభూతమో, గ్రామముయొక్కసమ సవ్యాపార పరిష్కృతి కది కూడలి స్థలము. అట్టి పవిత్రప్రదేశము నందును జ్ఞానసంపాదనప్రయత్నము దాని యుద్దేశసంకల్పముల నేమరి, చీట్లపేకాట, చతురంగములతో నచట పోరులు, జూనపులు కొన్నిచోట్ల ప్రారంభములు పుట్టురని తెలియుట శోచనీయము. మనదేశ శ్రేయమును సర్వదా కోరుచుండు రివరెండు పండర్లండు చీట్లపేకాటనుగూర్చి ప్రబుద్ధభారతి పత్రికలో వ్రాసినదానినిచట భాషాంతరీకరించి పొందుపరచుచున్నాను.

"ఉపయోగమునుబట్టిగాకున్న, పేకముక్క లితర కాగితపు ముక్కలవలెనే ప్రమాదకరములుగావు. వానిని నిరాక్షేపణీయవిధముగ నుపయోగించవచ్చునని మన మెరుగుదుము. వానినిగూర్చి రెండుమూడు విషయములు మాత్రము చెప్పవలసియున్నది. అవి జూదమున కుపయోగించు సామాన్య సాధనసామగ్రియై యున్నవి. ఒక యువకుడు మంచి ఆటకాడైనపక్షమున దానిమూలమున వానిని కవలీలగ జూదమాడు నలవాటు పట్టుబడగలదు. ఇంతేగాక పేకాటవలన, ఆటగానికి దేహపరిశ్రమమున కవకాశ ముండదు. టెన్నిసు మొదలగు ఆటలవలె నది తెల్లడిగ గాలిలో నాడుకొనునది కాదు. ఆయాటవలన వ్యర్థముగుకాలము అమితము. అది తల చూపినచో బుద్ధివైశద్య ప్రయత్నము కల్ల. ఈదేశపు (అమెరికాదేశపు) ఉత్తర దక్షిణభాగములందు వందలు వేలకొలది సంఘములు మానసికవిషయ చింతన మెరుగని మరణావస్థయం దున్నవి. బుద్ధికౌశలము చూడవలసిన కార్యమునకు వాని బుద్ధికొల్పశక్యము కాదు. దీనికి గారణము పేకాటవ్యసనమే? యూకరు మొదలగు నితర పేకాటకూటములకు జనులు గుంపులుగుంపులుగ పోవుచుందురు. అట్టివారి కితర శుభకార్యాచరణాపేక్ష కలిగించుట సాధ్యము గాదు. పేకాటయందీ చెడులక్షణము లిమిడియుండుటవలన నిది ప్రమాదకరవ్యసనమని గ్రహించి దానిదరికి జేరకుండుటయే శ్రేయస్కరము."

అమడలకొలది దూరముపోవు ఫిరంగిగుండ్లతో, వాయు విమానములతో విషవాయువులతో జలాంతర్గాములతో లోకసంహారను చేయుచున్న క్రైస్తవ, మహమ్మదీయ, బౌద్ధమత రాజ్యములువిజృంభించియున్న యీకాలమున - నిరాయుధులైన హిందువులు చతురంగసైన్యములను గ్రంథాలయములందు, పఠనమందిరములందు, క్లబ్బులందు వ్యాయామఫలకమునందుగాక వేరువిధమున నడిపించుట సాధ్యము గాకుండుటవలన వారికాలహరణక్రీడలు సమ్మతము లనబడదగినను, దేహాపరిశ్రమకుపయోగించుక్రీడలకు దొరకొని చతురంగమును కూడ పేటికాంతర్గతము గావించుట వివేక లక్షణ మని తెలుప సాహసించుచున్నందులకు నన్ను మన్నింప వేడెదను.

లండనునగరభాగమగు బ్లూమ్సుబెరీలో జాతీయ కేంద్రగ్రంథాలయ మిపుడు నెలకొల్పబడియున్నది. అది ప్రపంచమందలి గ్రంథాలయసంస్థలలో నుత్కృష్టమైనదని చెప్పుట యతిశయోక్తి కాదు. దానియందిపుడు 50 లక్షల పుస్తకములుకలవు. మన తెలుగుజిల్లాలన్నిటిలోగల గ్రంథములను లెక్కపెట్టినను దానిలో సగమైన నుండుననితోచదు. అందలి గ్రంథములను చదువుట కచట కెవ్వరును వెళ్లరు. ఆగ్రంథాలయాధికారికి పాఠకముఖసందర్శనలాభము చేకూరదు. అందలి గ్రంథములను చదువువారు పెక్కండ్రు, గ్రంథాలయము నెచ్చట నున్నదో యెరుగరు. వారందలి గ్రంథములను టపాద్వారా తెప్పించుకొని చదివి మరల పంపివేయుదురు. విజ్ఞానలోకమున గల సర్వవిషయముల గురించిన గ్రంథములు బ్రిటిషు ద్వీపములలోని పుస్తకభాండాగారములకు ప్రతిదినమచటనుండి కట్టలుగ టపా

లో పంపబడును. ఆకేంద్రగ్రంథాలయము బ్రిటిషుదేశమునకు జాతీయవిశ్వవిద్యాలయమువంటిదైనది. అది ఉచిత పుస్తకభాండాగార మగుటచే దేశమునందలియన్ని భాగములవారు తమస్థానిక గ్రంథాలయము ద్వారా అందలి గ్రంథములు తెప్పించుకొని తమస్వస్థలముననే వానిని చదువగలుగుచున్నారు. ఒకస్థానిక గ్రంథాలయమున పాఠకులు కోరిన గ్రంథ మందు లేనిపక్షమున, దానినిర్వాహకులు దాని కొరకు కేంద్రగ్రంథాలయమునకు వ్రాయుదురు. అచ్చట కూడ నది లభ్యము కానిచో వెంటనే దానియధికారు లాపుస్తకమును గురించి వాకబుచేయుటకు సాహిత్యాన్వేషణ శాఖవారికి (Literary Detective Department. తెలిపి వారిద్వారా సంపాదించి పంపుదురు. ఈచొప్పున శాఖవారు బ్రిటిషుదీవులందు, తదితర బ్రిటిషు రాజ్యభాగములందు గల 182 లయిబ్రరీలతో వ్యవహరించుచు నసంఖ్యాకములైన తమ గ్రంథరాజములను సులభముగ నితరులకు హస్తగతము గావించుచున్నారు. ఈగ్రంథసముదాయమున నవలలు (Novels) లేవు. వానిపఠనము చీట్లపేకాటవలె నిష్ప్రయోజక మని దాని యధికారులు తలపోసి వాని నందు చేర్చలేదేమో! దీనికొరకు నూత్నముగ నిర్మింపబడిన భవనమున మనజార్జిసార్వభౌముడు 1933 సంవత్సరము నవంబరు 27 తేదీని ప్రవేశమహోత్సవము జరిగించెను. ఆభవనమునం దింకను పదిలక్షల గ్రంథము లుంచుటకు చోటుకలదు. అందలి పుస్తకముల కొరకు దేశపు నానాభాగములనుండి దినమునకు సగటున 400 దరఖాస్తులచొప్పున వచ్చుచుండును. అట్టి దరఖాస్తులమీద గతవత్సరమున 61,680 పుస్తకములు టపాద్వారా యితరచోట్లకు బంపబడెను. పుస్తకముల నడుగకే సంజాయిషీమాత్రము కోరుచు వ్రాసిన ఉత్తరములందుతఱచుగ క్లిష్టప్రశ్న లుండును. వానికినిసత్వరముగ బ్రత్యుత్తర మంపుదురు. సట్టింజాయిషీ కోరినవిషయములు కొన్ని గ్రాహ్యములు. (1) పగిలిపోయినపింగాణి సామానులను మేకులతో బిగించుటెట్లు? బార్జిసు (Barges) రకము పడవలను కట్టుటనుగురించిన గ్రంథము లెవ్వి? (3) సోల్జరుబొమ్మలను చేయువిధము నేర్పుగ్రంథములు (4) నెపోలియను బోనపార్టి యుద్ధకాలపు నాటి అయుధవివరము. (5) జంతుకంకాళమును భద్రపరచు విధము. (6) స్లావోనిక భాషావ్యాకరణము. (7) దక్షిణ సముద్రద్వీప వృత్తసముదాయము. (8) దుస్తులలో కల్గిన మాత్సుల క్రమము తెల్పు గ్రంథములు.

సలానంతరమునకు పంపబడు గ్రంథములు తెలి పోచ్చినవియైనను, అవిపోయినవి కనపడలేదను వార్తయు వినబడుట యరుదు. ఇతరులకు పంపబడిన పుస్తకములు శిథిలములైనను, మురికియైనను, దానికి ప్రతిగ్రహీతలు, దానిబాధ్యతవహింతురు. ఈచొప్పునవారియుపరపై వారిక సంబంధభారము దామాషాయిగ నుండుటచేని నష్టమల్పముగనుండును. నిత్యము రవానాచేయబడుపని కాలికలకు నేర్పడును. గ్రంథములను తెప్పించుకొనుటకు తిరిగి పంపుటకయ్యెడు తపాలవ్యయమంతయు పాఠకులు వహింతురు గాన కేంద్రగ్రంథాలయమునకు వ్యయ మల్పము. ఇందలి గ్రంథములు సజీవములు నిర్జీవము లని రెండు విధములుగ విభజింపబడి యున్నవి. నిత్యమును తఱచుగ కోరబడు గ్రంథములు సజీవ భాగమునందు చేర్చబడియున్నవి. ఎప్పుడో, ఎన్నడో కోరబడు గ్రంథవములు, నిర్జీవగ్రంథభాగమున నుండును. 1916 వ సంవత్సరమున స్థాపింపబడినయీజాతీయవిశ్వవిద్యాలయ ప్రదాత ఆండ్రూ కార్నిజీ. నూటికి 10 మందియైన చదివినవారు లేక, వేయిసంవత్సరములనుండి దేశభాగ్యము తొలగి పోవుచున్న యీదేశమునం దట్టి గ్రంథాలయము తల నూపుటకు కొన్నిశతాబ్దములు పట్టునేమో.

బరోడా రాజ్యమున సంచార గ్రంథాలయములు గలవు. వానినిగూర్చి మీకు ప్రత్యేకముగ దెలుపబడును. ఇతరపట్టణములందు కొలదిగనున్న సభ్యులకే చెన్నపురి లిటరేరిసొసయిటీవారు గ్రంథములను పంపుచుండిరి. అది నే నెరుగుదును. ఒక్కపట్టణమున వివిధ భాగములందు జనసామాన్యమున కుచితవార్తాపత్రికా పఠన మందిరము లుండుటయు విజ్ఞానప్రదీపికే సాధనభూతము. సూరతుపట్టణము నాలుదిశల నట్టి మందిరములను నే జూచితిని. అవి యింకను వర్ధిల్లుచున్నవని నేదలచుచున్నాను. ఈసందర్భమున కలకత్తామ్యునిసిపలు కార్పొరేషను వారి ప్రయత్నములు శ్లాఘాపాత్రములు, 1919 సంవత్సరము మొదలు కార్పొరేషను వారు ప్రజాయత్త గ్రంథాలయములకు ధనసాహాయ్యము చేయుచు ప్రతియేట రు 58000 వెచ్చించుచున్నారు. నగర వివిధభాగములందున్న 146 లయిబ్రరీలవారి కాధనము పంచిపెట్టబడు చున్నది. ఆభాండాగారములం దిప్పుడు 8 లక్షల సంపుటము లున్నవి. ప్రతిగ్రంథాలయము సగటున 50 పత్రికలను కొనుచున్నది. ప్రతిగ్రంథాలయమునకు సగటున దినమునకు 200 పాఠకులు వచ్చుచున్నారు. ప్రతిలయిబ్రరీనుండి మొత్తముమీద 500 మంది పుస్తకముల నెరవుగ గొనుచున్నారు. అట్లు ఎరవుగ గొన్న

గ్రంథములు మొత్తము ప్రతి లయిబ్రరీకి 25,000 అయ్యెను. పాఠకు లందు గ్రంథముల నెరవు గొనువారి యందు ప్రాణవిద్య నెరుగనివారు విశేష సంఖ్యాకు లున్నారు. ఇందుమూలమున ప్రతి లయిబ్రరీ గ్రంథ సముదాయమునందు నూటికి 70 వంతు బంగాళీ గ్రంథములున్నవి. కార్పొరేషన్ వారొసగు సహాయద్రవ్యమంతయు పుస్తకములను వార్తాపత్రికలను కొనుటకే వినియోగింపవలయును. మరియు నా మొత్తమున కనీసము 10వ వంతు, ఆరోగ్యము, పారిశుద్ధ్యము దేహపరిశ్రమలను బోధించు ప్రచురణములను- 15 వ వంతు మతము నీతి తీర్థయాత్రలు, చరిత్రాత్మకవిషయగ్రంథములను- అథమ మైదవవంతు దేశీయపునరుద్ధారణ ప్రజ్వలన బోధకములగు గ్రంథముల కొనుటకు వినియోగింపవలె నను నియమము కలదు. అయావారుల కవున్సిలరు లందరు లయిబ్రరీకమిటీలలో గౌరవసభ్యులుగ నుందురు. లయిబ్రరీ నెలకొల్పబడిన గృహము దానికి సంబంధించిన పనులకే వినియోగింపబడ వలయును. (అచ్చట పేకాట చతురంగము కూడునని కాని కూడదని కాని నిర్ణయింపబడలేదు) ఈచొప్పున పాలీనా నియామకముగ నిచ్చు గ్రాంటుకు అదనముగ, చిరస్థాయియైన లయిబ్రరీకి ప్రత్యేకవిరాళము లిత్తురు. కాకినాడ పట్టణమున మ్యునిసిపలువారు పురమందిర మందలి పుస్తక భాండాగారమునకు, రామారావుపేట భాండాగారమునకు ద్రవ్యసాహాయ్యము నిచ్చుచున్నారు. రామచంద్ర వేంకట కృష్ణరాయ పుస్తకభాండాగారమునందు వార్తాపత్రికల నేర్పాటుచేయక పోవుటవలన నాపఠనమందిరము ప్రజారంజకము కాకపోవుట సరియే కదా; క్రమముగ దిగజారుచున్న దని నేను విన్నవింప సాహసించుచున్నాను. జిల్లాలోని పుస్తక భాండాగారములందు వాసికెక్కియున్న పోలవరం జమీందారుగారి పుస్తక భాండాగారమున వార్తాపత్రికా పఠనమున కేర్పాటు చేయుటకును తెలుగుగ్రంథముల నింకను విరివిగ తెప్పించుటకును, పాఠకులు రాత్రి కొంతకాల మచట నిలిచి చదువుకొనుటకును బహిరంగ సభలు పాఠకుల కడ్డము రాకుండ ప్రత్యేకస్థల మేర్పాటు చేయుటకును, ఆ లయిబ్రరీ కార్యనిర్వాహకులను వేడుచున్నాను.

ఇపుడు పట్టణములందు పెద్దగ్రామములందు లోకల్ బోర్డులవారు మునిసిపల్ సంఘమువారు ప్రత్యేక పుస్తకభాండాగారములను స్థాపించుటో ఉన్నవానికి ధనసహాయ మొసగుటో, లేక తను తమపాఠశాలలలో లైబ్రరీగ్రంథము లనబడువాని నమర్చి యుంచుటో వాడుకయైనది. క్రమముగా ప్రతిసంవత్సరము కాకున్నను కొన్నియేండ్లనుండి దొరతనమువారు రాజధాని యాదాయమునుండి లైబ్రరీల పోషణము నిమిత్తము కొలదిపాటి ద్రవ్యసహాయము చేయుచున్నారు. ఆ ద్రవ్యప్రదానవిధానము సంకటమార్గ ప్రయాణమువలె నున్నది. “చెరిసగాయస్వాహా- అల్లాగైతే మాభాగైదం న మమ” అను హాస్యగ్రాహ్యోక్తి కనుగుణముగ నీద్రవ్యప్రదానము నడచుచున్నది. ఆసాహాయ్యమును బడయుటకుముందు స్థానిక పరిపాలనసంఘమువార యనుగ్రహాభిమానముల బడయవలయును. కొన్నిస్థలములందు వారి యనుగ్రహము భాండాగార నిర్వాహకుల జాతికులములనుబట్టియు వారిస్థానిక రాజకీయ సంబంధముల పైనను ఆధారపడియుండును. చాల విలువ కలిగిన పుస్తకములతో నిండియుండి విశాలమైనభవనమున నెలకొల్పబడి పనిచేయుచున్న గ్రంథాలయములకు, ప్రెసిడెంటు ఛైర్‌మను ఎన్నికలలో తోడ్పడినవారు నడుపుచున్న నామమాత్ర పుస్తకాలయముల కిచ్చినంత విరాళమునైన ననుగ్రహింపని నిదర్శనములు కలవని చెప్పుదురు. ఇది సత్యము కావచ్చును. ఇది యిట్లుండ, దొరతనము వారొసగిన విరాళముతోను స్థానికపరిపాలనా సంఘములు భాండాగార నిర్వాహకులు సమకూర్చిన ద్రవ్యముతోను కొనవలసిన గ్రంథములను జిల్లా విద్యాశాఖాధికారులు ముందుగ నామోదించవలెను. వీరిలో రకరకముల తత్వములవా రున్నారు. భాండాగారాధికారులు నిబంధనానుసారముగ సిద్ధము చేసి పంపిన పుస్తకముల జాబితాలోని గ్రంథములన్నిటిని వీరు చదివియుండుట యసాధ్యము. టాల్‌స్టాయిగ్రంథముల కొనగూడదను అధికారి యొకడు, బెర్నార్డుషా గ్రంథములు కూడదనువా డొకడు, రివరెండు చార్లెసు ఆండ్రూసు ప్రకటనములను నిషేధించువాడొకడు, మహాత్మాగాంధినిగూర్చిన పుస్తకములు గ్రంథాలయములో నుండ గూడదని అభ్యంతరము చెప్పువా డింకొకడు. ఇట్టి చిత్తవిభ్రమము కలవారితో భాండాగారనిర్వాహకులు కలిసిమెలసి తిరుగుచు కృతకృత్యులు కావలసియున్నది. ఈ కష్టనివారణమునకు దానభేదోపాయములు రెండును సహాయభూతము లగుచున్నవి. సామాన్యముగ పల్లెటూళ్ళలోని గ్రంథాలయములలో జానపదుల వ్యవసాయాది గ్రామవృత్తుల వృద్ధికి తోడ్పడగల గ్రంథజాలము లేదు. ఎక్కడ చూచినను రామాయణము, భారతము, భాగవతము, అధ్యాత్మరామాయణకీర్తనలు, రామదాసుచరిత్ర మొదలగు పురాణవిషయబోధకము

# 6వ ఆంధ్రదేశ గ్రంధాలయ మహాసభ

## కాకినాడ





ఆహ్వానసంఘ అధ్యక్షులగు
దుగ్గిరాల వేంకట సూర్యప్రకాశరావుగారు

# ప్రథమాంధ్ర గ్రంథాలయ ప్రచారకుల మహాసభ

కాకినాడ



ఆహ్వాన సంఘాధ్యక్షులగు
నేత్రకంటి యోగానందరావుగారు
బి. ఏ., ఎల్. టి.,



అధ్యక్షులగు
శ్రీమతి బొడ్డపాటి సీతాబాయమ్మగారు

లగు గ్రంథములుమాత్రమే కానవగును. గ్రామవాసులకు హరికథలు, ఉపన్యాసరూపమున బోధింప తలపెట్టితిమేని కుచేలోపాఖ్యానము, సీతాకళ్యాణము, ప్రహ్లాదచరిత్ర, గరుడగర్వభంగము, ద్రౌపదీవస్త్రాపహరణము, సావిత్రీపరిణయము మొదలగు పురాణగాథలే ప్రత్యక్షమగును. అంతటితో సంతుష్టిపడిన లాభములేదు. నవీనశాస్త్రజ్ఞానము గూడ వారికి లభింపజేయవలెను. ఆలమూరు గ్రామపునర్నిర్మాణసంఘమువారివలె మూడు నాల్గు పరిస్థితులు చేజిక్కియుండి కొంత సిరాదాయముకూడ కనబడుచుండినప్పుడే ప్రజాక్షేమకరమగు పని సాధ్యమగును.

జనపదములందు లైబ్రరీలు సర్వవిధవ్యాపారములకు చేయూతగ నుండి తోడు నీడగావలెనని పెద్దలు బోధించుచు పాశ్చాత్యదేశములందలి యాదర్శములను మనమనోనేత్రముల యెదుట విప్పిచూప యత్నింతురు. స్వపరిపాలనముగల రాజ్యములలోని ధర్మములు, ఆచరణములు మన కెట్లు సాధ్యమగును.

కర్షకులకు ప్రకృతశాస్త్రపరిశోధకులకు, సాహిత్యచిత్రకళాచరిత్రాభిమానులకు గ్రామసాంఘిక ఆర్థికపారిశ్రామికాభివృద్ధికుతూహలులకు గ్రామభాండాగారములు తోడ్పడవలసినరీతిని తెల్పుగ్రంథములను చదివి లాభము పొందింపవలెనని-రాజధానినగరములనుండియు విశ్వవిద్యాలయములనుండియు విచ్చేసిన వక్తలు, ఆచార్యులు మనకు తరుచుగ బోధించుచుందురు. వారియుపదేశవాక్యములు మబ్బులోని మెరుపులవలె తాత్కాలికముగ మనదృష్టికి మిరుమిట్లు కొలిపి వెంటనే మనలనంధకారమగ్నుల గావించును. జాతిమతశాఖాభేదములు, మన రాజకీయవ్యవహారనాట్యరంగమున పాత్రలైయున్నంతకాలము మన పుస్తకభాండాగారములును ఇతరప్రయత్నములవలెనే వృద్ధినిగాంచనేరవు. ఏ బరోడా మహారాజు వంటివాడో పూనుకొని తన నైజవిద్యాభిమానమును స్వప్రజాభివృద్ధ్యౌత్సుక్యమును విజృంభింపజేసినవాడుగాని శ్రేయస్కరమగు నీయుద్యమము అచిరకాలమున దేశమున కొనరింపవలసినంత మేలును చేకూర్పజాలదు. విద్యాధికులు, విద్యాభిమానులు తమ తీరికకాలమును నిష్ప్రయోజకములగు విషయములందు వ్యర్థపుచ్చక సాధ్యమైనంత సహాయమును జనబాహుళ్యమున కొసర్చి అయ్యంకి వెంకటరమణయ్య, సూరి వెంకటనృసింహశాస్త్రి ప్రభృతులారంభించి సాగించుచున్న యీయుద్యమమును సార్థకముగావించి, ఆంధ్రదేశమునకు వన్నె తెత్తురుగాక.

## శ్రీ ఇప్పగుంట సుబ్బకృష్ణయ్య ఎం. ఏ, బి. యస్‌సి. గారి ప్రారంభోపన్యాసము :

సుమారు పదియారుసంవత్సరములకు పూర్వము నాకీ యుద్యమముతో కొంత సంబంధ ముండియుండెను. ఈ మధ్యకాలములో నీయుద్యమ మెన్నియో విధముల నభివృద్ధి గాంచినది.

ఆంధ్రగ్రంథాలయోద్యమము విషయమై అభిప్రాయభేదములు లేవు. మన మందరము ఐకమత్యముతో ఒకచోట కలిసి పనిచేయుటకు ఈ యుద్యమ మవకాశ మిచ్చినది. పాశ్చాత్య దేశములలో జాతీయభావము కలిగి యున్నవారు కొద్దిమంది మాత్రమే యుందురు. మిగిలినవారు సాంఘిక, పారిశ్రామికములందు దేశము నభివృద్ధిలోనికి తెచ్చుటకు ప్రయత్నింతురు. మన దేశములో నట్లు లేదు. మనలో సాంఘికమతభేదము లున్నవని యందురు. కాని దేశీయ గ్రంథములను మహమ్మదీయులు కూడ జాగ్రత్తగ కాపాడి నట్లు ఋజువు కలదు.

పాట్నాలో నుండెడి 'ఖుదాబక్ష్' అను అద్భుత గ్రంథాలయమును నేను స్వయముగా చూచితిని. దానిని అందరును అవకాశము కలుగజేసికొని చూడగోరెదను.

అప్పటికప్పుడు ప్రచురణమైన నూతన గ్రంథములతో గ్రంథాలయములను నింపి చదువరుల కాకర్షణము గలుగజేసి ప్రోత్సహింప వలెను. అమెరికాలో గ్రంథాలయమునందు ఏగ్రంథము కావలసిన ఆగ్రంథము దొరకును. మరియు పెద్దపఠనాలయము లుండుటచేత ప్రపంచములో నుండెడు ఏ దేశములోని పత్రికలైనను దొరకును. సంగీతము నేర్చుకొనుటకు వివిధదేశములం దుండెడు భేదములను తెలిసికొని సమకూర్చుకొని ఆరితేరినవారగుటకు, గానగ్రంథాలయము లుండును. గ్రుడ్డివారికి జ్ఞానోదయము కలుగుటకు లైబ్రరీలు కలవు. చిత్రకళాభివృద్ధికి ఆర్టు లైబ్రరీలు ఆర్టుగ్యాలరీలును కలవు. న్యాయాధ్యక్ష పట్ట

ణము నందలి గ్రంథాలయములందు శాశ్వతముగా ఆర్టుగ్యాలరీలున్నవి. ప్రతి పట్టణమునకు నాటకశాల, మ్యూజియమ్, ఆర్టుగ్యాలరి, గ్రంథాలయము (అనగా నేటి గ్రంథములు పత్రికలుకూడ దొరకునట్టిది) మన దేశములోకూడ ఉండవలెను. ప్రతి గ్రంథాలయమునకును ఒక అంగముగా పఠనమందిర ముండవలెను. అమెరికాదేశమందు ఆయా వయస్సులుగల పిల్లలకు అనుగుణముగా తరగతులప్రకారముగా బాలుర గ్రంథాలయములును ఆయాదేశములందు గలవు. పిల్లలకు చక్కగా బోధింపగల నిపుణులుగూడ యుండి వారికి చెప్పుచుందురు. ఇట్టిరీతిగానే మనదేశమందుకూడ నేర్పడ వలెను. అమెరికాలో పిల్లలు గ్రంథాలయములోనికి వచ్చునపుడు చేతులు శుభ్రము చేసికొని పుస్తకములు ముట్టుకొనేటట్లు నేర్పుదురు.

ఆ దేశమందలి కొన్ని గ్రంథాలయములలో భోజనమునకు కావలసిన అవకాశము కూడ చేయుబడినది. బోస్టన్‌లో గొప్పఆర్టుగ్యాలరీయు ఆర్కెస్ట్రల్ హాలును గలవు. మాసమునకు రెండుపర్యాయములు గానప్రదర్శనము లివ్వబడును. గాన, కళా, చరిత్ర, ఇతిహాస సంబంధములైన విషయములు అట్లు అచ్చట పిల్లలకు పెద్దలకు నేర్పుచుండునపుడు మనదేశములో నేల యట్టి ప్రయత్నము చేయరాదు!

మీరు డబ్బులేదని అనవచ్చును. కాని డబ్బు వినియోగించెడి తెలివిని మనము సంపాదించలేదని చెప్పవలసియున్నది.

చికాగో యూనివర్సిటీలైబ్రరీలో 20 లేక 25 గురు విద్యార్థులున్నప్పటికి 1,50,000 గ్రంథములు ఆ గ్రంథాలయములో గలవు. దానినిబట్టి అచ్చటి యభివృద్ధిని మీరు గ్రహింపుడు. మందులమ్ము షాపులు ప్రతివీధిలో నుండును. అట్టిషాపులందు కొన్ని పుస్తకములుండును. కావలసినవారు 5 సెంట్లు లేక రెండుఅణాలు అక్కడ పెట్టి ఒకవారము కావలసిన పుస్తకములను వారు ఎరువుతీసుకొని వెళ్లుచుందురు. ఈవిధముగా కూడ ప్రజలలో ప్రబోధము జరుగుచుండును.

ఆదేశములందు ఈ గ్రంథాలయోద్యమమును జనులందరికి సంబంధముగల ఉద్యమముగా చేసి (mass movement) అందరును అభివృద్ధినొందిరి. అటిస్థితి మనదేశమందు కూడ వచ్చి జనులందరును విజ్ఞానాభివృద్ధిని పొందెదరని కోరెదను.

## ఇతర ఉపన్యాసములు మొదలైనవి.

### యాతగిరి లక్ష్మీవేంకటరమణగారికి గౌరవము.

పిమ్మట శ్రీయాతగిరి లక్ష్మీవెంకటరమణగారు "గ్రంథాలయ ఆధునిక జీవితము" అనెడి వ్యాసమును చదివి వినిపించిరి. సుమారు ఇరువది సంవత్సరములనుండి గ్రంథాలయోద్యమమునకు వారు చేసినసేవను అభినందించుచు సన్మానసంఘమువారు ఒక ఖద్దరుశాలువను ఆయనకు బహుమతి చేసిరి.

తరువాత వంగిపురపు జగన్నాథరావుగారు (తెనాలి) గ్రంథాలయ ప్రచారమును గురించి ఇట్లు ఉపన్యసించిరి.

గ్రంథముల నిలయమే గ్రంథాలయము. ఇది చరాచర భేదముచే ద్వివిధము. విద్వాంసులే చరగ్రంథాలయములు. వారి విజ్ఞాన ఫలంబగు గ్రంథములు అచర రూపము. ఈరెండు అన్యోన్యసహాయముచే శోభిల్లును.

గ్రంథాలయము, గ్రంథములు పాఠకులు పాలకులను మూడంగములు గలిగియుండును.

జీవులు సకలదుఃఖనిదానమగు అజ్ఞానమును బారద్రోలి నిరతిశయానంద రూపమగు బ్రహ్మజ్ఞానమును ప్రకాశింప జేయుటయే యీ యుద్యమలక్ష్యము. ఇట్టి లక్ష్యమును దృక్పథమునం దిడుకొని తత్త్వాలయములు ప్రజలలో జ్ఞానసాధనమగు చిత్తశుద్ధిని చేకూర్పవలెను. ఇట్టిసేవ గ్రంథములకంటె గ్రంథాలయభాండాగారి సేవానైపుణ్యముపై నాధారపడియున్నది.

ప్రతి ఆదివారము ఉపన్యాసములద్వారా విద్యార్థులకు నియమిత కాలాచరణము, బ్రహ్మచర్యము భక్తి, సత్యము, శాంతము, స్థైర్యము, పరోపకారము, అహింస, ఆత్మవిశ్వాసాదిసద్గుణములు బోధించవలెను. పురాణగాథలచే బాలబాలికల నిర్మలహృదయ ఫలకములందుత్తమభావముల నాటవలయును. 'భావానయనే ద్రవ్యానయనం' అను న్యాయానుసారము భావానుగుణసిద్ధి కలిగితీరును.

విద్యార్థులుపన్యాసాదిశ్రవణముచే గ్రహించిన విషయములు స్వయముగ ఉపన్యసించుట ఉపయు

కము. ఇట్లు శ్రవణమననములచే గ్రహించిన జ్ఞానమును ఆచరణలోనికి మార్చిన అమృతమగును. గ్రంథాలయము లిట్టివారిని తయారుచేయుట తత్పాలకుల ఆదేశమువలన గాక ఆచరణమూలముననే. ఆచరణనిరతులగు పాలకులు పాఠకులుగూడ విద్యుద్దీపములవలె తమజ్ఞాన దీపికలచే దేశమంతయు తేజోమయం బొనర్పగలరు. అదియే యీ యుద్యమ సాఫల్యము.

ఈదృశ మహాసభలలో విద్యాలయములలో నుపన్యాసాది పోటీలు పెట్టి ప్రోత్సహించుట యుద్యమాభివృద్ధి హేతువు.

గ్రంథాలయ రూపిణియగు సరస్వతి యీయుద్యమ సేవకుల శక్త్యుత్సాహము లుద్దీప్తములుగా నొనర్చుగాత !

శ్రీమతి బొడ్డపాటి సీతాబాయమ్మగారు (బెజవాడ) ఉపన్యసించుచు ముఖ్యముగా స్త్రీలకు విద్యగఱపవలె ననియు, వారిని విద్యావతులుగ జేసినగాని దేశాభివృద్ధి కానేరదనియు, ప్రతి గ్రంథాలయమందును స్త్రీలను పెక్కుమందిని చేర్చుకొని గ్రంథాలయమువలని ప్రయోజనమును పొందునట్లుగ వారికిగూడ ప్రచారప్రబోధపద్ధతులు నేర్పవలసినదనియు చెప్పిరి. స్త్రీలు గ్రంథాలయోద్యమమున జేరుటకు పురుషులు కూడ తోడ్పడవలెననియు, బహిరంగముగా నొకమాట చెప్పుచు, చాటున భార్యలను గ్రంథాలయములకు రానీయక పోవుట తా మెరుగుదుమనియు, ఇట్టి సాకులు మాని నిజమైనసేవను స్త్రీలుకూడ చేయునట్లు పురుషులు తోడ్పడవలయుననియు ఆమె చెప్పెను.

పురుషుడును స్త్రీయు ఒకరికొకరు తోడ్పడి గ్రంథాలయోద్యమమునకును, విద్యాభివృద్ధికిని దేశోన్నతికిని తోడ్పడవలెననియు ఆమెచెప్పెను.

బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు పురాణములసంగతి, వానియొక్క ఔన్నత్యమును, ఉదాహరణములతో వివరించుచు ఇట్లు చెప్పిరి. "పురాణములను మిథ్ (myth, mythology) అని తృణీకరించుచున్నారు. మన పురాణములను చదివి మన సాంప్రదాయచరిత్రలు చదివినపుడు అందలి స్వారస్యమును అందలి మంచిని గొప్పతనమును మనము గ్రహించినవార మగుదుము. ఇతరదేశ పురాణములను విదేశ చరిత్రలను చదివిన అట్టి మంచిఫలము కలుగ నేరదు.

విషయమును సరిగా తెలిసికొనలేక పురాణములను నిందింతుము. పురాణములందు అన్నినీతులు, రాజనీతులుకూడ కలవు. అట్టివానిని చక్కగా పఠించి తెలిసికొని ఆచరణలో బెట్టవలెను. పురాణములను చక్కగా పఠించి చక్కగా అర్థమును గ్రహించి వాటిని గౌరవించవలెను."

శ్రీ కొత్తపల్లి సూర్యారావుగారు పాండురంగమాహాత్మ్యమున పుస్తకభాండాగార సందర్భమును పఠించుచుండ శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు అర్థమును వినిపించిరి. ఒక స్త్రీరత్నము పుస్తకభాండాగారమును కాపాడి అనుకూలముగా నుంచుటను గురించి అందు చెప్పబడెను. ఈ విధముగా పూర్వకాలమున ఇంటింటికి గ్రంథాలయములు గలవనియు, అందరి యుపయోగమునకు నున్నవనియు చెప్పి తిరుపతిగ్రంథాలయమును గురించి చెప్పిరి.

పిదప శ్రీమాన్ యియ్యుణ్ణి అప్పలాచార్యులు గారు సభ్యులానందించునట్లు వీణాగానమును వినిపించిరి.

అంతటితో మొదటిదినము సభ ముగింపబడెను.

తిరిగి 22 వ తేదీ మధ్యాహ్నము 3 గంటలకు సభ సమావేశమయ్యెను. శ్రీ వేమవరపు రామదాసుపంతులుగారు అధ్యక్షత వహించిరి.

## శ్రీ వేమవరపు రామదాసు పంతులుగారి అధ్యక్షోపన్యాసము.

### ఆంధ్రదేశములో ఉద్యమము

86 సంవత్సరములక్రిందట అనగా 1898 సం॥ లో పశ్చిమ గోదావరిజిల్లా యందలి కుముదవల్లి గ్రామములో ఆంధ్రనాయకమణియు, దేశభక్తుడును నగు శ్రీ॥ శ్రీ॥ గంజాము వెంకటరత్నం పంతులుగారిచే మన మొదటి గ్రంథాలయము స్థాపింపబడెను. ఇప్పటికిని ఈగ్రంథాలయము మంచిస్థితిలో నున్నది. దానికిమంచి భవనము, కొన్నివేల ఉత్తమ గ్రంథములుగలవు; గ్రామమునకు ఈ గ్రంథాలయము నిరుపమానసేవ గావించుచున్నది. ఈ గ్రంథాలయ మితరగ్రామములలో నేర్పరుపబడగల గ్రంథాలయములకు ఆదర్శప్రాయముగాగూడ నున్నది.

ఆంధ్రగ్రంథాలయోద్యమ నాయకులును అందును నామిత్రులు, కీర్తిశేషులైన ఎస్. వి. నరసింహశాస్త్రి గారి వంటివారల ఉత్సాహాతిశయముచేతను, కార్యదీక్షచేతను, గ్రంథాలయోద్యమము ఆంధ్రదేశ మంతటను వెల్లివిరిసినది. గ్రంథాలయోద్యమాభివృద్ధికి ఆంధ్రదేశము తగువిధమున కృషిచేసినది. 10 సంవత్సరములకిందట ఆంధ్రరాష్ట్రములో 400 గ్రామ గ్రంథాలయము లుండినట్లు లెక్కవేయబడినది. ఇప్పుడవి ఇంకను అభివృద్ధి జెందియున్నవి. వీనిలో కొన్ని, గ్రామ గ్రామములకు బోయి ప్రజలకు పుస్తకము లందిచ్చి జ్ఞానాభివృద్ధిచేయుచుండెను. వీనిలో కొన్ని, ప్రత్యేకముగా స్త్రీజనాభివృద్ధి కేర్పడియుండెను. గ్రంథాలయములు కేవలము గ్రంథములుండు తావులు మాత్రమేగాక జనసామాన్యమునకుజ్ఞానజ్యోతిని ప్రసాదించు సంస్థ లని గూడ మొదటినుండియు ఆంధ్రులు తలచుచుండిరి. పాఠశాలలు, కొందరు బాలబాలికలకు మాత్రము విద్య నొసంగగలవు. కాని భారతదేశప్రజలలో నత్యధిక సంఖ్యాకులు నిరక్షరాస్యులు. ఈనిరక్షరాస్యతను పోగొట్టుటకు గ్రంథాలయములు సాధనభూతములు కాగలవని యిప్పుడు గ్రహింపబడినది. పశ్చిమదేశము లందువలె గ్రంథములు చదివి జ్ఞానము పొందదగినవారు మనదేశములో చాలతక్కువ. ఏలయనగా చాల మందికి అక్షరజ్ఞానమే లేదు. కావున ఆంధ్రగ్రంథాలయోద్యమనాయకులు ప్రజలకు జ్ఞానాభివృద్ధి కలుగజేయుటకు జాతీయములగు పద్ధతుల నవలంబించుచున్నారు. గ్రామ పౌరాణికుడు, ఇంటింటికి తిరుగు హరిదాసులు, సంగీతనాటకులు మున్నగువారు అక్షరజ్ఞానము లేని గ్రామస్థులకు జ్ఞానదానము చేయుటకు ఉపయోగపడగలరు. ప్రజల విద్యాభివృద్ధికి దేవాలయోత్సవములు, తీర్థయాత్రలు, వీథినాటకములు, గ్రామములో రామభజనలు మున్నగునవి చక్కగా ఉపయోగ పడగలవు. దేశభాషలలో రాజకీయ సాంఘిక, ఆర్థిక వాఙ్మయమును సృష్టించుటకు విజ్ఞానులను ప్రోత్సహింపవచ్చును. ఆయా ప్రదేశములందలి ప్రజలకు జ్ఞానము ప్రసాదించుటకై ప్రదర్శనములు, మ్యాజిక్ లాంతరులు మున్నగువాని నెక్కువగా నుపయోగింప వచ్చును. చదువగల వారికి ఉత్తమ గ్రంథములను తెప్పించి గ్రంథాలయములలో నుండి, యిచ్చుచుండుట మాత్రమేగాక, అక్షర జ్ఞానము లేనివారికి పై పద్ధతుల మూలకముగా గ్రంథాలయ సంఘములు ఉపయోగ పడదగును, ఆంధ్ర గ్రంథాలయోద్యమ నాయకులు ఈపద్ధతులను, ఉద్దేశములను మనమునం దిడుకొని కృషి సల్పుచున్నారని తెలిసికొనుటకు సంతసమగుచున్నది. మన గ్రంథాలయములను ప్రతిగ్రామమునందును మంచిపద్ధతులపై స్థాపించుటయే ముందు మన ముఖ్యకర్తవ్యమై యున్నది.

గ్రంథాలయములయొక్క లాభములను గురించియు వాని నేర్పఱచి నపుడు పద్ధతులను గూర్చియు నేను ఇచ్చట వివరింపదలపలేను. మద్రాసు ధర్మగ్రంథాలయచట్టము విమర్శించి, పరీక్షించుటయే నాయుద్దేశమై యున్నది.

## ధర్మగ్రంథాలయ చట్టము.

1930 సంవత్సరములో ఎస్. ఆర్. రంగనాథను గారు విశ్వవిద్యాలయ గ్రంథభాండారిగా నుండెను. అప్పుడు ఆయన రచియించిన "గ్రంథాలయశాస్త్రము యొక్క ఐదుసూత్రములు" అను గ్రంథములో నొక ఆదర్శప్రాయమగు ధర్మగ్రంథాలయచట్టమును వ్రాసి మొదటి అఖిల ఆసియావిద్యావిషయిక సభవారికి నివేదించెను. అప్పుడు ఈ రాష్ట్రమున ధర్మగ్రంథాలయచట్టముండవలె నను ఉద్దేశము కలిగినట్లు తోచుచున్నది. అది పాశ్చాత్యదేశములయందలి గ్రంథాలయ శాసనములను బోలియుండెను. 1933 సం|| 11 వ అనధికారబిల్లు (మద్రాసు శాసనసభ్యులగు బషీర్ అహమ్మద్ సయ్యదుగారి ధర్మగ్రంథాలయచట్టము) రంగనాథముగారి పుస్తకములోని చట్టమును బోలియున్నది. ఇది 1933సం|| అగస్టు 15 వ తారీఖున ఫోర్టుసెంటుజార్జి గెజెట్టులో ప్రకటింపబడి యిప్పుడు ఉపసంఘమువారి విచారణయందున్నది. ఈబిల్లును ఆల్ ఇండియా పబ్లిక్ లైబ్రరీ అసోసియేషనువారు పరీక్షించి, విమర్శించిరి. ఈసంఘముయొక్క అధ్యక్షులగు డా. వంగల శివరాముగారు తనసంఘమువారి విమర్శనాధారము చేసికొని ఒక సవరింపబడిన ఆక్టును ప్రచురించెను. సవరణలకు ఆయన వివరముగూడ వ్రాసియుండెను.

మద్రాసుబిల్లుకు చేర్చబడిన ఉద్దేశములు, కారణములనుబట్టి చూచినచో దాని ముఖ్యోద్దేశములు రెండుగా నగుపడుచున్నవి. ఒకటి గ్రంథాలయముల నభివృద్ధిపరచుటకును, వీనిని నియమించుటకును నేర్పాటులు చేయుట. రెండవది వయోజనులలో నిరక్షరాస్యతను బాపుటకు తగిన యేర్పాటులు చేయుట.

మద్రాసుబిల్లులో రంగనాథంగారి ఆక్టునందుగల ముఖ్యసెక్షనులు కనబడుటలేదు. గ్రంథాలయముల

నేర్పరచుటకును, వీరికి ద్రవ్యసహాయము చేయుటకును రంగనాథముగారి ఆక్టులో మంచియేర్పాటు లుండెను. రంగనాథముగారి ఆక్టునందలి 9 వ సెక్షనులో స్థానిక లైబ్రరీ అధికారులు తమ శక్త్యనుసారము ద్రవ్యము నిచ్చుటకు నేర్పాటులు కలవు. 12 వ సెక్షనులో లైబ్రరీని పరిపాలించుటకు నేర్పాటు కలదు. 17 వ సెక్షనులో ప్రభుత్వమువా రివ్వదగిన మొత్తమువిషయముకలదు. కావున రంగనాథముగారి చట్టములో ప్రభుత్వమువారు ద్రవ్యసహాయము చేయవలసినటులు గాను, గ్రంథాలయాధికారులు గ్రంథాలయములను పరిపాలించు నట్టివారుగా నుండవలసినట్లును కలదు.

## మద్రాసుబిల్లునందలి ముఖ్యషరతులు

రంగనాథం గారి ఆక్టునందలి షరతులు మద్రాసు బిల్లులో లేవు. ఈ బిల్లు ప్రకారము ఒక క్రొత్త గ్రంథాలయము సైవను నేర్పరిచి, దాని నిర్వహించు బాధ్యత ప్రభుత్వమువారిమీద గాని వా రేర్పరచు అసంఖ్యాకములగు ఉపసంఘములమీద గాని శాసన పూర్వకముగా నుండదు. ఒక భవనమును నిర్మించుటకును, దానిలో కుర్చీలు బల్లలు మొదలైనవాని నేర్పరచుటకును, బంట్రోతును నియమించుటకును, విరాళము సంగీకరించుటకును, గ్రంథాలయాధికారుల కది అధికార మొసఁగుచున్నది. ఈ షరతు రంగనాథముగారి ఆక్టునుండి వ్రాయబడినది. ప్రభుత్వమువారును, స్థానిక సంస్థలును గ్రాంటులిచ్చు విషయమై బిల్లులో సెలెక్టు కమిటీవారు క్రొత్త షరతు కలుపుచున్నారని ఒకటి రెండు రోజులక్రిందట వెలువడిన ప్రభుత్వప్రకటన తెలుపుచున్నది. దీని నిజస్వరూపము తెలియదు. విధిగా గ్రాంట్లనివ్వవలెనో లేక గ్రాంటులనిచ్చుట ఐచ్ఛికమో తెలియదు. బిల్లులోని తక్కిన భాగమును రెండు విధములుగా విభజింపవచ్చును. ఒకటి ప్రావిన్షియల్ లైబ్రరీ కమిటీయని పిలువబడు కేంద్ర గ్రంథాలయ నిర్వాహక వర్గమునకును (6 వ సెక్షను) స్థానిక గ్రంథాలయ సంస్థలకును, (ఏడవ సెక్షను) స్థానికగ్రంథాలయ కమిటీలు (తొమ్మిదవ సెక్షను) జాయింటుకమిటీలకు, (13 వ సెక్షను) రీజియనలు కమిటీలకు, (14 వ సెక్షను) మున్నగువాని నిర్మాణమునకు సంబంధించియున్నవి. రెండవ భాగము గ్రంథాలయముల నియమమునుగూర్చియు, వాని లెక్కలతనిఖీ, నివేదికలు, ఆడిటు మున్నగువానికి సంబంధించినవి.

దీనిలో మూడవభాగముకూడ నున్నదని చెప్పవచ్చును. నేరములు, వానివిచారణ, వానికి శిక్ష మున్నగునవి ఈ భాగమునకు జెందినవి. గ్రంథాలయములను వియమించుట సరిగా జరుగదేమో యనుభయమువ గ్రంథాలయాధికారులు బైలాలుచేసి తమయిష్టమువచ్చినట్లు గ్రంథాలయములను ఉపయోగించుట, తమ యిష్టమువచ్చినట్లు ప్రజలను చేర్చుకొనుట మున్నగువాని విషయమై బైలాలు చేయవచ్చునని తెలుపబడుచున్నది. (19 వ సెక్షను) తమయిష్టమువచ్చిన గ్రంథములు వారు తెప్పించుకొనవచ్చును. ఈ విషమషరతుండుట వలన జాతీయవాఙ్మయము నిషేధింపబడవచ్చును. రాజకీయ వాఙ్మయము, ఖద్దరుమీద పుస్తకములు అటావాఒడంబడిక, బొంబయి లాంకషైరు ఒడంబడికను ఖండించు గ్రంథములు నిషేధింపబడవచ్చును. ఇప్పుడుగూడ గ్రామ గ్రంథాలయ పుస్తకములను తెప్పించుకొననిచ్చుటలో పోలీసు సర్కిల్ ఇనస్పెక్టరుకును, వారి యనుచరులకును సెక్కువఅధికారము లివ్వబడియున్నవని చాలమందికి తెలియదు. ఈ గ్రంథాలయములలోనికి ఖద్దరు, గాంధిటోపి ధరించువారికి ప్రవేశము లేకుండ పోవచ్చును. ఇట్టివారు మీతూర్పుగోదావరి జిల్లాల యందలి రాజమార్గముల మీదికి గూడ రానివ్వబడలేదని మీకు తెలియును.

నేరములకు శిక్షలు చాలా తీవ్రముగా నున్నవి. ఈ శాసనమునకు గాని, దానిక్రింద చేయబడు నిబంధనలకుగాని వ్యతిరేకముగా చేయువారిని క్రిమినల్ ప్రొసీజరు కోడ్డు 22 అధ్యాయము ప్రకారము విచారించి శిక్షించుటకు అధికార మివ్వబడుచున్నది.

ఈ గ్రంథాలయముల మీదను కమిటీల మీదను ఇనస్పెక్టర్ ఆఫ్ లోకల్ బోర్డు అండ్ మునిసిపాలిటీలు ప్రధానాధికారిగా నుండును. ఈ యనదే పబ్లిక్ లైబ్రరీల డైరెక్టరు. గ్రంథాలయము లన్నియు అన్ని విషయము లందును ఈ ఉద్యోగియునికి యితనిద్వారా లోకల్ సెల్ఫుగవర్నమెంటు మంత్రికిని బాధ్యత వహించువారుగా నుందురు.

ఈ క్రొత్త సెంట్రల్ లైబ్రరీ అధికారవర్గము క్రింద పనిచేయు స్థానిక లైబ్రరీ అధికారవర్గములు 100 గా నుండును. వీనిలో 50 మునిసిపల్ సంఘములు. వీనిలో సగము అనగా 25, జిల్లాబోర్డులు. తాలూకాబోర్డులు రద్దుచేయునప్పు డివి 50 కాగలవు. ఈ స్థానిక స్వపరిపాలనా సంస్థల లైబ్రరీ సంస్థలలో నొక్కొక్క దానికి

ఒక్కొక్క లైబ్రరి ఉపసంఘ ముండును. కావున 100 స్థానిక అధికారవర్గములు, 100 కమిటీలు కలసి అజమాయిషీ చేయు సంస్థలు 200 కాగలవు. ఇవి అజమాయిషీ చేయుట కిన్ని గ్రంథాలయము లున్నవా?

ఈబిల్లులో క్రొత్త కేంద్రి లైబ్రరీఅధికార వర్గము. అనగా ప్రొవిన్షియల్ లైబ్రరీకమిటీ యేర్పరుపబడుచున్నది. దీనికి ధర్మగ్రంథాలయములు నడుపు వాడు కార్యదర్శి. విద్యాశాఖామంత్రి అధ్యక్షుడు. ఈ సంస్థఆయాగ్రామములలో స్థానికసంస్థలచే స్థాపింపబడు గ్రంథాలయములను మాత్రమేగాక, పరపతిసంఘముల చేతను, ప్రజలచేతను స్థాపింపబడు గ్రంథాలయముల మీదగూడ అధికారము కలిగియుండును.

## గ్రంథాలయ శాఖ - లైబ్రరీ పన్ను

బిల్లు లైబ్రరీశాఖ నొకదానిని స్థాపించుచున్నది. ఈశాఖను లైబ్రరీస్ డైరెక్టరు ద్వారా ప్రభుత్వము వారు నిర్వహింతురు. ప్రభుత్వశాఖవలన ప్రజల స్వాతంత్ర్యము, గ్రంథాలయ స్థాపనాశక్తి నశించును. క్రొత్తశాఖ లనగా క్రొత్త పన్నులు విధింపబడును. ప్రభుత్వమువారి యంగీకారమున ఈస్థానిక గ్రంథాలయ సంస్థలు క్రొత్తపన్నులు విధింపవచ్చునను షరతుఏర్పరుపబడినది. ఈ క్రొత్తపన్నులు చాలు అసహ్యకరములని వా యుద్దేశము. చాలదేశములలో వ్యవసాయదారులిచ్చు పన్నులో కొంతభాగము గ్రామ స్వపరిపాలనకున కివ్వబడుచున్నది. కాని మద్రాసు రాజధానిలో భూమిసిస్తు ప్రభుత్వమువారికి జెందుచున్నది. క్రొత్త పన్నులను విధించి, ఆ పన్నులను గ్రంథాలయేత్యాది సౌకర్యములకై స్థానిక సంస్థల కిచ్చుచున్నారు. ఈ సౌకర్యములలో వయోజన విద్యయొకటి. ప్రతిచోట ఉచితనిర్బంధవిద్యకై యాందోళనము జరుగుచుండగా ప్రజాసామాన్యపు విద్యను ప్రోత్సహించు గ్రంథాలయ నిర్వహణమునకు క్రొత్తపన్నులు విధించుట అత్యావశ్యకరముగా నున్నది. ఈపన్నులభారము వ్యవసాయదారుపైబడును. అత డిచ్చినదానికి ఈబిల్లుద్వారా వచ్చు ప్రతిక్రియ యేమియు నుండదు. పట్టణములలో నిదివరకే పన్నులు భారముగా నున్నవి. క్రొత్తపన్నుల వలన భారము మరింత హెచ్చును.

## నిరక్షరాస్యతను బాపుట

నిరక్షరాస్యతను బాపుటకు ఆయాతావుల నొక విచారణసంఘము నేర్పరుచుట బిల్లునందలి 17 వ క్లాజు, (1) సబ్‌క్లాజులో ఏర్పాటు కలదు. ఈవిచారణ జరిపినమీదట ఆయా తావులలో నెంతవరకు నిరక్షరాస్యతకలదో తెలిపి, దానిని బాపుట కెంతధనము కావలెనో తెలియచేయవలెనట. కాని ప్రభుత్వము వారి యంగీకారము లేనిది ధనము మంజూరు చేయరాదట. ఇంకేవిధమున స్థానికలైబ్రరీ సంఘములు నిరక్షరాస్యతను బాపగలవో తెలియరాదు. ఈ క్లాజు నిరర్థకమని వేరుగా చెప్పనవసరము లేదు.

## అఖిలభారత లైబ్రరీసంఘము వారిబిల్లు

అఖిలభారత గ్రంథాలయసంఘమువారు మద్రాసు బిల్లును మార్చ బ్రయత్నించిరిగాని, ఆ ప్రయత్నము నిరర్థకమైనదని వాయుద్దేశము. మద్రాసుబిల్లుకు క్రొత్తదేమియు సంఘమువారు కలుపలేదు. ఆ బిల్లులో అనర్థదాయకమైనదాని నేమియు తీసివేయలేదు. సంఘమువారి సవరణలకు వ్రాయబడిన వివరణములో మద్రాసు బిల్లు భారతప్రజల ఆచారవ్యవహారములను, అలవాట్లను పరిగణింపక పాశ్చాత్యదేశములయందలి ఆచారవ్యవహారముల ననుసరించుచున్నదని వ్రాయబడియున్నది. ఆంధ్రదేశమునకు, కేరళ, తమిళనాడు, కన్నడదేశములకు 4 గ్రంథాలయ సంఘముల నేర్పరచి, తద్వారా బిల్లునకు జాతీయత చేకూర్ప సంఘమువారు తలంచుచున్నారు. మద్రాసు నగరమునకు 'ప్రొవిన్షియల్ లైబ్రరీ కమిటి, యుండవలెనని వా రనుచున్నారు. వానికి అనుబంధముగా ప్రొవిన్షియల్ లైబ్రరీ కమిటీవారు ఏర్పరుచు సంస్థ లుండవచ్చును. వీరు చేసిన మార్పులలో మంచివి రెండు కలవని సంఘమువా రనుచున్నారు. (1) మునిసిపల్ కౌన్సిళ్లకు, జిల్లాబోర్డులకు గ్రంథాలయములపై అధికారములు లేకుండచేయుట. (2) లోకల్ బోర్డులు, మునిసిపాలిటీల ఇనస్పెక్టరు గ్రంథాలయ శాఖాధికారిగా నుండుటకు బదులుగా మేరా పబ్లిక్ లైబ్రరీ లైబ్రేరియను అధికారిగా నుండునట్లు చేయుట, కాని ప్రభుత్వమువారు అట్లు చేయుటకు అడ్డుపెట్టినది బిల్లునందేమియు లేదు. క్రొత్తగా గ్రంథాలయములను పెట్టి, నిర్వహించుటకు సంఘమువారి బిల్లులో నేర్పాటు లేమియు లేవు. ఈబిల్లు ననుసరించి అధికారుల పెత్తనము ఎంతమాత్రమును తగ్గుటలేదు. క్రొత్త పన్నులను విధింపకుండ చేయుటను బిల్లులో నేర్పాటేమియు లేదు. తక్కిన అన్నివిషయములలోగూడ మద్రాసుబిల్లుకు అఖిలభారత గ్రంథాలయసంఘమువారి బిల్లు నకలుగ నున్నదిగాని వేరు కాదు.

ఆంధ్రదేశమునందు లైబ్రరీ మహాసభలలో మద్రాసు బిల్లును ఖండించి సంఘమువారిబిల్లును శ్లాఘించినందు వలననే యింతదూరము చెప్పవలసివచ్చెను. సంఘము వారి సవరణబిల్లువిషయమై సరియైనసంగతి సందర్భములు తెలియకపోవుటచే నిట్టి పొరబాటు జరిగెనని నా యభిప్రాయము. సంఘమువారిబిల్లు అన్ని విధముల మద్రాసు బిల్లును అనుసరించుచున్నది. అందలి లోపములను తీసివేయుట లేదు. బిల్లులో భాషననుసరించి ర్ భాగములుగా రాజధానిని విభజించుటవలన మాత్రమే ప్రయోజనమేమియు నుండదు. ఈ అఖిలభారత గ్రంథాలయసంఘము వారిచే సవరింపబడినబిల్లు ఉద్యమాభివృద్ధికితోడ్పడుటకు బదులు ఉద్యమనాశమునకు తోడ్పడును. కావున ఆంధ్రగ్రంథాలయ సంఘమువారును, ఆంధ్రగ్రంథాలయ మహాసభవారును అనర్థదాయకమగు మద్రాసు బిల్లును రద్దుచేయుటకు ప్రయత్నింపవలెను.

## ముగింపు

జనసామాన్యముయొక్క వయోజన విద్యాభివృద్ధికి గ్రంథాలయములు ముఖ్యసాధనములు. కావున ప్రభుత్వమువారును స్థానిక, మునిసిపల్ సంఘములును గ్రంథాలయోద్యమాభివృద్ధికి బాధ్యత వహింపవలెను. అట్టి ప్రధాన ధర్మమును మరచినచో బిల్లు ప్రయోజనకారిగాదు. కొద్దిమంది చేతులనుండి అధికారము ప్రజాబాహుళ్యమునకు సంక్రమించుస్థితిలో నందరు విద్యావంతులు కావలసిన యగత్యము కలుగుచున్నది. ప్రతివారును చదువుకొని విద్యావంతులు కావలసిన యవసరము కలదు. వారికి విద్య నేర్పవలసిన బాధ్యత ప్రభుత్వమువారిపై కలదు. ప్రజలయజ్ఞానాంధకారమును బాపువారే దేశసేవచేసి స్వరాజ్యప్రాప్తికి తోడ్పడగలరు.

రామదాసుపంతులుగారు వారి యధ్యక్షోపన్యాసము చదివిన పిమ్మట కార్యదర్శి బులుసు సుబ్బారావుగారు సభకు రాజాలకపోతిమనియు, సభ జయప్రదముగా జరుగునని ఆశించుచున్నామనియు వచ్చిన ఉత్తరములను తంతివార్తలను చదివి వినిపించిరి.

## తీర్మానములు.

పిమ్మట నీదిగువ వివరించిన తీర్మానములు అంగీకరింపబడినవి:—

1. కడచిన 15 సంవత్సరములనుండి ఆంధ్రపత్రికా సంపాదకులుగా నుండి ఆంధ్రదేశ ప్రజలలో దేశాభిమాన దేశగౌరవభావములు ప్రజ్వలించుటకు తమ శక్తి ప్రజ్ఞలను వినియోగించి దేశస్వాతంత్ర్యసంపాదనముకై బయల్వెడలిన ప్రజోద్యమమునకు దోడ్పడుచు కృతకృత్యులయినట్టియు, ఆంధ్రగ్రంథాలయోద్యమోత్పత్తికి ముఖ్యకారకులలో నొకరగునట్టియు నేటివరకు దానిపట్ల పరిపూర్ణాభిమానము చూపినట్టియు చల్లా శేషగిరిరావుగారి యకాలమరణమునకు ఈ సభవారు వగచుచు వారి కుటుంబమునకు తమ సానుభూతిని తెలుపుట కేకగ్రీవముగా తీర్మానించుచున్నారు.

శ్రీవారి పటముతో ఆంధ్రదేశమునందున్న గ్రంథాలయము లన్నింటిని అలంకరింపజేయవలెనని యీ సంఘమువారు తీర్మానించుచున్నారు.

నరసింహదేవర సత్యనారాయణగారుపపాదించిరి.

కళా వెంకటరావుగారు బలపరచిరి.

2. "గ్రంథాలయ సర్వస్వము" అను గ్రంథాలయోద్యమ ప్రచారక పత్రికను తిరిగ ప్రారంభించినందులకు ఈ సభవారు సంతసించుచు ఆ పత్రిక కందరును సహాయము చేసి నిలువబెట్టవలెనని ఈ సభవారు హెచ్చరించుచున్నారు.

అధ్యక్షులు తీర్మానము నుపపాదించిరి.

3. గ్రంథ భాండాగారియొక్క తరబీతుపరీక్షను ఆంధ్ర విశ్వవిద్యాలయమందు పెట్టుదురని యీ సభవారు కోరుచున్నారు.

అధ్యక్షులు తీర్మానము నుపపాదించిరి.

4. మన రాజధానియందు నానాభాషలలో ప్రచురింపబడు గ్రంథముల పట్టికను దొరతనమువారు ఫోర్టు సెంటుజార్జి గెజిటులో మూడునెలల కొకసారి ప్రచురించుటవలన ప్రజాబాహుళ్యమునకు లేశము లాభము కానరానందున, జిల్లా గెజెటులో కూడ ప్రచురింపజేయునటుల ఈ సభవారు దొరతనమువారిని కోరుచున్నారు.

అధ్యక్షులు తీర్మానము నుపపాదించిరి.

5. ఆంధ్రభాషోద్ధరణకై పాటుపడిన వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, వెంకటేశ్వర శాస్త్రులుగారియొక్క సేవను ఈ సభవారు ఉగ్గడించుచు వారికి నుచితరీతిని సన్మానము చేయుదురని ఈ సభవారు హెచ్చరించుచున్నారు.

అధ్యక్షులు తీర్మానము నుపపాదించిరి.

6. గ్రంథాలయోద్యమమునకు నూతన వికాసమును ఉత్సాహమును కలిగించుటకుగాను 'గ్రంథాలయ మహోత్సవము' అను పేరున సంవత్సరమున కొకవారము దినములు పండుగ దసరాలో జరుపుటకును, అప్పుడు సరస్వతీపూజ, గ్రంథాలయాభిక్షలు, ఉపన్యాసములు, ప్రదర్శనములు, ఊరేగింపులు, జానపదకళలవియు ఆంధ్రదేశ గ్రంథాలయము లన్నిటిని ఈ సభవారు హెచ్చరించుచున్నారు.

అధ్యక్షులు తీర్మానము నుపపాదించిరి.

7. 1860 సం. నెం 21 వ చట్టప్రకారము రిజిస్టర్ చేయుటకు యివ్వవలసిన ఫీజును, గ్రంథాలయములకును, పఠనమందిరములకును, లేకుండ ఉచితముగా రిజిస్టరీ చేయించునటుల చట్టమును సవరించి వేయవలె నని ప్రభుత్వమువారిని సభవారు కోరుచున్నారు.

అధ్యక్షులు తీర్మానము నుపపాదించిరి.

8. చెన్నపురిలో నున్న, కొనిమెరా లైబ్రరీవారి వలెనే, మన ఆంధ్ర విశ్వవిద్యాలయాధికారులును ఆంధ్రరాష్ట్ర గ్రంథాలయముల నన్నిటిని తమకు చేరికగా జేసికొని ఆయా గ్రంథాలయములకు వలయు గ్రంథములను బదులుగా నిచ్చిపుచ్చుకొనుటలు జరుపుటకై తమ సమ్మతిని తెలుపగలందులకు ఈ సభవారు కోరుచున్నారు.

కోపల్లె శివకామేశ్వరరావుగా రుపపాదించిరి.
వింజమూరి వెంకటలక్ష్మీనరసింహారావుగారు బలపరచిరి.

9. ముద్రాలయములలో ముద్రింపబడు గ్రంథములలో మూడేసి ప్రతులచొప్పున గైకొనుచు వానిని తమకు దోచినరీతిని పంపుచున్న దొరతనమువారిని నాల్గవ ప్రతికూడ గైకొనుచు నయ్యది యాంధ్రుల కుపయోగపడునట్లు ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయమునకో ఆంధ్రసాహిత్య పరిషద్గ్రంథాలయమునకో పంపుచుండగలందులకు దగిన శాసనముల నిర్మించుటకై విద్యాశాఖకు సంబంధించిన శాసనసభ్యులను ఈ సభవారు కోరుచున్నారు.

కోపల్లె శివకామేశ్వరరావుగా రుపపాదించిరి.
వింజమూరి నరసింహారావుగారు బలపరచిరి.

10. లోకల్ బోర్డ్సు సవరణచట్టములో తాలూకా బోర్డు గ్రంథాలయములను గ్రామపంచాయితులకు నిచ్చివేయుటచే తాలూకా ముఖ్యపట్టణములలో నున్న గ్రంథాలయములకు తగిన చేయూత లభించదని ఈసభవా రభిప్రాయపడుచు, తాలూకా ముఖ్య పట్టణములలో నున్న బోర్డుగ్రంథాలయముల నైనను జిల్లా బోర్డుల క్రింద నే యుంచవలెనని గాని లేక ఆ స్థానముల గల పంచాయితీలు వానిని సమర్థతతో నిర్వహించుటకు అట్టులో నేర్పాటు చేయవలెనని ఈ సభవా రభిప్రాయపడుచున్నారు.

11. ప్రతి గ్రంథాలయమందును స్త్రీలు హెచ్చుగా సభ్యులుగా చేరి గ్రంథాలయోద్యమవ్యాపనము స్త్రీలయందు గూడ విశేషముగా కలుగు లాగున చేయవలెననియు ప్రజల నీ సభవారు హెచ్చరించుచున్నారు.

ప్రతి గ్రంథాలయమందును అధమము అయిదుగురైనను స్త్రీలు సభ్యురాండ్రుగా చేరులాగునయును, పరిపాలనాసంఘమందు ఒక రైన స్త్రీ సభ్యురాండ్రుండు లాగునను, గ్రంథాలయ పరిపాలకులు ప్రోత్సహించెద రని ఈ సభవారు కోరుచున్నారు.

శ్రీమతి బాడ్డపాటి సీతాబాయమ్మగా రుపపాదించిరి. శ్రీమతి వల్లూరి సుబ్బమ్మగారు బలపరచిరి.

## అయ్యంకి వెంకటరమణయ్యగారికి "గ్రంథాలయోద్ధారక" బిరుద సమర్పణము.

12. గ్రంథాలయోద్యమమునకు జనకులై సర్వవిధముల తమ ధనమును శరీరమును బుద్ధిని సదా యీ యుద్యమవ్యాప్తికే వినియోగించుచు ఆంధ్రదేశాభ్యుదయమునకు పాటు పడుచున్న శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారి కృషిని గురించి ఈ సభవా రభినందించుచు వారికి 'గ్రంథాలయోద్ధారక' అను బిరుదమునొసంగుచున్నారు.

దుగ్గిరాల సూర్యప్రకాశరావుగా రుపపాదించిరి: దివాన్ బహద్దరు సి. రంగనాయకులు నాయుడు (రిటైర్డు జిల్లాజడ్జి) గారు బలపరచిరి. పాలూరి రామారావు (రిటైర్డు జిల్లామునసబు) గారు కూడ బలపరచిరి.

బిరుదసమర్పణ సమయమున శ్రీవెంకటరమణయ్యగారికి ఖద్దరుశాలువను గప్పి బహూకరించిరి.

# 16 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ

కాకినాడ



గ్రంథాలయ ప్రదర్శనమునం దొకభాగము




గ్రంథాలయ ప్రదర్శనమునందు మరియొకభాగము

# 16వ ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభ, కాకినాడ.



గౌరవమును పొందిన

యాతగిరి లక్ష్మీ వేంకటరమణగారు



"గ్రంథాలయోద్ధారక"

బిరుదమును పొందిన

అయ్యంకి వేంకటరమణయ్యగారు

**13.** గ్రంథ భాండాగారికులకు కావలసిన తరిబీతు నిచ్చుటకై ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ వారిచే నియమితమైన "తరిబీతు" సంఘమువారి ప్రణాళిక ననుసరించి రాబోవు జూను నెలయందు శిక్షాశిబిరమును స్థాపించవలసినదని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

ఈ శిబిరమునకు ఆంధ్రదేశమందున్న వివిధ గ్రంథాలయములనుండియు, పాఠశాలల నుండియు స్థానిక సంస్థల నుండియు, తదితర సంస్థల నుండియు, తరిబీతును పొందుటకై తగిన ప్రతినిధులను పంపుదురని ఈ సభవారు కోరుచున్నారు.

ఈ శిబిరమునకు కావలసిన ఏర్పాటులు చేయుటయందును, శిక్షణ నిచ్చుటయందును కావలసిన సహాయము చేయుటకై ఆంధ్ర విశ్వవిద్యాలయమువారిని ఈ సభవారు ప్రార్థించుచున్నారు.

అయ్యంకి వెంకటరమణయ్యగారు ప్రతిపాదించిరి.
మండపాక రంగయ్యనాయుడుగారు బలపరచిరి.

**14.** మద్రాసు పబ్లిక్ లైబ్రరీబిల్లు చాల నష్టదాయకమైనందువలనను, వృద్ధి నాటంకపరచునదిగా నుండుటవలనను, ఆ బిల్లును చట్టము చేయకూడదని శాసనసభ్యుల ని సభవారు కోరుచున్నారు.

లైబ్రరీ డిపార్టుమెంటు తమ స్వాధీనములో నుంచుకొని ప్రభుత్వమువారు ఇన్స్పెక్టరు ఆఫ్ లోకల్ బాడీస్ చేత నడిపించుచు, లైబ్రరీలకు క్రొత్తగా సన్నువిధించుట కేవలము అన్యాయమని యీసభవారు తీర్మానించుచున్నారు.

మండపాక రంగయ్య నాయుడుగారు, ఉపపాదించిరి.

అయ్యంకి వెంకటరమణయ్యగారు, శ్రీమతి సేము గంటి పాపాయమ్మగారు బలపరచిరి.

**15.** వ ఆంధ్రదేశములో నున్న గ్రంథాలయోద్యమమును గూర్చి అవంతయైన తెలిసికొనకుండ ఆంధ్రదేశమందు గండల కొలదిగల గ్రంథాలయములు పెక్కు వత్సరములనుండి జగద్విఖ్యాతముగ పనిచేయుచుండుటను గమనింపజాలక, ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము యొక్కయు గ్రంథాలయముల యొక్కయు ప్రత్యక్షశత్రువుగనుండుటుల "మద్రాసు గ్రంథాలయసంఘము" వారు నూతనముగా ప్రచురించిన "గ్రంథాలయశాస్త్రముయొక్క అయిదు చట్టములు" (The five laws of Library) అను గ్రంథమునందు ఆంధ్రదేశమందలి గ్రంథాలయోద్యమమును గురించి వ్రాయుచు ఆంధ్రదేశమందు గడచిన పదిసంవత్సరముల ఆఖరున గ్రంథాలయములకు సుభిక్షమైన పంట పండినది. కాని కొంతవరకు రాజకీయోద్యమమునందు కలిసిపోయి దానియొక్క విపర్యయమువలన అణగిపోయి క్రమముగా నశించుచున్న కొన్ని శేషములను మాత్రము మనము చూచుచున్నాము" We see a few decaying remnants of a bumper crop of libraries that shot forth at the close of the last decade in the land of the Andhras, but soon got strangled, partly as a result of the vicissitudes of the political movement with which they got intertwined అని అప్రస్తుతముగా వ్రాసినందులకు ఈ సభవారు మిక్కిలి గర్హించుచు, అన్యాయముగ వ్రాసిన సదరువ్రాతను తమగ్రంథమునుండి తీసివేయవలసినదని మద్రాసు గ్రంథాలయసంఘమువారిని ఈ సభవారు కోరుచున్నారు.

నరసింహదేవర సత్యనారాయణగారు ప్రతిపాదించిరి.
వంగిపురపు జగన్నాథరావుగారు బలపరచిరి.

గ్రంథాలయసభ రాత్రి 7 గంటలకు ముగిసెను.

---

# ప్రథమాంధ్రగ్రంథాలయ ప్రచారకుల సభ.

**21-1-34** తేదీ ఉదయమున ఆంధ్రదేశ గ్రంథాలయప్రచారకుల సభ కాకినాడ అన్నదాన సమాజములో జరిగెను. ప్రార్థనానంతరము శ్రీయుత నేత్రి కంటి యోగానందరావుగారు, ఎం. ఏ. బి. యల్. తమ ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసము నిచ్చిరి.

## ఆహ్వానసంఘాధ్యక్షులగు
## నేతికంటి యోగానందరావు (ఎం. ఏ., బి. యల్) గారి యుపన్యాసము.

కాకినాడపట్టణముకూడ, తనస్వల్ప శక్తికొలది, తనచేతనైనంతవరకును, గ్రంథాలయోద్యమములోను సారస్వతాభివృద్ధికొరకును, పాటుపడుచున్నది. పిఠాపురం మహారాజావారి ఉదారభూరివిరాళముపలన జరుపబడు సంస్థలలో నొకటియగు ఆంధ్రసాహిత్యపరిషత్తు, మరియు శ్రీ పోలవరం జమీందారువారి దాతృత్వము వలన తూ. గోదావరిజిల్లా సంఘమువారిచే నడుపబడుచున్న 'రాజా కె. ఆర్. వి. కృష్ణారావు లైబ్రిరీ' కాకినాడకు వన్నెనొసంగుచున్నవి. ఈ పట్టనము రాజకీయ, సాంఘిక, విద్యావిషయిక సంస్థలయందు ఎన్నడును వెనుకంజ వేసియుండలేదు. గ్రంథాలయోద్యమమందుకూడ తగిన సేవ యొనరించుచున్నది. గ్రంథాలయోద్యమాభివృద్ధికి ప్రకాశవంతమైన భవిష్యత్తు కలదని నమ్ముటకు సూచనలు స్పష్టముగా కన్పించుచున్నవి. గోదావరిజిల్లాలో ఆంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావుపంతులుగారు, కీ. శే. వీరేశలింగం పంతులుగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు, కీ. శే. పోలవరం జమీందారుగారు, దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారును గ్రంథాలయోద్యమములో శ్రద్ధవహించి పాటుబడిరి. ప్రస్తుతము గ్రంథాలయోద్యమప్రచారము గావించుచు, నిరాడంబర నిష్కామసేవ యొనర్చుచున్న అయ్యంకి వేంకటరమణయ్య ప్రభృతులు తమ జీవితము, ధనము, శక్తి, యావత్తు వినియోగించుచుండగా ఈయుద్యమము నూతనజీవనము పొందు ననుటకు సందేహము లేదు. గ్రంథాలయోద్యమ సేవయందు బెజవాడ ముందంజ వైచుచున్నది. వారు చేయుచున్న సేవ యసామము. గ్రంథములు, పత్రికలు ప్రచురించుచున్నారు. మనము వారి నభినందించవలెను.

జాతీయ వికాసమునకు విద్యయే ముఖ్యావసరము. పాశ్చాత్య దేశములవారు ప్రాచ్యదేశములు జపానుమున్నగునవి ఈ విషయమును గుర్తెరింగి విద్యాభివృద్ధికంతయు ఆ దేశముల ప్రభుత్వములు తోడ్పడుచున్నవి. విద్యావిహీనమగు దేశములే అన్ని విషయములందు వెనుకబడి కష్టములపాలగుచున్నవి. ఇందునుగాను ఆంధ్రదేశములోని కొన్ని జిల్లాలే తార్కాణము. మానవ శరీరమునకు వాయు వెంత ముఖ్యమో మనోవికాసమునకు విద్య యంత ముఖ్యము. విద్యాభివృద్ధికి తగు సౌకర్యములు లేనందువలన నూటికి పదిమంది కూడ వ్రాయను చదువను నేర్చినవారు లేరు. ప్రస్తుత విద్యావిధానము గూడ జీవితమునకు సంబంధించినదిగా కనబడుట లేదు.

గ్రంథాలయములే దేశాభివృద్ధికి ముఖ్యసాధనములని కన్పించుచున్నది. అట్టి గ్రంథాలయోద్యమాభివృద్ధి గ్రంథాలయోద్యమ సేవకుల మీదనే ఆధారపడియున్నది.

ఈ నూతన యుగమందు గ్రంథాలయోద్యమము కూడ సర్వసామాన్య జనులకు సహాయముగా నుండి వారి యభివృద్ధికి తోడ్పడవలెను. ప్రతిగ్రామమునకు బావి యెంత ముఖ్యమో గ్రంథాలయముకూడ అట్టిదే యని యెంచవలెను; ప్రతిజిల్లాలోను తీవ్రప్రచారము సాగించి గ్రామములందు గ్రంథాలయములు స్థాపింప బ్రయత్నించవలెను. లేనియెడల గ్రామజీవితము అభివృద్ధిపొందనేరదు.

గ్రంథాలయసేవయే ప్రజాసేవ. యువకులును, పెద్దలును కూడ ఈ యుద్యమములో పనిచేయుట కవకాశము కలదు. మనోవికాసమే జీవాధారము. ఉత్సాహము, మనోవికాసము లేని జీవనము నిరర్థకము. పూర్వకాలమున దేవాలయములే గ్రామప్రజలకు సమావేశస్థలములుగా నుండినవి. ప్రస్తుత మాదేవాలయములు పాడుబడినవి. ఆలయములకు సహాయముగాను, వానితోబాటు గ్రంథాలయము స్థాపింపబడి గ్రామజీవితమునకు ముఖ్యస్థానమయి యుండవలెను. గ్రంథాలయోద్యమప్రచారక సోదరులగు మిమ్ములను ప్రతిగ్రామమున గ్రంథాలయము నిర్మింపవేడుచున్నాను. గ్రంథాలయములు ఆటస్థలములు కాకూడదు. గ్రంథాలయమున గ్రంథపఠనముగాని, పత్రికాపఠనముగాని, యితర సాహిత్య ప్రసంగములు గాని యుండవలెను. గ్రంథాలయాధికారులు నెల కొకసారియైన విద్యావిషయక ప్రసంగము చేయుటకు సభ్యుల కవకాశము కలుగజేయవలెను. మరియు ప్రస్తుత దేశసంచలనములో గ్రంథాలయము కూడ ముఖ్యస్థానము నాక్రమించవలెను.

గ్రంథాలయ సేవకులు ఓర్పు, పట్టుదల, ఉత్సాహము కలిగియుండవలెను. గ్రంథాలయోద్యమాభివృ

...లు గ్రామములలోని యితర సంస్థలలో తగుల్కొని యుండక నిరాడంబరముగ పని జేసినచో విశేషఫలితము చేకూరును.

మన గ్రంథాలయోద్యమమునకు అమెరికాలో కార్నెజీవంటి దాతలు లేరని, బరోడా మహారాజువంటి ఔదార్యవంతులు గాని లేరని చింతింప నవసరము లేదు. మన మహారాజులుకూడ సాధ్యమయినంతవరకు పాటు పడుచునే యున్నారు.

మద్రాస్ లైబ్రరీ బిల్లును గురించి ఒక్కమాట మాత్రము చెప్పెదను. మన గ్రంథాలయములు గ్రామస్థుల కుపయోగకరముగా నుండుటకు దేశభాషలలోనే గ్రంథములు విశేషముగా నుండవలెనని మద్రాసు గవర్నరు స్టాన్లిప్రభువు చెప్పియున్నారు. లైబ్రరీ బిల్లునుగురించి ఆలోచించినచో అట్టి శాసనము ముఖ్యావశ్యకమని తోచుచున్నది. ఏ సంస్థ కాని ప్రభుత్వపు సహాయము లేనిదే నిలువదు. ఈ చట్టము ననుసరించి ప్రభుత్వమువారి బాధ్యత గ్రంథాలయముపై నుండును. ఎప్పుడు బాధ్యత కలిగినదో అప్పుడు గ్రంథాలయములు తగిన తనిఖీ కలిగియుండి ఎక్కువ యుపయోగముగా నుండును. అయితే ప్రస్తుతము శాసనసభయందు ప్రవేశపెట్టబడిన బిల్లునందు చాల లోపము లున్నవి. అట్టిలోపము లన్నింటిని సవరణచేసి మరి అంగీకరింపజేతురని నేను కోరుచున్నాను.

## భూపతిరాజు తిరుపతిరాజుగారి ప్రారంభోపన్యాసము.

పిమ్మట భూపతిరాజు తిరుపతిరాజుగారు సభను ప్రారంభించుచు ఇట్లు చెప్పిరి:—

గ్రంథాలయోద్యమాభివృద్ధికై నేనేమో చేసితినని మీరు నన్ను గౌరవించినారు. నేను చేసినది బహుస్వల్పము. కీర్తిశేషులగు శ్రీ వీరేశలింగం పంతులుగారి గ్రంథములను చదివితిమి. తత్ఫలితముగ మా గ్రామమున 1897 సంవత్సరమున శ్రీపంతులుగారి పేరున గ్రంథాలయమును స్థాపించి, అప్పటినుండియు మా యోపిన కొలదిని సేవ జేయుచుంటిమి.

పంతులుగారి పవిత్రనామమహిమచేతను శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారి దోహదముచేతను ఈ సంస్థ దినదినాభివృద్ధి గాంచుచున్నది. ఈ కామధేనువునుండి అక్షరామృతమును గ్రోలిన కొలదిని సోదరగ్రామస్థులకు కూడ ఇట్టి యవకాశము కల్పింప తీవ్రేచ్ఛ ప్రజ్వరిల్లినది. ఆంధ్రదేశగ్రంథాలయోద్యమాభివృద్ధియందు మేము కూడ ముందంజ వేసి ఉడతభక్తిగ కొంత చేసి చూపితిమి.

గ్రంథాలయముల అభివృద్ధియంతయు గ్రంథాలయోద్యమప్రచారకుల మీదనే ఆధార పడి యున్నది. మనసేవకు ఫలితము దానివలన కలుగు నిర్మలమగు ఆత్మానందమేను. అట్టి పవిత్రోద్దేశముతో ప్రారంభింపబడినది. కనుకనే ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ మిట్టి సత్ఫలితముల నొసంగ గలిగినది.

సర్వోద్యమములకు మూలకందములగు ఈ ధర్మగ్రంథాలయములు ఆంధ్రదేశమందున్న గ్రామములందెల్ల విరివిగా వ్యాపింపజేయుటకు భగవంతుడు మనకు తోడ్పడుగాక యని ప్రార్థించుచున్నాను.

## శ్రీమతి బొడ్డపాటి సీతాబాయమ్మగారి అధ్యక్షోపన్యాసము.

అనంతరము బొడ్డపాటి సీతాబాయమ్మగారు సభాధ్యక్షత వహించి ఇట్లు ఉపన్యసించిరి:—

పాశ్చాత్యులు పాఠశాలలందు విద్యాపరిపూర్తి యనంతరము గ్రంథాలయమందు విద్యప్రారంభింతురనెదరు. అట్లుగాక అక్షరాభ్యాసమునుండియు గ్రంథాలయముననే విద్యప్రారంభమగుట ఇంకను ఎక్కువ శ్రేష్ఠమైయున్నది.

స్త్రీలకు ప్రత్యేకముగా కొన్నిగ్రంథాలయములు కలవు. కాని వానిని నిర్వహింపవలసినవిధానము సరిగా బోధపడినట్లు లేదు. కాన పురుషుల గ్రంథాలయములలో అధమము అయిదుగురు స్త్రీసభ్యులైనను ఉండునట్లు మీరు ప్రయత్నింపవలెను. సామాన్యసభ్యులుగనే గాక కార్యనిర్వాహక సభ్యులుగగూడ చేర్చి అన్నివిధానములు నేర్పి స్వతంత్రశక్తి గలవారినిగ తయారు చేయవలయును.

చీట్లపేకలు గ్రంథాలయములకు చేటగుచున్నవని సప్రమాణముగ నిన్న సభలో నిరూపింపబడెను. అట్టి చీట్లపేకలకు గ్రంథాలయములలో ప్రవేశ మీయకుండుటకు కోరుచున్నాను.

పంచవర్తియగు శ్రీ తనభిర కసేకరీతుల సహాయమై సుఖపెట్టునట్లు ప్రజలకు గ్రంథాలయములు పలువిధముల సౌఖ్య మొసగి జయును.

ప్రతి గ్రంథాలయములోను శిశుశాఖ నేర్పరచి మొదటి తరగతి శిశువులకుగూడ తగిన గ్రంథముల నివ్వవలయును. ఇట్లు బాల్యమునుండి గ్రంథాలయ ప్రయోజనము పొందుట యను సదభ్యాసము నాటుటవలన, మనబిడ్డల భావిసౌభాగ్యము అనేక రెట్లు ఎక్కువగుననుట, కొంతమాత్రమును సందియము లేదు.

### ఇతర ఉపన్యాసములు.

శ్రీ కోపల్లె శివకామేశ్వరరావు, కనుమూరి వీరేశలింగం, రుద్రరాజు నరసింహరాజు, విరియాల కామరాజు, కిళాంబి రాఘవాచార్యులు, శ్రీమతి వల్లూరి సుబ్బమ్మగార్లును, గ్రంథాలయ ప్రచారమునుగురించి మాట్లాడిరి.

### తీర్మానము.

ఈ దిగువతీర్మానము ఏకగ్రీవముగా అంగీకరింపబడెను. "ఆంధ్రదేశమందు గ్రంథాలయోద్యమ వ్యాప్తిని చేయుటకుగాను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు అనుబంధముగ సేవాశాఖను స్థాపించుటకు తీర్మానించడమైనది."

శ్రీయుత కళా వెంకటారావుగారును మాట్లాడుచు 1914 మొదలు 1920 వరకు గ్రంథాలయోద్యమము విషయము పని జరిగినది గనుకనే రాజకీయోద్యమము ఆంధ్రదేశములో బాగుగావిజృంభించినదనియువిజ్ఞానము వెదజల్లుటవలన ఫలితము దేశస్వాతంత్ర్యము కల్గినగాని లాభము జరుగనేరదనియు, వివిధ విషయములు సమీకరణముచేసి ఉత్తేజ మొసంగుటకు ఆదర్శప్రాయముగా గ్రామ గ్రంథాలయ సేవాశాఖ స్థాపనలు జరుగవలెననియు హెచ్చరించిరి.

శ్రీయుత పుణ్యమూర్తుల రాజశేఖరంగారును గ్రంథాలయోద్యమ ప్రచారమును గూర్చి మాట్లాడిన పిదప సభ ముగిసెను.

---

# నివేదికలు

### తాడేపల్లిగూడెం తాలూకాబోర్డు గ్రంథాలయము

ఈగ్రంథాలయము 1-11-29 తేదీన అప్పుడు బోర్డునకు అధ్యక్షులుగానున్న శ్రీ కలిదిండి రంగరాజుగారిచే స్థాపింపబడినది. పదివేలరూపాయలు ఖరీదుగలిగిన భవనమును గట్టి ప్రొఫెసరు జే. సి. కుమారప్పను (గుజరాతీ విద్యాపీఠము, అహమ్మదాబాదు) గారిచే ప్రారంభోత్సవమును జరిపించిరి. ఈ గ్రంథాలయమును ఇంత ఉన్నతస్థితిక తీసికొనివచ్చుటకు శ్రీ శనివారపు సుబ్బారావుగారి కృషి విశేషముగా గలదని చెప్పక తప్పదు.

ఈ గ్రంథాలయమునకు ప్రత్యేకము గ్రంథభాండాగారి, బంట్రోతు కలరు. నెల1కి సిబ్బందికి, పత్రికలకు రు 75 లు ఖర్చుఅగుచున్నది. ఈ వత్సరము ఈగ్రంథాలయమునకు తాడేపల్లిగూడెం గ్రామ కాపురస్థులు 7970 మందిన్ని ఇతర గ్రామస్థులు 3205 మందిన్ని వచ్చి పుస్తకములను పత్రికలను చదివిరి. గ్రంథాలయమునందు 514 గ్రంథములను చదివిరి. ఇండ్లకు 366 గ్రంథములను తీసికొనిపోయిరి. సగటున రోజుకు తాడేపల్లిగూడెం వారు 22 న్ను, పొరుగు గ్రామములవారు 9 న్ను, వెరసి 31 మంది వచ్చి జ్ఞానమును పొందుచున్నారు. రోజుకు మనిషి1కి రు 0-1-8 ఖర్చు అయినది.

### తణుకు తాలూకాబోర్డు గ్రంథాలయము
(1938 సం॥ నివేదిక)

ఈ గ్రంథాలయము 15-6-31 తేదీన ప్రారంభమయ్యెను. తాలూకాబోర్డు ఆఫీసునందే ఒక హాలునం దుంచబడినది.

ఇందుగల గ్రంథములు.

| భాష. | సంఖ్య. | ఖరీదు. |
| --- | --- | --- |
| ఆంగ్ల గ్రంథములు | 461 | రు 600 |
| ఆంధ్ర గ్రంథములు | 445 | రు 700 |
| సంస్కృతము | 22 | రు 40 |
| హిందీ | 63 | రు 50 |
| | 991 | రు 1390 |

ఆంగ్ల, ఆంధ్రభాషా పత్రికలలో, దైనిక వార మాస పత్రికలు రు 80 లు విలువగలవి తెప్పింపబడుచున్నవి. గ్రంథభాండాగారికి బంట్రోతుకు సాలునకు రు 680 లు ఖర్చు అగుచున్నది. ఈసంవత్సరము ఈ గ్రంథాలయమునకు 1678 మంది తణుకుగ్రామస్థులు, 722 మంది పొరుగు గ్రామస్థులు వచ్చి గ్రంథములను పత్రికలను చదువుకొనిరి. 185 మంది మాత్రము ఇండ్లకు గ్రంథములను తీసికొనిపోయిరి.

రోజుకు సుమారు 7 గురు గ్రంథాలయమందు వయోజనవిద్య నభ్యసించిరి. అందు గ్రామస్థులు 5 గురు, పొరుగూరి వారు ఇద్దరు.

ఈ గ్రంథాలయమును 1934 సం॥ నుండి సంచార గ్రంథాలయముగా మార్చిరి. అందుచేత మంచి ఫలితములు ఈసంవత్సరమున కనుపడును:

# ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము

1934 వ సంవత్సరం జనవరినెల 20 వ తేదీ ఉదయము 8–30 గంటలకు కాకినాడ పట్టణమున జరిగిన సామాన్యసంఘసభయందు చేయబడిన తీర్మానములు:—

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు ఈ క్రిందవారిని ముందు సంవత్సరమునకు కార్యనిర్వాహకవర్గసంఘముగా ఏర్పాటు చేయవలెనని.

అధ్యక్షులు:—వేమవరపు రామదాసుపంతులుగారు.

ఉపాధ్యక్షులు:—రావుసాహెబు ఎం. అప్పారావుగారు, భూపతిరాజు సీతారామరాజుగారు, దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారు, భూపతిరాజు తిరుపతిరాజుగారు, శ్రీ రాజా యార్లగడ్డ శివరామప్రసాద బహదరు జమీందారుగారు, ఊటుకూరు వెంకటసుబ్బరాయశ్రేష్ఠిగారు, బొడ్డపాటి సీతాబాయమ్మగారు, గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, కె. కోటిరెడ్డిగారు, బెజవాడ రామచంద్రారెడ్డిగారు, సి. ఆర్. పార్థసారథి అయ్యంగార్‌గారు, వామన్ నాయిక్‌గారు, వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిగారు, ఏ. రంగనాథమొదల్యారుగారు, సామి వెంకటాచలం శ్రేష్ఠిగారు, ఆట్లూరి సీతమ్మగారు, తూర్పాటి సన్యాసమ్మగారు, బి. మునిస్వామినాయుడుగారు, మట్టె శంకరరావుగారు, జాగర్లమూడి కుప్పుస్వామిగారు, దేశోద్ధారక కే. నాగేశ్వరరావుగారు.

కార్యదర్శి:—అయ్యంకి వేంకటరమణయ్యగారు.

కార్యనిర్వాహక సంఘాధ్యక్షులు:—నడింపల్లి వెంకట లక్ష్మీనరసింహారావుగారు.

సహాయ కార్యదర్శులు:—పాతూరి బలరామయ్యగారు, నరసింహదేవర సత్యనారాయణగారు, పుణ్యమూర్తుల రాజశేఖరంగారు, నేతి కంటి యోగానందరావుగారు, వేముగంటి సాహాయమ్మగారు, డాక్టరు పి. గోవిందరాజులుగారు, మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు, బులుసు వెంకటసుబ్బారావుగారు, కొండ సచ్చిదానందరావుగారు, శరణు రామస్వామిగారు, దైప సుబ్రహ్మణ్యశర్మగారు, మాడపాటి హనుమంతరావుగారు, పప్పూరి రామాచార్యులుగారు, టేకుమళ్ల రాజగోపాలరావుగారు, సి. వి. రంగంసెట్టిగారు, పట్టె నరసింహారావుగారు, తుర్లపాటి రాజేశ్వరమ్మగారు.

## కార్యనిర్వాహకసంఘము

గంజాంజిల్లా:—జగన్నాథసాడి శుపెంగగారు, పాట్నూరి స్వామిబాబుగారు, పుల్లెల శ్యామసుందరరావుగారు.

విశాఖపట్నం:—పురిపండా అప్పలస్వామిగారు, తెన్నేటి విశ్వనాథంగారు, బుర్రా శేషగిరిరావుగారు.

తూర్పు గోదావరి:— పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, కిళాంబి రాఘవాచార్యులుగారు, వాశం కృష్ణరావుగారు, కొత్తపల్లి సూర్యారావుగారు.

పశ్చిమగోదావరి:—పోతాప్రగడ శ్రీరామారావుగారు, కలిదిండి గంగరాజుగారు, డాక్టరు పాలకోడేటి సత్యనారాయణశర్మగారు, డాక్టరు వేతలి సత్యనారాయణగారు.

కృష్ణ:—ఆరెకపూడి రామశాస్త్రులుగారు, గుడిపాటి రంగనాయకమ్మగారు.

గుంటూరు:—మంతెన వెంకటరాజుగారు, పాతూరి నాగభూషణం గారు, వంగిపురపు జగన్నాథరావుగారు,

కర్నూలు:—రాజా పెదసుబ్బారాయుడుగారు, కె. నరసింగరావుగారు, దేశపాండ్య సుబ్బారావుగారు, శేపూరి యల్లమందయ్యశ్రేష్ఠిగారు.

అనంతపురం:—యం. సన్నప్ప నాయుడుగారు, శీరిపి ఆంజనేయులుగారు.

కడప:—జనమంచి శేషాద్రిశర్మగారు, వేలాల రామకృష్ణశాస్త్రిగారు, కొప్పరపు సుబ్బయ్యశ్రేష్ఠిగారు.

చిత్తూరు:—బూదూరు రామానుజులు రెడ్డిగారు, ఎమ్. శ్రీనివాసాచార్యులుగారు.

నెల్లూరు:— కొన్నెలకంటి అప్పారావుగారు, తూములూరి శివరామయ్యగారు. యం. ఆర్. రామకృష్ణరావుగారు.

బళ్లారి:—టి. రాఘవాచార్యులుగారు.

మద్రాసు:—కసూరి నరసింహారావుగారు, ఆర్. జనార్దనరావునాయుడుగారు.

నైజాము:—వార్నాశి సుబ్బారావుగారు, రాయప్రోలు సుబ్బారావుగారు.

ఆంధ్రరాష్ట్రీయ గ్రామగ్రంథాలయ
సేవాశాఖ నేర్పరచుట.

తీర్మానము:—1. గ్రామ గ్రంథాలయ సేవా వ్యాపనమునకు సంబంధించిన విషయములను గూర్చి ప్రత్యేకపరిశ్రమ చేయుటకుగాను ఈ సంఘమునకు శాఖగా 'గ్రామగ్రంథాలయ సేవాశాఖను ఏర్పాటు చేయడమైనది.

2. ఈశాఖను అఖిలభారత గ్రామగ్రంథాలయసేవా సంఘమునకును దానియొక్క మద్రాసురాజధానిశాఖకును ఉపశాఖగా చేర్చుటకు తీర్మానించడమైనది.

ఈసంఘమునకు ఈక్రిందివారిని ఉద్యోగులుగా ఎన్నుకొనడమైనది.

అధ్యక్షులు:— పెద్దాడ రామస్వామిగారు.

ఉపాధ్యక్షులు:—నరసింహదేవర సత్యనారాయణగారు, కామరాజు హనుమంతరావుగారు.

కార్యదర్శి:—అయ్యంకి వెంకటరమణయ్యగారు.

సహాయకార్యదర్శులు:—శనివారపు సుబ్బారావుగారు, కోపల్లె శివకామేశ్వరరావుగారు, పుణ్యమూర్తుల రాజశేఖరం గారు,

ఆంధ్రదేశ గ్రంథాలయముల నిర్మాణకార్యక్రమమును గూర్చి శ్రీవల్లూరి సూర్యనారాయణరావుగారు వ్రాసిన ఉత్తరము చదవడమైనది.

ఆంధ్రదేశములో నున్న జిల్లా గ్రంథాలయ సంఘము లన్నియు ప్రమతమ మండలములయం దున్న గ్రంథాలయములను తనిఖీచేసి, గ్రంథాలయోద్యమాభివృద్ధిని సాగించవలసిన దనియు, జిల్లాసంఘములు లేని మండలములందు జిల్లాసంఘములను వెంటనే స్థాపించవలసినదనియు ఈసభవారు తీర్మానించుచున్నారు.

శ్రీముఖనామ సంవత్సరమునకు ఆంధ్రదేశగ్రంథాలయముల చరిత్రను తయారు చేయవలెనని తీర్మానించుచున్నారు.

గ్రంథాలయోద్యమాభివృద్ధి చేయుటకై సేవకసంఘమును స్థాపించుటకై తీర్మానించడమైనది. ఈక్రిందివారిని సేవకులుగ అంగీకరించడమైనది:—

గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు, గౌరావఝల రామకృష్ణశతావధానిగారు, కైప సుబ్రహ్మణ్యశర్మగారు, యక్కలి రామయ్యగారు, కొల్లా సుబ్బరాయగుప్తగారు, వారణాసి వెంకటకృష్ణమూర్తిగారు, నేత్రకంటి యోగానందరావుగారు, పుణ్యమూర్తుల రాజశేఖరంగారు, బులుసు వెంకటసుబ్బారావుగారు, ముసలకంటి తిరుమలరావుగారు, తాడిమేటి కుటుంబశాస్త్రిగారు, రాజా వత్సవాయి జగపతివర్మగారు, చట్టి నరసింహారావుగారు.

# గ్రంథాలయముల ఆవశ్యకము

(ఆంధ్రపత్రిక సంపాదకీయము. 22-1-34)

దేశమునందలి ప్రజలకు విజ్ఞానాభివృద్ధి కలుగుటకు సహాయకము లగువానిలో గ్రంథాలయములు ముఖ్యముగ పేర్కొనబడదగిన వనువిషయ మిపుడు ప్రపంచమునందన్ని నాగరకదేశములలోను బాగుగా గ్రహింపబడినది. పాశ్చాత్యదేశములలో గ్రంథాలయాభివృద్ధికి ప్రజలును ప్రభుత్వమువారునుగూడ నత్యధికముగా తోడ్పడుచున్నారు. మన దేశములోగూడ గ్రంథాలయోద్యమమున కిపుడు చాలప్రాముఖ్య మొసగబడుచున్నది. మన దేశమునందు బరోడాసంస్థానమువారీవిషయమున సర్వవిధముల ముందంజ వేయుచున్నారు. తక్కిన సంస్థానములవారుగూడ వీరిమార్గము ననుసరించు టవసరమై యున్నది. కనీసము ప్రాథమిక విద్య నభ్యసించినవారి కందరికిని గ్రంథాలయములవలన చాలమేలు కలుగగలదు. అందులకు బాలురకును బాలికలకును ప్రాథమికవిద్య ఉచితముగాను నిర్బంధముగాను నేర్పబడుట ముఖ్యకర్తవ్యమై యున్నది. ప్రతిపల్లెలోనుగూడ ప్రాథమిక పాఠశాలయును గ్రంథాలయమును విధిగా నుండవలెను. దేశభాషలో విద్య బోధింపబడవలెను. అపుడు ప్రాథమికవిద్య నభ్యసించినవారు జ్ఞానాభివృద్ధిని బడయుటకు గ్రంథాలయములు బాగుగా నుపయోగించుటకు తగిన దేశభాషా గ్రంథములు గ్రంథాలయములలో లభించుటకు తగిన యేర్పాటులు జరుగవలెను. ఈ గ్రంథములు వ్యావహారిక భాషలో అనగా మామూలు వాడుకమాటలతో సులభశైలిని వ్రాయబడవలెను. కులవిద్యలు వృత్తి విద్యలు చేతిపనులు మున్నగువానిని నేర్చుకొనగోరువారికి తోడ్పడగల గ్రంథములుగూడ నుండవలెను. నీతి మత రాజకీయ సాంఘిక విషయములకు సంబంధించినగ్రంథములు గూడ నుండవలెను. గ్రంథాలయములలో వార్తా పత్రికలుగూడ నుండవలెను. ఈ గ్రంథములను పత్రికలను ప్రజలు ఉచితముగా బడయగలుగుచుండవలెను. ప్రతిగ్రామమునందును గ్రంథాలయము ప్రజలకు కూడలి స్థానముగా నుండవలెను. స్త్రీలును పురుషులునుగూడ వీనిని పూర్తిగా నుపయోగించుకొనుటకు తగిన సౌకర్యము లుండవలెను. వీనిని ప్రజలు ఉపయోగించుటకు గట్టి ప్రచారము జరుగవలెను. ప్రజల నధికముగా నాకర్షింపగల యేర్పాటు లన్నియును జరుగవలెను. ఆంధ్రదేశమునందుగూడ గ్రంథాలయము లిపుడు హెచ్చుగా నేర్పడుచుండుట సంతోషప్రదము. వీటి కింకను ప్రజలతోడ్పాటు హెచ్చుగా లభింపవలెను. భారతదేశమున గ్రంథాలయాభివృద్ధికి బరోడాసంస్థానము తరువాత ఆంధ్రదేశమే పేర్కొనబడదగి యున్నదని నల్లూరులో 18వ తేదీని జరిగిన ఆంధ్రబాలసరస్వతీనిలయ తృతీయ వార్షికోత్సవ సంబంధమున గ్రంథాలయ ప్రదర్శనము ప్రారంభించుచు శ్రీయుత మాగంటి బాపినీడు గారు నుడివిరి. ఇది ఆంధ్రులు సంతసింపదగిన విషయమేగాని యీఅభివృద్ధి చాలదనుట నిశ్చయము. ప్రతిగ్రామమునను విస్తృతాలయ శివాలయములతోపాటు ఈ శారదాలయములుగూడ ముఖ్యముగా నుండవలెనను విషయమును ఎల్లవారును ముఖ్యముగా గుర్తింపదగును. ఇపుడు కాకినాడలో శ్రీయుత వేమవరపు రామదాసు పంతులుగారి అధ్యక్షతక్రింద ఆంధ్రదేశ గ్రంథాలయ సభ జరుగుచున్నది. ఈ సందర్భమున జరిగిన గ్రంథాలయ సేవకసభను సన్మాన సంఘాధ్యక్షులగు శ్రీయుత నేతిశ్రీకంటి యోగానందరావుగారు గ్రంథాలయోద్యమాభివృద్ధికి ప్రకాశవంతమైన భవిష్యత్తు కలదని నమ్ముటకు సూచనలు స్పష్టముగా కన్పించుచున్నవని నుడువుటలో సత్యమునే వెల్లడించిరి. ఆంధ్రదేశమున శ్రీపిఠాపురముమహారాజావారు ఆంధ్రభాషాభివృద్ధికి సర్వవిధముల తోడ్పడుచున్నా రనుటకు వీ రేర్పరచిన ఆంధ్రసాహిత్య పరిషత్తే ప్రబల నిదర్శనము. విద్వత్కవివరేణ్యులును జయపురాధీశులును నగు శ్రీ విక్రమ దేవవర్మ మహారాజాగారు ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు భూరివిరాళముల నొసగుచున్నారు. శ్రీ బొబ్బిలి మహారాజుగారు పోషకాగ్రేసరులుగా నుండి చాల సహాయపడుచున్నారు. స్వర్గీయులైన శ్రీ పోలవరం జమీందారుగారు తమ జీవితమునంతను భాషాసేవకే వినియోగించిరి. కవిపుంగవులగు శ్రీ తిరుపతికవి ప్రముఖులను ఆదరించిరి. వీరి పేరిటనే యిపుడు కాకినాడలో నొక గ్రంథాలయము నడుపబడుచున్నది. ఆంధ్రదేశమునందుగల మహారాజులు జమీందారులు భూస్వాములు ధనికులు మున్నగువారం

దరును గ్రంథాలయాభివృద్ధికి శ్రద్ధవంచన లేకుండ తోడ్పడవలెను. దేశమునందంతటను ఉచితగ్రంథాలయములను విస్తారముగా నెలకొల్పుటను అఖిలభారత గ్రంథాలయ సంఘమువారు పూనుకొనిరి గాన ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమువారు గూడ వారి సహాయమును బడయదగును. బెజవాడలో శ్రీయుత అయ్యంకి వెంకటరమణయ్యగారు సూరి వేంకట నరసింహశాస్త్రిగారు మున్నగువారు పెక్కువత్సరములనుండి గ్రంథాలయాభివృద్ధికి చాల శ్రద్ధ బూనియున్నారు. వీరు బెజవాడలో నేర్పరచిన రామమోహనగ్రంథాలయము వీరి సేవకు తార్కాణము. ఇటీవల నీ గ్రంథాలయ సంఘమున విదాదలు కలుగుట చాల సంతాపకరము. భగవదనుగ్రహమున త్వరలోనే మరల నన్యోన్యము కలుగుగాక. ఆంధ్రదేశమున గ్రంథాలయాభివృద్ధినిమిత్తము పనిచేయుచున్నవారికి ఆంధ్రు లందరును సర్వవిధముల తోడ్పడగలరని నమ్మెదము. ఖద్దరును స్వదేశీవస్తువులను దేశీయులధికముగా నుపయోగించుటకు ఖద్దరుస్వదేశీప్రదర్శనములెట్లుల నవసరమో గ్రంథాలయములవలన కలుగునట్టి గొప్ప లాభమును ప్రజలు బాగుగా గ్రహింపగలుగుటకు గ్రంథాలయసభలును ప్రదర్శనములునుగూడ నటులే అవసరము. కాకినాడలో శ్రీయుతులు రామదాసుపంతులు, ప్రకాశరావుపంతులు, యాతగిరి లక్ష్మీవేంకటరమణగార్లును నల్లూరిలో దేశభక్త కొండా వేంకటప్పయ్యపంతులు, మాగంటి బాపినీడు, గొల్లపూడి సీతారామశాస్త్రిగార్లు గ్రంథాలయముల ప్రయోజనమునుగూర్చి తెలిపిన విషయములు ముఖ్యముగా గమనింపదగియున్నవి. ప్రజలలో గ్రంథాలయములందాసక్తి పెరుగుచున్నదనుట కీసభలును ప్రదర్శనములును ముఖ్య నిదర్శనములు.

---

# మదరాసు గ్రంథాలయముల బిల్లు.

(ఆంధ్రపత్రిక సంపాదకీయము (22-1-34)

సర్వజనోపయుక్తము లగు గ్రంథాలయములను రాష్ట్రమునందంతటను నెలకొల్పి పట్టణములలోను గ్రామములలోను గ్రంథాలయముల నభివృద్ధి నొందించుట కీబిల్లు ఉద్దేశింపబడెనని తెలుపబడెను. మదరాసు విశ్వవిద్యాలయము గ్రంథాలయాధికారి ఎస్. ఆర్. రంగనాథముగారు వెనుక జేసిన సూచనలపైననే ఆధారపడి ఈ బిల్లు సిద్ధపరుపబడినను రంగనాథముగారి మాతృకలోని ముఖ్యవిషయము లిందులో కనుపించకుండుట విదిత మగుచునేయున్నది. ఈలోపములను సూచించుచు భారతగ్రంథాలయసంఘాధ్యక్షుడు డా॥ వి. శివరాంగారొక సవరణనుగూడ నిటీవల చేసియుండిరి గాని అదిగూడ నంత లాభకారిగ నుండియుండలేదు. స్థానిక గ్రంథాలయాధికారి తన పరిశీలనక్రింద నున్న ప్రాంతములో గ్రంథాలయము లధికముగా నేర్పడుటకు సర్వవిధముల ప్రయత్నింపవలెను. గ్రంథాలయాధికారి సమకూర్చిన మొత్తములో సగము మొత్తమునకు తక్కువగాని ధనమును స్థానిక ప్రభుత్వమువారు గ్రంథాలయాధికారి చేర్చిన మొత్తముతో కలుపుచుండవలెనని రంగనాథంగారు సూచించియుండిరి. ఈబిల్లులో నిట్టి యేర్పాటు లేవియును కనబడవు. ఇటుపైని క్రొత్తగా గ్రంథాలయముల నేర్పరుచుటకును ఇపు డున్న గ్రంథాలయములకు ధనసహాయము చేయుటకును దొరతనమువారికిగాని వారేర్పరుచునట్టి సంఘములకుగాని యెట్టి బాధ్యతయును ఈబిల్లులో సూచింపబడి యుండలేదు. దొరతనమువారును వారేర్పరచిన సంఘములవారును ధనసహాయము చేయుట కీబిల్లులో నెట్టి బాధ్యతయును సూచింపకుండుటయే గాక "గ్రంథాలయములలో గ్రంథములను పరిశీలించుటకును గ్రంథాలయములకు వచ్చుచుండువారిని పరిశీలించుటకును స్థానిక గ్రంథాలయాధికారి ఉపనిబంధనలను చేయుటకు దీనిలో నవకాశ మేర్పరుపబడెను. తమ అధ్యక్షోపన్యాసమున శ్రీయుత రామదాసు పంతులుగారు సూచించినట్లు పైకి నిది చాల నిరపాయకరముగా కనబడుచున్నను, ఈ అధికారము గలవారిట్టి అధికారమును దుర్వినియోగము చేయుట కెన్నియో అవకాశములు కలవని దేశీయులు గ్రహింపజాలకపోరు. అట్టి అధికారులు రాజకీయ వాఙ్మయమును మాత్రమేగాక జాతీయ వాఙ్మయమును గూడ పూర్తిగా నిషేధింపగలుగుదురు. ఖద్దరును ప్రోత్సహించుట, అటావాడంబడికను నిరసించుట మున్నగు విషయములకు సంబంధించిన గ్రంథముల కపుడు గ్రంథా

లయములలో తా వుండదు. గాంధిటోపీలను ఖద్దరు దుస్తులను ధరించినవారు గ్రంథాలయములకు రాగూడదని నిబంధనలను చేయుట వీరికి సులభ మగును. ఇప్పుడు గూడ గ్రామములలోని గ్రంథాలయములను గూర్చి యుండిలవిద్యాశాఖాధికారుల కట్టి అధికారము గలదో అట్టి అధికారము పోలీసుసర్కిలు ఇన్‌స్పెక్టరులకును వారి తాబేదారులకును గూడ కలదని రామదాసు పంతులుగారు వెల్లడించియున్నారు. ఇది ముఖ్యముగా గమనింపదగిన విషయము. ఈ నిబంధనల నుల్లంఘించిన వారికి శిక్ష వేయుటకు గూడ ఈ బిల్లులో నవకాశము కలదు. ఇపుడు మ్యునిసిపాలిటీలు తాలూకాబోర్డులు గ్రామపంచాయతీలు మున్నగు స్థానికసంస్థలు గ్రంథాలయముల నేర్పరచి పోషించుట కధికారమును కలిగి యున్నవి. ఈ స్థానిక సంఘముల పైని స్థానికసంఘముల ఇన్‌స్పెక్టరుకును స్థానిక ప్రభుత్వశాఖామంత్రికిని అధికారము కలదు. అట్టిచో నింతకంటె హెచ్చుఅధికార మును కోరుటకు మా కట్టి అవసరమును కనబడదు. ఈ బిల్లు ప్రకారము రాష్ట్రీయ సంఘము స్థానికసంఘములు ప్రాంతీయసంఘములు సంయుక్త సంఘములు మున్నగున వెన్నియో యేర్పడగలవు. దీనిని బట్టి చూచినచో రామదాసుగారు తెలిపినట్లు గ్రంథాలయముల సంఖ్యకంటె పరిశీలకసంఘముల సంఖ్యయే అధికమగు నట్లు కనబడుచున్నది. క్రొత్తగా గ్రంథాలయముల డైరెక్టరును గ్రంథాలయ శాఖయును ఏర్పరుపబడు నెడల స్థానిక సంఘముల కట్టి అవకాశమును లేకుండ పోవచ్చును. ఈ శాఖయొక్కయు ఉద్యోగులయొక్కయు వ్యయమునకు క్రొత్తపన్నుగూడ విధింపబడును. ఇదివరకే పన్నులచే క్రుంగిపోవుచున్న ప్రజలపై మరియొక క్రొత్త పనున్ను విధించుట దుర్భరమే యగును. ప్రారంభవిద్యను ఉచితముగ నిర్బంధముగను వ్యాపింపజేయవలెనని ప్రజలు కోరుచుండ, గ్రామములో నిబీదసాదలకు జ్ఞానాభివృద్ధికి సహాయకములగు గ్రంథాలయముల విషయమున పన్ను విధింపవలెనని సూచించుట చాల ఆశ్చర్యకరము. దేశమునందలి ప్రజలలో 100 కి 10 మందియైనను అక్షర జ్ఞానము కలవారు లేరని స్పష్టమగుచుండ, నిపుడు క్రొత్తగా దీనిని గూర్చి విచారణ చేయవలె ననుట మిక్కిలి అసమంజసమును వ్యయమూలము నని చెప్పక తప్పదు; కావున దీనిని గూర్చి కాకినాడలో జరుగుచున్న 16 వ ఆంధ్ర గ్రంథాలయ సభలో సభవారు తమ అసమ్మతిని స్పష్టముగా వెల్లడించుటయే గాక లాభకరములగు సూచనలను చేయుట ప్రధాన కర్తవ్యమై యున్నది. దేశమున ఉచితప్రాథమిక విద్యాశాలలును ఉచితగ్రంథాలయములును వేలకొలదిగా నేర్పడవలెను. దేశమునందు విద్య సార్వత్రికము కావలెను. ప్రజలకు రాజకీయపరిజ్ఞానము కలుగవలెను. మూఢవిశ్వాసములును అజ్ఞానమును తొలగవలెను. స్వరాజ్యమును శీఘ్రముగా లభించుట కిది అవశ్యకర్తవ్యము గావున నిందులకు నిరోధకములగు బిల్లులను, ఏర్పాటులను దేశీయులు ఏకగ్రీవముగా ఖండించక తప్పదను విషయమును గుర్తింతురుగాక.

---

## భీమవరం తాలూకా
# గ్రంథాలయసంఘాభివృద్ధి

### 1933 — 34 సం. నివేదిక.

భీమవరం తాలూకా గ్రంథాలయ సంఘము ది 12-3-33 న ఉండిగ్రామములో ఆంధ్రదేశగ్రంథాలయసంఘకార్యదర్శియు సుప్రసిద్ధగ్రంథాలయ సేవాతత్పరులునైన శ్రీయుత అయ్యంకి వెంకటరమణయ్య పంతులుగారి అధ్యక్షతను జరిగిన ప్రథమ భీమవరం తాలూకా గ్రంథాలయమహాసభలో స్థాపింపబడినది. ఆమహాసభలో ఎన్నుకోబడిన 15 గురు సభ్యులుగాక మరి ఇద్దరు ఈ సంఘములో చేర్చుకొనబడిరి. ఈ సంవత్సరములో 8 కార్యనిర్వాహక సభలును, 2 ఉపసంఘసభలును, 46 ప్రచారకసభలును జరుపబడినవి. తాలూకాలోని పూర్వపు గ్రంథాలయములు 37 టిలోను 18 గ్రంథాలయములుమాత్రమే ప్రస్తుతము పనిచేయు

చున్నవి. ఇందులో ఈ దిగువ 10 గ్రంథాలయములను ఈ సంవత్సరములో పునరుద్ధరింపబడినవి.

1. శ్రీ ఆంధ్రవాల్మీకి: వావిలికొలను సుబ్బారాయ గ్రంథాలయము, వేండ్ర.
2. శ్రీ పరపతిసంఘ గ్రంథాలయము } యండగండి.
3. శ్రీ సహకారసంఘ గ్రంథాలయము }
4. శ్రీ సీతారామాంజనేయ గ్రంథాలయము, పెద పుల్లేరు.
5. శ్రీ మోతీలాల్ పుస్తక భాండాగారము, కోణితివాడ.
6. శ్రీ వేణుగోపాల పుస్తక భాండాగారము, ఆండలూరు.
7. శ్రీ కృష్ణదేవరాయ పుస్తక భాండాగారము, చెరుకుమిల్లి.
8. శ్రీ బ్రహ్మానందదాయిని పుస్తక భాండాగారము, విస్సాకోడేరు.
9. శ్రీ యువజనానంద గ్రంథాలయము, చిలుకూరు.
10. శ్రీ రానడే గ్రంథాలయము, పాలకోడేరు.

ఇవిగాక ఈ దిగువ నుదాహరింపబడిన గ్రంథాలయములు ఈ తాలూకాలోని ఆయా గ్రామములందు నూతనముగ స్థాపింపబడినవి.

1. శ్రీకృష్ణ గ్రంథాలయము, మహాదేవపట్నం.
2. శ్రీ పద్మనాభ స్వామి గ్రంథాలయము, పెదఅమరం.
3. శ్రీ శారదా గ్రంథాలయము, వాండ్ర.
4. శ్రీ సూర్యరాజు గ్రంథాలయము, తోలేరు శివారు, సూర్యరాజుపేట.
5. శ్రీ గణపతి గ్రంథాలయము, వేంపాడు.
6. శ్రీ పకేలు గ్రంథాలయము, భీమవరం.
7. శ్రీ సుబ్బరాయ స్మారక గ్రంథాలయము, పెన్నాడ అగ్రహారం.
8. శ్రీ రంగేశ్వరానంద గ్రంథాలయము, చిన అమరం.
9. శ్రీ అరుంధతీ గ్రంథాలయము, చెన్నురంగనిపాలెం.
10. శ్రీ సీతారామాంజనేయ గ్రంథాలయము, చెరుకువాడ.

ఈ గ్రంథాలయ సంఘాధ్యక్షులును, దేశసేవాపరులును, ప. గోదావరిజిల్లా గ్రంథాలయ సంఘాధ్యక్షులును అగు శ్రీయుత భూపతిరాజు తిరుపతిరాజుగారు, వ్యయప్రయాసలకు ఓర్చి ఈ వృద్ధాప్యములో తాము చూపిన దీక్షకును, చేసిన గ్రంథాలయసేవకును, ఈ తాలూకా ప్రజలపక్షమున అనేక వందనశతంబులు అర్పించుచున్నాడను. వారి ప్రయాణపు ఖర్చుల కైనను ఈ సంఘము సహాయము చేయలేదని మనవి చేయుటకు చింతిలుచున్నాడను. వీరు వెళ్లిన గ్రామమే తిరిగి వెళ్ళవలసి వచ్చుచుండుటచేతను, కొన్ని గ్రామములయందు ఉత్సాహముగాని, సహాయము చేయుటకు పూనిన యువకులు గాని లేనందున పూర్వపు గ్రంథాలయములన్నియు పునరుద్ధరించుటకు తగినఅవకాశము కలుగలేదు.

ఈ తాలూకాయందు గ్రంథాలయ ప్రచారము సుమారు 40 సం॥రముల క్రితమే ప్రారంభింపబడినది. కాని రానురాను ప్రచారము లేకపోవుటచేతను యువకులం దుత్సాహము సన్నగిలుటచేతను పూర్వము స్థాపింపబడిన పెక్కు గ్రంథాలయములను పునరుద్ధరింపవలసి యున్నది. గ్రంథాలయములు లేని గ్రామములందు నూతనముగ గ్రంథాలయములను స్థాపించవలెను. గ్రామములయందు, విద్యా, ఆర్థిక, భౌతిక, సాంఘిక, మత, రాజకీయాభివృద్ధి కలుగ జేయవలెను, ఇట్టి సర్వతోముఖాభివృద్ధికి గ్రంథాలయములే పునాదులు.

ఈ సంఘము గ్రంథాలయముల స్థాపించి పునరుద్ధరించి కొన్ని గ్రంథములను వాటికి సమకూర్చుటయే కాక, ఆ గ్రంథములను గ్రామస్థులచే చదివించియు, జ్ఞానులచే నుపన్యాసము లిప్పించియు, మాజికులాంతరు మొదలగు సాధనములచే జ్ఞానాభివృద్ధి కలుగచేసియు, నవీనపద్ధతుల వ్యవసాయముచేయుట, దేశమునందలి వివిధప్రాంతములందలి ధరవరలును కనుగొని వెల్లడి చేయుట—ఇవి యవి యననేల? గ్రామస్థులలో, స్త్రీ పురుషజాతిమతవిభేదములేక సౌఖ్యసంపన్నులుగా నుండుటకు తగు నుపాయము లరయుచు ప్రబోధించుచుండవలసియున్నది. కాన దేశసేవాతత్పరులును, కార్యదీక్ష కలిగిన త్యాగశీలురును ప్రతిగ్రామమునందును ఏ కొలదిమందైనను ఈ సంఘమునకు సహాయముచేసినగాని పైన వివరించిన విషయములన్నింటియందు కృషిసల్పుట దుస్సాధ్యము. కనుక తాలూకా ప్రజలందరు ఈ తాలూకా గ్రంథాలయసంఘమునకు యథాశక్తి సహాయముచేసి తాలూకాయందలి ప్రజలు అన్నివిధముల అభివృద్ధి చెందగలందులకు చేయు ప్రయత్నములను సఫలపరచగలందులకు కోరుచున్నాడను.

పాలకోడేటి సత్యనారాయణశర్మ,
కార్యదర్శి,

భీమవరం తాలూకా

# గ్రంథాలయ మహాసభ.

ప. గోదావరిజిల్లా భీమవరం తాలూకా గ్రంథాలయ మహాసభ ది 11-2-34 ఆదివారము మధ్యాహ్నము కుముదవల్లి గ్రామములో సర్దారు దండు నారాయణ రాజుగారి అధ్యక్షతను జరుపబడెను. సాగి వెంకట నరసింహరాజుగారు ఆహ్వానించుచు సందరకు స్వాగతము పల్కిరి. శ్రీయుత కొమరాజు హనుమంతరావు గారు మహాసభను ప్రారంభించుచు జ్ఞానమును గురించియు, ఆ జ్ఞానము లభించు మార్గములను గురించియు అందు గ్రంథాలయములు చేయు సేవను గురించియు విపులముగా చెప్పిరి.

అధ్యక్షులగు సర్దారు దండు నారాయణరాజుగారు విద్యనుగురించియు ప్రస్తుత భారతదేశమందలి విద్యాహీనతను గురించియు, గ్రంథాలయములు విద్యాభివృద్ధికై చేయుసేవను గురించియు, మదరాసు శాసనసభ యెదుటనున్న గ్రంథాలయ చట్టమును గురించి ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభాధ్యక్షోపన్యాసములో శ్రీయుత వేమవరపు రామదాసు పంతులుగారు చేసిన ఖండనతో తాను పూర్తిగా నేకీభవించుచున్నాననియు, ఈ చట్టము గ్రంథాలయోద్యమాభివృద్ధికి తోడ్పడునట్టిదిగా గన్పట్టుట లేదనియు ప్రస్తుతము భారతదేశములో నున్న దుర్భర ఆర్థికదుఃస్థితిలో పండిన పంట పన్నులకే చాలని ఈరోజులలో నింకను క్రొత్త పన్నులను వేయు చట్టమును చేయబూనుట క్రూరత్వమనియు చెప్పిరి.

తరువాత డాక్టరు తేతలి సత్యనారాయణగారు గ్రంథాలయ పరిపాలన గురించియు, గ్రంథాలయముల ఆవశ్యకతను గురించియు, ముదుగంటి జగ్గన్నశాస్త్రి గారును, 'నేటి కవసరమగు విద్య'నుగురించి కొవ్వాలి గోపాలరావుగారును, 'ప్రజాసేవను' గురించి చంగల్వల చిట్టిపంతులుగారు 'గ్రామోద్ధరణమును' గురించి కలిదిండి నరసింహరాజుగారును, 'అస్పృశ్యతనుగురించి' రాయసం వెంకటశివుడుగారును స్త్రీవిద్యగురించి కోటమర్తి కనకమ్మగారు నుపన్యసించిరి. అనంతరము ఈ దిగువ తీర్మానములు చేయబడినవి.

## తీర్మానములు

1. అఖండత్యాగశీలురును, దేశసేవా తత్పరులును, భారతజాతీయనాయకులును అగు శ్రీయుత విఠలభాయి పటేలు, సేనుగుప్తాగార్లను శ్రీయుత పొన్నపల్లి వీరరాఘవ సోమయాజులుగారును, ఆంధ్రదేశమున ఆంధ్రవాఙ్మయాభివృద్ధిగావించి ఆంధ్రపత్రిక సంపాదకులుగాయున్న శ్రీయుత చల్లా శేషగిరిరావుగారును, బరంపురం నివాసులగు సుప్రసిద్ధ ఆంధ్రులును అయిన శ్రీయుత ఉన్నవ రామలింగం పంతులుగారును, హిందూ పత్రికాధిపతియగు శ్రీయుత రంగస్వామి అయ్యంగార్ల నిర్యాణమునకు ఈ సభవారు చింతించుచు వారి ఆత్మకు శాంతి యొసంగుగాక! యని భగవంతుని ప్రార్థించుచున్నారు.

2. కార్యదర్శిగారు క్రిందటి సంవత్సరము చేసిన పనినిగురించి చెప్పిన నివేదిక నామోదించడమైనది.

3. శ్రీ బషీరు అహమ్మదుగారిచే మద్రాసు శాసననిర్మాణసభయందు ప్రవేశపెట్టబడిన మద్రాసు గ్రంథాలయ చట్టము (Bill No XI of 1933) ఈ రాజధానియందు ప్రాముఖ్యమగు వివిధదేశభాషలయొక్క వికాసమునకు దోహద మిచ్చునదిగా గన్పట్టుటలేదనియు, ప్రస్తుత దేశపరిస్థితిగతులయందు అభివృద్ధికి భంగకరముగ నున్నదనియు, నూతన పన్నులను వేయునట్టి ఎట్టి చట్టముగాని దేశమున ఆవరించియున్న ప్రస్తుత దుర్భర ఆర్థికదుఃస్థితియందుప్రవేశపెట్టుట భావ్యము కాదనియు, ఈ సభవారు తీర్మానించుచు ప్రభుత్వమువారికి విన్నవించుచున్నారు.

4. మద్రాసు గ్రంథాలయచట్టమును విచారించుటకు చట్టనిర్మాణసభకు, ఉపసంఘమునకు సభ్యులుగ ప్రభుత్వమువారితరఫున శాస్త్రజ్ఞానవేత్త (Technical Expert)గ నియమింపబడిన మద్రాసు గ్రంథాలయసంఘాధ్యక్షులగు శ్రీ కే. వి. కృష్ణస్వామి అయ్యరు గారికి గ్రంథాలయ పాలన అనుభవజ్ఞానముగాని, పల్లెటూరి గ్రంథాలయములనుగూర్చిన అనుభవము గాని

బొత్తిగా లేదని ఈ సభవారు వినయపూర్వకముగ విన్నవించుచు, వారి అభిప్రాయములను ఆధారములుగా తీసికొనరాదని మద్రాసు ప్రభుత్వమువారిని, మద్రాసు శాసన సభవారిని ఈ సభవారు వినయపూర్వకముగ కోరుచున్నారు.

5. గ్రామము నందలి విద్యావ్యాప్తికి ప్రాథమిక పాఠశాలలవలె, గ్రంథాలయములుకూడ తోడ్పడును. కావున, జిల్లా బోర్డువారు గ్రామ గ్రంథాలయములకు విరివిగా విరాళముల నిచ్చియు, గ్రంథాలయములు లేని గ్రామములయందు గ్రంథాలయములను నెలకొల్పియు గ్రంథాలయాభివృద్ధి కలుగచేయగలందులకు ఈ సభవారు జిల్లాబోర్డువారిని కోరుచున్నారు.

6. గ్రామములలో నుండు సహకార సంఘముల యందు నేర్పడు సాముదాయకనిధి నంతయు ఆ యా గ్రామముల యందలి గ్రంథాలయముల కిచ్చి విద్యాభివృద్ధికి తోడ్పడగలందులకు తాలూకాలోని సహకార సంఘములను ఈ సభవారు కోరుచున్నారు.

7. రాష్ట్రీయ ప్రభుత్వమువారిచ్చు గ్రాంటులతో కొను పుస్తకములకు విద్యాశాఖాధికారుల అనుమతి అవసరమనుట అన్యాయమని ఈ సభవారు నిర్ణయించుచు, అట్టి అనుమతిని లేకుండనే బహిష్కరింపబడని పుస్తకములనే గ్రంథాలయ సంఘమువారు కొనుటకు అధికార మిచ్చుచు ఉత్తరువును జారీచేయించగలందులకు మద్రాసు ప్రభుత్వమువారిని కోరుచు, అట్టి బహిష్కరణ పుస్తకముల పట్టిని అన్నిగ్రంథాలయములకు ఉచితముగా పంపగలందులకు ఈ సభవారు ప్రభుత్వము వారిని వేడుచున్నారు.

8. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము రిజిష్టరీ అయినదిగాన, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘశాఖలగు తాలూకా గ్రంథాలయ సంఘములకు దానియందు చేరిన (affiliats) గ్రామ గ్రంథాలయములకుగాని వేరేరిజిష్టరీ అవసరము లేకయే వరుసగా రిజిష్టరీ సంఘములుగను, రిజిష్టరీ గ్రంథాలయములుగను పరిగణించుచు ఉత్తరువును జారీచేయించగలందులకు మద్రాసు ప్రభుత్వము వారిని ఈ సభవారు కోరుచున్నారు.

9. కార్యనిర్వాహక వర్గముచే తయారుకాబడిన మాదిరి నిబంధనలు ఆమోదించుచు వాటిని తాలూకా గ్రంథాలయ సంఘమునకును, గ్రామగ్రంథాలయ సంఘములకును అమలుపరచగలందులకు తీర్మానించుచు వాటిని అచ్చువేయించి తాలూకాగ్రంథాలములో చేరు గ్రంథాలయము లన్నిటిని ఇచ్చుటకు తీర్మానించడమయినది.

10. ఈ దిగువవారిని కార్యనిర్వాహక సభ్యులుగా రాబోవు సంవత్సరమునకు ఎన్నుకొనడమయినది.

1 భూపతిరాజు తిరుపతిరాజుగారు, కుముదవల్లి 2 ముదుండి లక్ష్మనరసింహంగారు, పెదఅమిరం 3 పాలకోడేటి సత్యనారాయణ శర్మగారు, భీమవరం 4 వేగేశ్న సూర్యరాజుగారు, పాందువ్వ. 5 కొత్తపల్లి వెంకటపతిరాజుగారు, పాలకోడేరు 6 తటవర్తి కృష్ణమూర్తిగారు, భీమవరం. 7 సాగి వెంకట్రామయ్యగారు, చినఅమిరం. 8 గంథం రామారావుగారు, ఉప్పలూరు. 9 గొడవర్తి సూర్యనారాయణ గారు, ఆండలూరు. 10 చంగల్వల చిట్టిపంతులుగారు, రాయమదురు. 11 శ్రీపాద గగవన్నారాయణగారు, భీమవరం. 12 భమిడిపాటి సూర్యనారాయణగారు, 13 జంపన రామయ్యగారు. అయిభీమవరం. 14 ప్రిసుల సాగరంగారు, చినరంగనిపాలెం. 15 జూపూడీ కేశవరావుగారు, భీమవరం. ఇంక నితరులను చేర్చుకొనుటకును అధికార మివ్వడమయినది.

11. ఈ దిగువ వారిని ఆయా హోదాదారులుగ ఎన్నుకొనడమయినది.

భూపతిరాజు తిరుపతిరాజుగారు, అధ్యక్షులు.
జూపూడి కేశవరావుగారు, ఉపాధ్యక్షులు.
ముదుండి లక్ష్మనరసింహారావుగారు,
పాలకోడేటి సత్యనారాయణ శర్మగారు,
సంయుక్త కార్యదర్శులు.

12. 1934-35 సంవత్సరము తాలూకాగ్రంథాలయసభకు శ్రీగంగేశ్వరానంద గ్రంథాలయ సంఘము వారి ఆహ్వానమును అంగీకరించడమయినది.

# పిల్లలగ్రంథాలయము.

అమెరికా దేశమందు "క్వారీఫారము" అనునది ఒక చిన్నపల్లెటూరు. ఆ గ్రామమునకు చుట్టుప్రక్కల అనేక మైళ్ళలోపున గ్రంథాలయ మెద్దియును లేదు. అందుచేత ఆ గ్రామమందున్న పిల్లలు తీరిక సమయము లందు విశ్రమమును పొందవలెననిన, తమకు తోచిన పాతరకపు ఆటలనైన ఆడుకొనవలెను. లేదా, దగ్గరనున్న పట్నమునందున్న సినిమాకైనా బోవలెను. ఆగ్రామమునందున్న పిల్లలలో చాలమంది పొలములలో వ్యవసాయము చేసికొనుచుండు రైతుబిడ్డలు - వారందరు జ్ఞానసముపార్జనాసక్తులగు తెలివితేటలు గలిగిన పిల్లలు.

ఆ గ్రామమందు పూర్వకాల మెప్పుడో కోడిపిల్లల కొఱకు రాతితో కట్టినట్టి అందమైన చిన్న ఇల్లొకటి గలదు. ఈ మధ్యకాలమందా యిల్లు పటములు వ్రాసి కొనుటకు ఉపయోగించుచుండిరి. ఇప్పుడు అచట అపని యును జరుగుటలేదు. అందుచేత ఆ యింటిని, గ్రామ గ్రంథాలయముగ మార్చిన బాగుండునని తలంచిరి.

వెంటనే ఒకబల్ల, కొన్నికుర్చీలు, కిటికీలకు తెఱ బట్టలు సంపాదింపబడెను. ఆ ఇంటియందున్న అలమరలు - మూలలు - సందులు - గోందులు - ఎల్లెడల నాకర్షవంతములగు గ్రంథములతోను పటములతోడను ఆటలతోడను నింపివేయబడెను. అందుచేసిన యేర్పాటు లన్నియు పిల్లలను ఆకర్షించునవిగను, వారి తృష్ణను సంతుష్టిపరచునవిగను ఉన్నవి.

ప్రారంభోత్సవమునకు ఆ గ్రామమందలి పిల్లలందరును ఆహ్వానింపబడిరి. ప్రథమమున ఒకగంటసేపు పిల్లలకు కథలు చెప్పిరి. తర్వాత ఆటలు - తుదకు ఫలహారములు. అప్పుడు గ్రంథాలయముయొక్క అభిప్రాయములు అందరకిని విప్పిచెప్పబడినవి. తుదకు పిల్లలందరును తలకొక పుస్తకమును దీసికొని సంతోషముతో ఇంటికి బోయిరి.

ఆ గ్రంథాలయమందు ఏపిల్లలైన సభ్యులు కాదలంచినయెడల, సభికుల పట్టికయందు సంతకము చేసిన జాలును. వానికి ప్రథమమున గ్రంథాలయముయొక్క నిబంధనలు విప్పిచెప్పబడును. అచటి గ్రంథము లన్నియు విషయములనుబట్టి వరీకరణము చేయబడినవి. ప్రతి గ్రంథమునందును ఒక కార్డను చీటీయును గలవు. వాని మీద, ఆ గ్రంథమును తిరిగి ఎన్నిదినములలో వాపసు చేయవలసి యుండునో సూచింపబడియుండును. పిల్లలు గ్రంథమును తీసికొనిపోవునప్పుడు పెద్దవారెవ్వరును తనిఖీ చేయుటలేదు. వారు గ్రంథములను ఎరువు తీసికొని పోవునప్పుడు "కార్డు" మీద సంతకముజేసి, అది పెట్టుటకై నియమితమైన చిన్నడ్రాయరునందు దాని నుంచెదరు. ఆ డ్రాయరుబల్లప్రక్కనే తారీకులను దెలుపు "క్యాలండరు" వ్రేలాడగట్టబడి యుండును. పుస్తకమును తిరిగి ఇవ్వవలసిన తారీకును అందు జూచుకొని, ఆతారీకును వ్రాయవలసినచోట పిల్లలే వ్రాయుదురు. ఇది యంతయును ఏ తనిఖీయును లేకుండనే జరిగిపోవుచుండును. అయినప్పటికిని పుస్తకములు ఎరువుతీసికొనువారిపేరు వ్రాయునప్పుడుగాని, తిరిగి గ్రంథమును ఇవ్వవలసిన తారీకును నమోదుచేయుటయందుగాని పొరబాటులు ఎంతమాత్రమును జరిగి యుండలేదు. పుస్తకములు ఏమియు పోవుటగూడ జరిగి యుండలేదు.

గ్రంథాలయమునకు వచ్చి అదివరకు తీసికొనిపోయిన గ్రంథములను వాపసుజేసి తిరిగి కొత్తగ్రంథములను తీసికొనిపోని దిన మేదియు ఎండకాలమునందు లేనే లేదని చెప్పిన నతిశయోక్తి ఎంతమాత్రమును గాదు. కొందరు పిల్లలు గ్రంథాలయమునకు వచ్చుటకుగాను రెండు మూడు మైళ్లదూరమును - అంతకంటె నెక్కువయును గూడ నడువవలసియుండును. చపలులగు అయిదు లేక ఆరు సంవత్సరములు వయస్సు గలిగిన పసికూనలు కూడ తమ సోదరులతోగాని, సోదరీమణులతోగాని గ్రంథాలయమునకు వచ్చి బొమ్మలపుస్తకములున్న అరలు వారల బుద్ధికనులను ఆకర్షింపజేయగా, వానిని చూచి చూచి, తుదకొక పుస్తకమును తీసికొని తమచంకల యందు గట్టిగా అదిమిపెట్టికొని ఇంటికి పోవుచుందురు. కొందరు పిల్లలు బిడియముగలిగియుందురు; మరికొందరు మోటుదేరి యుందురు. అట్టివారుగూడ ఈ గ్రంథాలయమునకు వచ్చి గ్రంథములను దీసికొని పోవుచుండుట ఆశ్చర్యకరమైనట్టియు, ముదావహమైనట్టియు విషయము.

ఒకదినమున ఆ గ్రంథాలయమునకు ఒక చిన్నపిల్ల వచ్చి "మా అన్నయ్యకు ఒక పుస్తకము ఇస్తారా" అని అడిగినది. ఆ అన్నయ్యయొక్క వయస్సునుబట్టి, తగిన పుస్తకమును ఏర్చి ఇచ్చుటకుగాను అతని వయస్సెంత? అని అడిగిరి. దానికా పిల్ల ఇట్లు చెప్పినది. "మా అన్న

య్య చాల పెద్దవాడు; సుమారు ఇరవై సంవత్సరములుండును.'' అతనికి అనువుగ నుండునట్టి గ్రంథము ఇయ్యబడినది. వారము దినములు కాగానే ఆ పెద్దన్నయ్య చెల్లెలు వచ్చి, తీసికొనిపోయిన పుస్తకమును వాపసు ఇచ్చి, తన అన్నయ్య పుస్తకము బాగుగా నున్నదని చెప్పినాడనియు తిరిగి ఇంకొక పుస్తకమును తీసికొని రమ్మన్నాడనియు చెప్పి, ఇంకొక పుస్తకమును తీసికొని వెళ్ళినది.

ఈ గ్రంథాలయము కొన్ని వందల పుస్తకములతో మాత్రము ప్రారంభింపబడినది. ఆ సంఖ్య దినదిన ప్రవర్ధమాన మగుచున్నది. ఈ యుద్యమమును విన్న స్నేహితు లందరును, అనేక గ్రంథములను పంపి తోడ్పడిరి. "ఫిలడల్ఫియా''యందు ఒక ప్రయివేటు పాఠశాలయందలి విద్యార్థులు చాల గ్రంథముల నిచ్చిరి.

శీతకాలమందు పిల్లలు బడిచదువులతో మునిగియుందురు; అందుచేత నాకాలమున పిల్లలు గ్రంథాలయమునకు విశేషముగా రారు. వేసవికాలపు సెలవుదినములందు ఈ గ్రంథాలయము ఎడతెరపిలేకుండ ఉపయోగింపబడుచున్నది. ఆ గ్రామమందలి పిల్లల జీవితమునందు ఈ గ్రంథాలయము అద్భుతమగు మార్పు గలిగించుచున్నది.

# గ్రామగ్రంథాలయము.

"వర్జీనియా'' దేశమందు "బాన్ ఎయిర్'' అను చిన్న గ్రామమందు పదునారు సంవత్సరములనుండి ఆ గ్రామమునందలి దేవాలయము (Church) నందు పూజారిగా నున్న "హెజనా'' అను పరోపకారపారీణుని కార్యదీక్షవలన 1901 వ సంవత్సరమందు సార్వజనిక గ్రంథాలయము ఒకటి స్థాపింపబడినది; ఆ గ్రంథాలయమునకు ఆయనయే ప్రథమాధ్యక్షుడుగా నుండెను. 1902 వ సంవత్సరమునందాయన చనిపోగా ఆయన జ్ఞాపకార్థ మా గ్రంథాలయమునకు స్వంతభవనమును కట్టి 1908 వ సంవత్సరమున ప్రారంభోత్సవమును జేసిరి. ప్రారంభోత్సవమునకు వచ్చినవా రందరును ఒక్కొక్క పుస్తకమును దానము జేసిరి.

గ్రంథాలయమునకు పుస్తకములను కొనుటకు నిల్వ సొమ్మేమియులేదు. అందుచేత అప్పుడప్పుడు అనేక వేడుకలను ఏర్పాటు జేసి, గ్రంథాలయాధికారులు సొమ్మును సంపాదించుచుందురు. గ్రంథాలయమునకు స్థిరమైన ఆదా సభ్యత్వపు చందామాత్రమేను. సభ్యుల చందా సంవత్సరమునకు ఒక డాలరు (రు. 2-8-0 లు) అట్టిచందా నిచ్చు సభ్యులు 27 గురు మాత్రము కలరు. వీరివలన సంవత్సరమునకు 27 డాలర్లు (రు 67-8-0 లు) మాత్రము వసూలగును. ఈ సొమ్ములో నుండియే, పత్రికలు తెప్పించుటకు చందాలు, వంటచెరకు (ఆ దేశమునందు చలి విస్తారముగా నుండుటచే ప్రతి యింటియందు వెచ్చగా నుండుటకై ఎల్లప్పుడు నిప్పు రాజుచు నేయుందురు). ఊడ్చుటకు, మరమ్మతులుచేయుటకు కావలసిన సొమ్ము ఖర్చుపెట్టవలసియుండును. అందుచేత క్రొత్త పుస్తకములు కొనుటకు సొమ్మేమియు అందుండి మిగులదు.

ఆ గ్రామస్థు లందరికిని పుస్తకములు ప్రతి మంగళవారమునాడు సాయంకాలము నాలుగుగంటలు మొదలు అయిదు గంటలవరకు ఇచ్చెదరు. ఆ పుస్తకములను తిరిగి మరుచటి మంగళవారమునందు వాపసు జేయవలయును. అట్లు వాపసు జేయనివారు తిరిగి ఆ గ్రంథమునే ఎరువు తీసికొనవలెను. వాపసు జేయకను, తిరిగి ఎరువుతీసికొనకను ఉండువారు జుల్మానా ఇయ్యవలసియుండును. తీరికసమయములందెల్ల ఆ గ్రామస్థులు గ్రంథాలయమందే చేరియుండెదరు. గ్రామస్థు లందరికి గ్రంథాలయము సాముదాయిక ప్రదేశముగ నేర్పడినది. మంగళవారమునాడుమాత్రము గ్రంథాలయమునకు వచ్చువా రందరికి "తేయాకునీరు''ను అల్పాహారములును సప్లయి చేయబడును. పళ్ళెము 1 కి అయిదుసెంట్లు (డాలరుకు 100 సెంట్లు - డాలరుకు రు 2-8-0 లు) ఖరీదు. ఆనాడు గ్రంథాలయమునకు చాలమంది వచ్చెదరు. ఔదార్యవంతులగు అనేకమంది గ్రంథకర్తలును, ప్రకాశకులును తమ గ్రంథములను గ్రంథాలయమునకు దయతో నొసంగిరి. గ్రంథాలయమందు 8,500 గ్రంథములు గలవు.

గ్రంథభాండాగారియగు "ఫ్రాంచెస్ విథర్సు''అను నామె 1906 సంవత్సరమునుండియు గ్రంథాలయమునకు ఉచితసేవను జేయుచున్నారు.

# కీర్తిశేషులైన బెల్గాం రామదాసునాయుడుగారి
# స్వీయ చరిత్ర.

జననము:—

వీరు సెకందరాబాదు అను నైజాము ఇలాకాలో జన్మించి, కొచ్చి, కొల్లడం, తిరుచునాపల్లి, చెన్నపట్నం మొదలగు ప్రదేశములలో పెరిగి బెంగుళూరు చేరెను. వీరి తండ్రియగు నారాయణస్వామిగారు బ్రిటిష్ సైన్యమందొక యుద్యోగిగా 21 వ మదరాసు పయినీరు పటాలమునందు నున్నందున ఆ పటాలము ఎక్కడకి పోయిన వీరు వీర తండ్రివెంట వెళ్లుచుండువారు. కొన్నిదినములకు బెంగుళూరినుండి బెల్గాము అను బొంబాయిరాజధానికి వీరి తండ్రిగారు ప్రయాణము చేసిరి. వారివెంట వీరును, వీరియన్నయగు దొరస్వామిగారును వెళ్లిరి. కొన్ని దినములకు వీరి తండ్రిగారు చీనల్సు యుద్ధమునకు పోవలసినవారైరి. అప్పటికి దాసుగారి అన్నగారివయస్సు 12 సంవత్సరములు. దాసుగారి వయస్సు సుమారు 10 వత్సరములు. తండ్రిగారు యుద్ధమునకు వెళ్లుటకుమునుపు వీరిని వీరితల్లి సంరక్షణక్రింద చెన్నపట్టనమున వదలిరి. అచ్చట ఒక సంవత్సరము ఉండునంతలో, వీరి తండ్రిగారు యుద్ధము ముగించిన తోడనే వీరిని చెన్నపట్టనమునుండి బెల్గామునకు పిలిపించిరి. అచ్చట రెండు సంవత్సరములు ఉండునంతలో మరి వారితండ్రిగారికి పంజాబునకు ప్రయాణము తగిలెను. అందువలన కీ. శే. దాసుగారి మేనత్తగారు బళ్లారిలోనున్న వారి వశములోనుంచి వెళ్లిరి. అప్పటికి వీరు ఆంధ్రభాష యన నెట్టిదో యెరుగరు. ద్రావిడభాషయే మాతృభాషగా నుండెను.

భాష:—

అప్పుడు హూణభాషయందు కొంచెము ప్రవేశము కలదు. బెల్గామునకు వచ్చిన తరువాత నాంధ్రభాషయందు శ్రీ దాసుగారు ప్రవేశించిరి. కాని వీరి యన్నగారు ఆంధ్రభాషయందు ప్రవేశింపక యెప్పుడును చెన్నపట్టణమునందే కాలము గడుపుచు వచ్చిరి. కీ. శే. దాసుగారు మాత్రము బళ్లారియందే వీరి మేనత్తగారి సంరక్షణములో నుండి కొంతవరకు తెనుగు నేర్చినపిమ్మట బళ్లారి వార్డ్లా హైస్కూలులో 3 వ తరగతిలో చేరిరి. 1901 నవంబరు నెలలో అంతలో పంజాబునకు వెళ్లియుండిన వీరి తండ్రిగారు ఉపకారవేతనమును పుచ్చుకొని బళ్లారి చేరినారు. ఉపకారవేతనమువలన వచ్చుపైకము వీరి ముగ్గురికి చాలనందున వీరి తండ్రిగారు ఒకఅంగడినిపెట్టిరి. అందువలన వచ్చు ఆదాయముతో జీవనము జరుపుకొనుచుండిరి. 1906 అక్టోబరు నెలయందు శ్రీ కీ. శే. దాసుగారి అన్నగారు పరలోకగతులైరి. అప్పటికి దాసుగారు 2 వ ఫారము చదువుచుండిరి. 1907 లో బళ్లారికి ప్లేగు మొట్టమొదట సంభవించెను.

వారిరువురును మేనత్తయును, దొరతనమువారు ఈ వ్యాధివిషయములో పెట్టుచున్న నిర్బంధములకు, నిలువజాలక అనంతపురంజిల్లా గుత్తితాలూకా విడుపనకల్లు అను గ్రామమునకు బంధువులు ఉండుట వలన అక్కడికి వచ్చి చేరిరి. అప్పటికే శ్రీ దాసుగారి తండ్రిగారు జబ్బుగా నుండిరి. దినదినము జబ్బు హెచ్చుకాజొచ్చెను. 1907 డిసెంబరు నెల 31 వ తేదీన వీరి తండ్రి చనిపోయెను. బళ్లారికి వీరు వచ్చి ఒంటరిగా వారి పూర్వస్నేహితులవలన కొంతకాలము గడపిరి. కాని వీరియునికివలన తోడిస్నేహితు లందరికిని విసుగు కలుగుటచే (ధనములేని వానిని ఎవరును చేరరు. ధన మున్నప్పుడే సర్వబంధువులు ఆశ్రయింతురు అని తెలిసి) వీరిమేనత్త బావకుమారుడు చెంగల్వరాయునివద్ద 3 మాసములుగడపెను. అక్కడనే యుద్యోగమునకుండ దలచెను గాని శ్రీ చెంగల్వరావునాయుడుగారు బంధువులను నౌకర్లుగా నుంచుకొనుట బాగులేదనిచెప్పినారు.

ఇక్కడ ఈ బ్రతుకు బ్రతుకుటకంటె మరెక్కడికైన దేశాంతరము వెళ్లిన బాగని తలచి బళ్లారి తాలూకాకు చేరిన రూపనగుడి గ్రామమునకు కాలినడకతో చేరిరి. అచ్చట నొక్క స్నేహితుడు దొరికి అన్నము పెట్టెను. అచ్చటినుండి వుండబాడ గ్రామమునకు సాయంత్రము వచ్చి చేరిరి. రాత్రి భోజనములేదు. ఒక దేవళమున పరుండి తెల్లవారి లేచి నడువ మొదలిడిరి. ఆకలిబాధ హెచ్చుగా నుండెను. దారిలో నిరుప్రక్కల చపాతి కళ్లిపండ్లు విరివిగా పండియుండుట జూచి కొన్ని తిని వండలో నీళ్లు త్రాగి రేణిమాకులపల్లెకు 10 గంటలకు చేరిరి. అన్నమునకుగాను చాల కష్టపడుచుండగా తుదకు ఒక రైతు చేరబిలిచి అన్నము పెట్టినాడు. అచ్చట కొంతసేపు విశ్రాంతి తీసికొని వురవకొండ గ్రామమునకు వచ్చిరి. ఒక లోకల్ ఫండు కంట్రాక్టరుతో కలిసి పనియేదైన నున్నదా అని అడుగగా పనియేమియు లేదని ప్రత్యుత్తర మిచ్చెను.

### ఉపాధ్యాయవృత్తి - రు 4-0-0 జీతము:—

వెంటనే ముష్టూరు అనుగ్రామముమీదుగా మోపిడి అను గ్రామమునకు వెళ్లిరి. ఆగ్రామాధికారి వీరిని జూచి మీ రెవరు? ఏల యిక్కడకు వచ్చితి. అని ప్రశ్నింపగా ఇక్కడ నెవరైన చదువుకొను వారుండిన నేను ఇంగ్లీషు. తెనుగు చెప్పగలను. అని బదులుచెప్పెను. గ్రామాధికారి కొమాగుల కిరువురకు విద్యగరపవలెను. భోజనము పెట్టి నెలకు 4/-రూపాయలు జీతము ఏర్పాటు చేయబడెను. 1909 మే మాసమునుండి 6 మాసములు అచ్చట గడపిరి. మోపిడిగ్రామమునకు 1½ మైళ్లీ సమీపమున కత్తె బూదెవాల్ (ఇందాప్రవతి) ఉపాధ్యాయుడు అపుడపుడు వచ్చి వీరిని పలుకరించి పోవుచుండిరి. ఇంద్రావతి రాయచూరు యిళుకన్న మరదలను శ్రీ కే. శే. దాసుగారికి ఇచ్చి వివాహము చేయునటుల నీ యుపాధ్యాయుడు మాట్లాడెను. వివాహము 1909 నవంబరు మాసమున జరుపబడెను.

### ఉపాధ్యాయవృత్తి: జీతము రు 10-0-0:—

పాలూరుగ్రామము కరిణము కొమారులకు చదువు చెప్పుటకుగాను నెలకు 10/లు వేతనముపైన పాలూరునకు భార్యాసమేతముగా వెళ్ళిరి. 1910 సం॥రము ఏప్రియల్ నెలలో 12 సంవత్సరముల వయస్సుగల విద్యార్థి బడికి రానందున మరుదినము ఆదేపిల్లవాడు వచ్చినపుడు నీవు బడికి వచ్చుటకు ఇష్టమున్నచో సక్రమముగా రావలెను. లేనియెడల నెక్కడనైన భావిలో పడి చచ్చుట మేలని దండించిరి. మరుదినము బాలు రందరు వచ్చిరి కాని, దండింపబడిన బాలుడు మాత్రము రాలేదు. బాలుడు నిజముగా ఉరివేసుకొని చనిపోయినాడు. దైవానుకూల్యమువలన ఆకేసు ఎవరిపైనను లేకుండునటుల కొట్టివేయబడెను.

### వ్యాక్సినేటరు ఉద్యోగము:—

ఆగ్రామ కరణముగారు వీరికి నెలసరి జీతము సక్రమముగా నిచ్చు చుండనందున నేదయిన ఇతర ఉద్యోగము చూడవలెనను కుతూహలము వారి కుండెను. అంతలో డెప్యూటీ యిన్స్పెక్టరు అఫ్ వ్యాక్సినేషన్ గారు అక్కడ అకస్మాత్తుగా కలిసికొని వీరికి ఎక్కువ పరిచితు లయిరి. వీరికి మునిసిపల్ వ్యాక్సినేటరుపని దొరకెను. జీతము రు 10/- మాత్రము. 1910 సం॥రము ఏప్రిల్ నెల 7 వ తేదీ మొదలు 1912 సంవత్సరము జనవరి నెలవరకు ఈ యుద్యోగమునందే యుండిరి. పిమ్మట లోకల్ ఫండు వ్యాక్సినేటరుగా నియమింపబడిరి. రిజర్వు వ్యాక్సినేటరుగా నుంచిరి. 5 రోజులు సెలవుతీసికొని కత్తెబూదెవాల్ (ఇంద్రావతి గ్రామమున ప్రైవేటుపాఠశాల విద్యార్థుల కొరకు) సంఘము నేర్పాటుచేసిరి. రిజర్వు వ్యాక్సినేటరుగా నున్నందున జిల్లాయందు ఎక్కడెక్కడ అవసరమో అక్కడికి పోవలసివచ్చెను. వీరి భార్య మేన తను వరియంపేట అను గ్రామమున (అనంతపురంవద్ద)నుంచిరి.

### సేద్యము నష్టము:—

ఆ గ్రామమున భూమి అ 100 లకు 11 యెకరములు కొనిరి. సేద్యముచేయవలెనను అభిలాష హెచ్చుగా నుండెను. సమీపముననున్న సర్కారుభూమిని సహ సాగుచేయుచుండిరి. ప్రథమసంవత్సరము వేరుసెనగ విత్తనము చల్లించిరి. జర్మనియుద్ధము 1914 జనవరి నెలలో ప్రారంభ మయినందున పండినపంటకు ధరలేక చాల నష్టము సంభవించెను.

ఉరవకొండ గ్రామమునకు సమీపమున ఇంద్రావతి గ్రామమునకు వచ్చి వెనుక తాము విద్యార్థులకుగాను స్థాపించిన సంఘమును గ్రామ ఐకమత్య సంఘ మను పేరుతో పునరుద్ధరణ గావించిరి.

### మరల ఉపాధ్యాయపదవి:—

సేద్యమువల్ల నేమియు లాభములేదని తలచి 1916 సం॥రము జనవరి నెల 6 వ తేదీన లోకల్ ఫండు ఉపాధ్యాయపదవి యొకటి గూడుగ్రామమున దొరకెను. 6 మాసములు అచ్చట పనిచేయుచుండగా అంతలో ఆ పదవికి ట్రెయినింగు అయిన ఉపాధ్యాయులు ఇతని స్థలమునకు వేయబడినందున వీరికి పనిలేకపోయెను. ఒకటి రెండు మాసములలో కూడేరు అను గ్రామమునకు ఉపాధ్యాయుడుగా పోవునటుల ఉత్తరువు రాబడెను.

### రామమోహన గ్రంథాలయ స్థాపనము:—

1919 వ సంవత్సరమున వురవకొండ గ్రామమున రామమోహన గ్రంథాలయము స్థాపింపబడినపుడే కే. శే. దాసుగారు సహ వురవకొండ గరల్సుస్కూలు మాష్టరుగా మార్చబడిరి. శ్రీ దాసుగారే గ్రంథాలయ కార్యదర్శిగా నుండునటుల చేయబడెను,

వీరు కార్యదర్శి పదవికి వచ్చినతరువాత ప్రతి నెలకు చందాలమూలముగా రు 0,80 రూపాయలు

పనూలు చేయుచు అనేక వందల గ్రంథములను గ్రంథాలయమునకు తెప్పించి సభ్యులు, ఇతరులు చదువునటుల చేసెను. దినపత్రికలు వారపత్రికలు సహా తెప్పింపబడుచుండెను.

## సేవాప్రవేశము.

మూడు స్థలములందు ప్రత్యేకముగ ఉపాధ్యాయులను వేతనములపైన నియమించి రాత్రి పాఠశాలలను జరుపుచుండెను. గ్రంథాలయమున ఉచితముగా నేత పరిశ్రమ గఱపునటుల ఏర్పాటుచేయబడెను. శ్రీ దాసుగారు స్వయముగా నేత నేర్చుకొని, విద్యార్థులకు నేర్పుచు, నాయకత్వమునందుగల గౌరవమును ప్రస్ఫుటించిరి. బాలభటోపాధ్యాయ శిక్షణ కోదూరు గ్రామమున-ఆంధ్రరాష్ట్రీయ బాలభట నాయకులగు అయ్యంకి వేంకటరమణయ్యగారిచే నిర్వహింపబడిన శిక్షా శిబిరమునందు, వీరును యం. వెంకటరమణప్పగారును పొంది గ్రంథాలయముతరపున శ్రీయుత పి. నారాయణశాస్త్రుల వారి అధ్యక్షతక్రింద బాలభటపటాలముల నేర్పాటు చేసి మిక్కిలి జయప్రదముగా నిర్వహించిరి. దాసుగారు ప్రధానోపాధ్యాయులుగా నుండి - రాత్రిపాఠశాలలందు చదువుచు పగలంతయు కూలివల్ల జీవనము చేయు సామాన్యవిద్యార్థులకు బాలభటశిక్షణ చక్కగా గఱపిరి. ఇవన్నియు చక్కగా జరుపబడుచున్న దినములలో ప్రభుత్వోద్యోగులలోకాని, ప్రజలలోకాని తప్పుచేసినవారు బాలభటులకు మిగుల భయపడుచుండిరి. బాలభటులు ఎక్కువగా చదువుకొన్నవారుగాకపోయినను తన అధికారి ఆజ్ఞలను చక్కగా నిర్వర్తించువారై యుండిరి.

## మండల గ్రంథాలయసభ

ప్రథమ అనంతపురమండల గ్రంథాలయ సభను 1920 నందు ఆహ్వానించి మిక్కిలి జయప్రదముగ నిర్వహించిరి. శ్రీ రామమోహన గ్రంథాలయము యొక్కయు, బాలభట పటాలముయొక్కయు, వార్షికోత్సవములనుగూడ జరపిరి.

## గ్రామస్థులందు జ్ఞానోదయము.

వీరిచే నిర్వహింపబడుచున్న వివిధ సంస్థలవలన ఉరవకొండ గ్రామమునందున్న అశేష జనమునందును జ్ఞానోదయము కలిగినదని చెప్పిన అతిశయోక్తి ఎంతమాత్రమును గాదు. వీరు గ్రామస్థు లందరియందును తలలోని నాల్కవలె మెలంగుచు అందరియొక్క మన్ననను పొందుచుండిరి.

## ఉద్యోగము పోయినను ధైర్యమును వీడలేదు.

ఇటుల పరోపకార పారీణులై పాటుబడుచున్న సమయమున గరల్ స్కూలు ఉపాధ్యాయ పదవినుండి తొలగింపబడిరి. అయినను ఎంతమాత్రము నధైర్యమును జెందక తాను స్వంతముగా మగ్గము పెట్టి నేతనేయుట మొదలిడి జీవనమును గడపసాగిరి. మరి రెండు మగ్గములుకూడ చేర్చి పనిని ఎక్కువగా సాగింప మొదలుపెట్టిరి.

ఇదంతయు నిటులుండ మహాత్ముని సత్యాగ్రహోద్యమము ప్రారంభమాయెను. కాంగ్రెసునందు శ్రీ దాసుగారుసహా సభ్యులుగాచేరి ప్రచారము మొదలుపెట్టిరి. వెంటనే గ్రంథాలయ యావదాస్తులను వురవకొండ కారనేషన్ రీడింగురూమున చేర్చబడెను. శ్రీ రామమోహన గ్రంథాలయము, కారనేషన్ రీడింగురూము అను పేరుతో నేర్పరుపబడెను. పిమ్మట కల్లు అంగళ్లయొద్ద పికెటింగు చేసి జెయిలునకుగూడ బోయిరి.

## నేతగాండ్ర సంఘము.

జైలు అనుభవము ముగిసినతర్వాత కాంగ్రెసు ప్రచారమునందే చాలకాలము గడపిరి. సత్యాగ్రహము లేనికాలమున వురవకొండ గ్రామము నేతపరిశ్రమకు పేరుగాంచినది గనుక, బీదసాదలు బ్రతుకుటకు అనువగునటుల నొక నేతగాండ్ర సహకారసంఘము నెలకొల్పిరి. 13 వేల మొత్తము షేర్లమూలముగా జమచేయబడి 25 వేల రూప్యములవరకు బ్యాంకునుండి తెప్పించి ముడిసరుకులను కొని-యిచ్చుట తయారైన చీరలను కొనుట వానిని అమ్మకముచేయుట ఏజంట్లను నియమించుట మొదలగు పనులు జరుపుచుండెను. ఒక వత్సరమున 1 లక్ష రూప్యములకు పైబడి బేరము జరుపబడెను. కాని యుత్పత్తి చేయు సరుకులు అమ్మకముఅగు మార్కెట్టులేకను, విదేశీ పోటీలవల్లను తయారైన జవళి ఖర్చుగాక నిలిచిపోయినందున స్వదేశీకి రక్షణ కలుగువరకు నీ యుద్యమమును సక్రమముగా జరుపుట కష్టమని-వ్యాపారపద్ధతిమానుకొని, అప్పు లిచ్చు పద్ధతిమాత్ర మిప్పుడు ఉంచబడినది. దాసుగారీ యుద్యమమం దెక్కువగా కృషిసల్పిరి.

### దుకాణము.

వీరు, జీవనోపాయమునకు వేరుతెరవు గానక ఒక దుకాణముపెట్టి జరుపుచుండిరి. ఇంతలో అనంతపురమండలమున ప్రభుత్వమువారివల్ల ఏర్పరుపబడిన మద్యపాననిషేధప్రచారమున చేరి ఒక సంవత్సరకాలము మించు పనిచేసిరి. వీరు పెన్నహోబిలమున రథోత్సవకాలమున అంగడివాండ్రు మొదలగువారికి సౌకర్యముగా స్థలములను విభజించుట మొదలగువాటియందు ధర్మకర్తలకెక్కువగా తోడ్పడిరి.

### మృతి.

వీరు అకస్మాత్తుగా జ్వరబాధవల్ల ౧౯౩౭ సంవత్సరము మే నెల 9 వ తేదీన స్వర్గస్థులైరి.

వీరు చిన్ననాటినుండియు స్వదేశదీక్షయందే యుండువారు. వీరలయెడ చాలదయగలవారు. చాల ధైర్యవంతులు, పట్టుదలగలవారు, చిన్ననాటినుండి వీరతనమును ఆనందముతో అనుభవించినవారు. వీరు కడవరకును పరోపకారమైన పనులు చేయుటయందే తన కాలమునంతయు గడపినవారు.

తాను బ్రతికియుండగనే తన బిడ్డలకు వివాహములు చేసెను. వారు వారివారి భర్తల జేరుకొనిరి. దాసుగారికి 5 యేండ్ల బాలుడు, భార్యయు నిరాధారులై నిలిచినారు.

ఉరవకొండ, అనంతపురంజిల్లా. } ఘట్టి వెంకటరమణప్ప.

# సంపాదకీయములు.

### గ్రంథాలయోద్యమ సేవకులు.

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు పట్టుకొమ్మలై, ఈ యుద్యమ విజయమునకుగాను పాటుబడిన గ్రంథాలయోద్యమ సేవకుల జీవితచరిత్రలను ప్రకటించవలెనని సంకల్పించినాము.

అట్టి సేవకులలో నొకరగు అనంతపురంజిల్లా ఉర్వకొండ గ్రామ గ్రంథాలయ సేవకులగు శ్రీ బెల్గాం రామదాసునాయుడుగారి జీవితచరిత్రను ఈ సంచికయందు ప్రకటించినాము. వీరిపటమును ముందు సంచికయందు ప్రకటింపగలము.

### సంచార గ్రంథాలయములు — కృష్ణాజిల్లాబోర్డు

కృష్ణాజిల్లాబోర్డు సభ్యులును, దక్షిణభారత గ్రంథాలయసంఘ ఉపాధ్యక్షులును, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ సహాయకార్యదర్శినియునగు శ్రీమతి తుర్లపాటి రాజరాజేశ్వరమ్మగారు జిల్లాబోర్డు సభయందు ఉపపాదించుటకై ఈక్రింది తీర్మానమును పంపిరి:—

"ఈజిల్లాలో రెండు కేంద్రస్థలములయందు మాదిరిగా పనిజేసి చూచుటకై సంచార గ్రంథాలయములను ప్రారంభించుటకు తగు ఏర్పాటులను చేయుటకుగాను రు 600 లను మంజూరుచేయుచు తీర్మానించడమైనది. అవి గుడివాడ తాలూకాలో అంగలూరునం దున్నట్టియు, నందిగామతాలూకాలో కోణకంచియం దున్నట్టియు గ్రంథాలయములతో సహకారముగ ఆతాలూకాలలో పనిజేయవలయును."

కృష్ణాజిల్లాబోర్డునకు అధ్యక్షులగు శ్రీరాజా యార్లగడ్డ శివరామప్రసాద బహద్దరుగారు- క్రిందటి సంవత్సరమున బెజవాడలో జరిగిన అఖిలభారత గ్రంథాలయ మహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షులును, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు ఉపాధ్యక్షులును అయియున్నారు. గ్రంథాలయోద్యమము యెడల గాఢమైన అభిమానము గలవారు. వీరి పరిపాలనయందు ఈతీర్మానము అమలులోనికి వచ్చుటయేగాక జిల్లాయందంతటను గ్రంథాలయోద్యమమునకు మంచి సహాయము లభింపగలదు.

# 9 వ అఖిలభారత గ్రంథాలయ మహాసభ ప్రదర్శనము




## 17 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ.

మదాసునందు 1934 డిశంబరు 24,25,27 తేదీల యందు జరుగును.

వంగరాష్ట్రీయ గ్రంథాలయ సంఘాధ్యక్షులగు కుమార మునీంద్రదేవుమహాశయ యం. ఎల్. సి. గారు అఖిలభారతసభకు అధ్యక్షత వహించెదరు.

దాసు త్రివిక్రమ రావు, బార్-ఎట్-లా గారు ఆంధ్రసభకు అధ్యక్షత వహించెదరు.

డిశంబరునెలలో మదాసు పోయివచ్చుటకును ఇంకను ఎక్కువదూరము పోవుటకును కలిసి రైల్వేటికెట్టు రు 11 లు ఏర్పాటుచేసినారు. కావున ఈ అవకాశమునుదీసికొని ఎక్కువమంది ఈ సభలకు తప్పక విచ్చేయ ప్రార్థన.

మరియు మదాసు సభలైన పిమ్మట ఆంధ్రదేశ గ్రంథాలయ యాత్రను సాగింపవలెనని యున్నది. అనగా డిశంబరునెల 30 వ తేదీన మదాసునందు బయలుదేరి ముఖ్యస్థలములను జూచుకొనుచు సభలనుజేయుచు జనవరి 14 వ తేదీకి విశాఖపట్నమువరకు పోయివచ్చుట. మదాసు పోయివచ్చుటకు విశాఖపట్నము పోయివచ్చుటకు ఈ యాత్రికంతకును పదిరూపాయలు రైల్వే టిక్కెట్టుచాలును.

ఈ యాత్రయందు రాదలచినవారందరు నాకు వెంటనే వ్రాయించ గోరెదను.

మదాసునందు జరుగుప్రదర్శనమునకు ఆంధ్రదేశమునందున్న గ్రంథాలయములవారందరు తమ గ్రంథాలయ భవనములయొక్క పటములను తప్పక పంపవలెను. మదాసుసభల ఉత్తరములన్నియు కస్తూరి లక్ష్మీనరసింహారావుపంతులుగారు, దేవీవిలాసము, 33 కచ్చేరీరోడ్డు-మైలాపూరు, మదాసు అను చిరునామాకు వ్రాయగోరెదను.

ఆంధ్రదేశమునుండి ఎక్కువమంది ప్రతినిధులు విచ్చేసి, సభలను జయప్రదము చేయుదురని ప్రార్థన. చిత్తగించవలెను.

ఇట్లు,

అయ్యంకి వేంకట రమణయ్య,
కార్యదర్శి.

బెజవాడ,
4—12—34

A. G. Press, Bezwada.

గ్రంథాలయ సేవకులు



మద్దుల వెంకటచిన్నరాజుశ్రేష్ఠిగారు,

ఏలూరు.



పరబ్రహ్మాత్మికాం దేవీం ♦ భుక్తిముక్తి ఫలప్రదామ్
ప్రణమ్య స్తౌమి తామేవ ♦ జ్ఞానశక్తిం సరస్వతీమ్.

౯ - వ సంపుటము.

# గ్రంథాలయసర్వస్వము.

3 - వ సంచిక.

డిసెంబరు 1934

## ఓరుగంటి దృశ్యములు. *

[ శేషాద్రి రమణ కవులు ]

ఇది యాంధ్రనగర మిదియే, గద యాంధ్రనృపాలశాతకరవాలరుచుల్
మొదలంట వెలిఁగి యారిన, సదనము కీర్త్యంగనాశ్మశానంబు సఖా! 1

శ్రీకాకతీయభూపుల, ప్రకటనకీర్తిచిహ్నబంధురమగు నీ
యేకశిలానగరము నీ, రాకకు ముదమందెఁ జూడ రమ్యాంధ్రసుతా! 2

ఇది ప్రోలభూపతికదనంబునందు జ,గద్దేవు నోర్చి మేల్గన్న నెలవు
ఇది రుద్రభూపునాఁ డేన్గుగున్నలకు సాఁ,ధన మావటీండ్రు నేర్పిన పొలంబు
ఇది మహారాష్ట్రులతుదిఁ జూచి రుద్రాంబ, అని ముగించిన విజయాంకభూమి
ఇది గణపతినృపుం డెదురేగి తిక్కన,కవి కాళ్లు గడిగిన సవనభూమి
ఇద్ది నవలక్షధానుష్క లేక హేల , సంగరంబునఁ దొలుదొల్త చాఁపకూడు
కుడిచినతలంబు మది నెంచుకొన్నమాత్ర , నొడలు పులకించు నిచటి గాథోత్కరంబు. !

* హనుమకొండ రాజరాజనరేంద్ర ఆంధ్రభాషానిలయ రజతోత్సవ సందర్భమున పాడబడినవి.

# గ్రంథాలయ సర్వస్వము.

ఎన్నఁడో కాంచవచ్చు ననియెంచెదొ ఆంధ్రమహత్త్వ; మంతలో
నెన్ని మనోజ్ఞశిల్పముల కేగతిపట్టునొ; కాలగర్భమం
దెన్ని యడంగునో; యడఁగవే యనుకొందము, నీదుజీవితం
బన్నను నిక్కమా! యిపుడ యారయు మోర్గలుప్రాక్తనోన్నతిన్. 4

చెదరి వీథులఁ బడ్డ సింహవిగ్రహములు, గజరాజముల మేనఁ గలుపుకొమ్మ
బల్లెంబుగాని గ్రొచ్చవచ్చు రాహుతుమేను, శిథిలాశ్వతనువులోఁ జేర్చుకొమ్మ
కూలిపోయిన శిలాకుంభంబులు మహోన్న, తద్వారశిరములఁ దార్చుకొమ్మ
విరిగిన రమణీయవిగ్రహావళి దేవ,నిలయకుడ్యములపై నిలుపుకొమ్మ
అవల కనుదోయి మూసి మహాంధ్రరాజ్య, దివ్యతరరూపరేఖ చింతించుకొమ్మ
ఆంధ్రసోదర! పూర్వ మహాంధ్రనగర, గురుతరమహస్సు నీలోన గోచరించు. 5

తొల్లిఁటియాంధ్రశూరులు కుతూహలులై యనిలోన వ్రాలి యీ
పల్లెకుఁ బేరుతెచ్చి రది ప్రాక్చరితంబుల గోచరించు నిం
దెల్లెడ నాంధ్రజాతి గడియించిన విక్రమజీవితంబులన్
దెల్ల మొనర్చు శిల్పసముదీర్ణశిలాశకలంబులో సఖా! 6

వెన్నెలలోని ప్రసన్నభావంబు గడించి రాళ్లను రంగరించిరేమొ
జీవశూన్యములైన శిల్పముల్ పనివినఁ, జిక్కని యమృతంబుఁ జిలికిరేమొ
పగతురనెత్తురు పయిఁ జిల్కి క్రొంగ్రొత్త,రీతుల జిగి కుమ్మరించిరేమొ
జిలుగుబెండ్లుగఁ జేసి శైలము లెల్లఁ, గోటగా నందందుఁ గూర్చిరేమొ
మానవత్వంబుతోడ సమర్థభావ, మప్పు డాంధ్రులమదిని నిండారెనేమొ
తెలియఁబడ దాంధ్రనగరవీథులఁ జరించి, గండశిలలందు శిల్పంబు గాంచువేళ.

ఉదయభానుండు కాంత్యుల్లసత్కిరణసం,తతులచే రక్తచందనము బూయు
సంపూర్ణచంద్రుండు శారదచంద్రికా,కలితసుధాభిషేకం బొనర్చు
లలితహరిత్తృణాకలిత భూభాగంబు, పచ్చలతోడ నివాళి యొసఁగు
రమణీయపద్మరాగపూరితసరో,వీచికల్ వీవనల్ విసరుచుండు
ప్రకృతిదేవత బహువిధప్రసవవిసర,గుచ్ఛము లొసంగు నీజాతికోట కెపుడు
శిథిల మయ్యును బూర్వసుశ్రీలఁ బడయు, నీ శిలలప్రాభవము గాంచుమీ మనస్వి! 8



# గ్రామగ్రంథాలయోద్యమ చరిత్ర.

(ఆంధ్ర విశ్వ విద్యాలయ గ్రంథభాండాగారి ఎం. ఒ. థామసుగారిచే వ్రాయబడి జటావల్లభుని పురుషోత్తంగారిచే ఆంధ్రీకరింపబడినది.)

## భారతదేశ స్థితి

హిందూదేశములో గ్రామములే లేవనియు, 2,500 పట్టణములును ముప్పదిమూడు కోట్ల ప్రజలును మాత్రమే కలరనియు మన జాతీయసేవకులు భావించుచో వారి సమస్యలన్నియు త్వరలో పరిష్కరింపబడగలవు. కాని, క్రొత్త జనాభాలెక్కల ప్రకారము హిందూదేశములో 7 లక్షల గ్రామములును, 31 కోట్ల గ్రామవాసులును గలరనియు, నా గ్రామములన్నియు కశ్మలములుగనే యున్నవనియు వినినపుడు ప్రతివానికిని నీ సమస్యలలోని క్లిష్టత గోచరించును. ఈ విషయములో మనదేశము పాశ్చాత్యదేశములకు విరుద్ధముగ నున్నది. గ్రేటుబ్రిటనులో గ్రామవాసులు మొత్తముజనాభాలో నూటికి 29 వంతు గలరు. అమెరికా సంయుక్తరాష్ట్రములలో 49 వంతులును, జర్మనీలో 55.4 వంతులును, ఫ్రాన్సులో 58·8 వంతులును, ఇండియాలో 89.1 వంతులును గలరు. ఈ యంకెలను బట్టిచూడ హిందూదేశములో ప్రతిసమస్యలోనుగూడ గ్రామముల ప్రాముఖ్యము స్పష్టముగా గలదు. గ్రామసమస్యయే మన ప్రధాన సమస్య యని చెప్పవచ్చును.

పేదఱికము, క్షుద్బాధ, త్రాగుబోతుతనము, ఋణము, విద్యలేమి, అజ్ఞానము, భయము, మూఢవిశ్వాసము, మాలిన్యము, రోగము, చావు—ఇవియే మన గ్రామసమస్యలని యందరు నెఱుగుదురు. అయినను ఇవి మనకు చిరపరిచితములును సుపరిచితములును నగుటచే మన హృదయములు వానిపట్ల మొద్దువారిపోయినవి. వాని తీక్ష్ణతను గ్రహించుశక్తికూడ మనకు నశించినది. పాశ్చాత్యదేశములలో బిచ్చగాండ్రు అరుదుగా గాన్పించెదరు. కాన, వారిపట్ల మనకు సానుభూతి జనించును. హిందూదేశమునందన్నో బిచ్చగాండ్రు కుప్పతిప్పలుగ నుండుటచేతను, మనకు వారు నిరంతరము దృగ్గోచరులగుచుండుటచేతను, వారిని చూచినచో మనకు హృదయము కరుగదు. యూరపు అమెరికా దేశములలో కుష్ఠరోగి కాన్పించిన మేను కంపించును. మనదేశములో గూడ నట్లు జరుగుచో ప్రతినిమేషమునను మేను కంపింప వలసినదే. దినమునకు లెక్కలేనంతమంది కుష్ఠరోగులు మనకు కాన్పించుచుందురు. పేదఱికము, మాలిన్యము, రోగము మనలో నెంతయెక్కువగ వ్యాపించియున్నవనగా- అవి మన మనస్సును కలతపెట్టుటకూడ లేదు. అదృష్టవశమున నీ విషయమై బాధపడువారు కొలదిమందియైన నున్నారు. గ్రామములలోను, పట్టణములలోను, పెద్దనగరములలోనుగూడ నీ విషయములలో నభివృద్ధి యవసరమని కొందఱు కోరుచున్నారు.

కొన్ని సంవత్సరములనుండి మనలో ననేక విజ్ఞానపరులు గ్రామోద్ధరణమని ఆందోళన చేయుచున్నారు. రాజకీయార్థిక సాంఘిక విష

యములలోను ప్రజల విద్యాసౌఖ్యాది విషయములలోను, పాటుపడువా రందఱును గూడ నీగోలను పెట్టుచునేయున్నారు.

గ్రామజీవనము సమూలముగ సంస్కరింపబడిననేకాని భారతదేశమునకు మోక్షము లేదని వారియభిప్రాయము. గ్రామోద్ధరణమునకు సాధనముల నరయుటకే చాలమంది యత్నించుచున్నారు. అనేకస్వార్థరహితయువకులు తమ జీవితమునంతను దీనికై వినియోగించుచున్నారు. కాని, దీనివలన నేమియు దేశమునకు మేలు కలిగినట్లు కాన్పింపదు. జరిగిన ప్రయత్నములు కొలదిగ నుండుటచేతనో, ప్రయోగింపబడిన చికిత్సావిధానము చాలకుండుటచేతనో ఇట్లు జరిగియుండవలెను. ఈ రెండు కారణములుగూడ నుండవచ్చును. ఈ కార్యము దేశము మొత్తము పైననే జరుగవలెను. ప్రయోగింపబడిన చికిత్స రోగముయొక్క మూలమును పెరకివైచునదిగనే యుండవలెను. గ్రామవాసి జాతికి వెన్నెముకవంటి వాడని గ్రామములలో రాజకీయవేత్తలు చేసిన బోధకు తాత్కాలిక ఫలితముమాత్రమే కలిగెను. గ్రామవాసి యొక్కడును కూర్చుండి జాతీయతానిర్మాణమునకు నేనేవిధముగ తోడ్పడగలనా యని యాలోచించుకొనుచో, నాతని కేమియు బోధ గట్టదు. తన గుడిసెకును, గ్రామమునకును, బయట తాను చేయగల పని యున్నదని, యాతని కెన్నడును తట్టదు. సంఘసంస్కర్తయు, ప్రజలయోగక్షేమములకు పాటుపడువాడునుగూడ త్రాగుడును, ఋణమును మానుకొనవలెనని యాతనికి బోధింతురు. ఆరోగ్యము, పరిశుభ్రత, మున్నగువాని నలవరచుకొనవలెననియు-భయము మూఢవిశ్వాసము, ననువానిని పోద్రోలవలెననియు-జీవితమును, బుద్ధిని, బాగుచేసికొనవలెననియు, నాతనికి బోధచేయుదురు. ఏలనో కాని, యాతడుమాత్రము తన పూర్వపద్ధతిని వీడడు. పరిశుభ్రత యనునది తనకు గాదనియు, త్రాగుడును వీడుటకు తన కాత్మశక్తి లేదనియు, అప్పులు చేయకుండ తా నుండలేననియు భయము, మూఢవిశ్వాసము లనువానిని తాను వీడలేననియు నాతనిభావము. పైన బేర్కొనబడిన సంస్కర్త ఆర్థికవిషయములో, పొదుపు నలవరుచుకొని తిండిలేక మాడ నవసరము లేకుండ, చూచుకొనవలెనని బోధించును. ద్రవ్యోత్పత్తికి మార్గములను చూచును. కాని యా పాఠము లాతనిబుఱ్ఱ కెక్కవు. విద్యావ్యాపకనిరతు లాతనికిని, నాతనిబిడ్డలకును పాఠశాలలను స్థాపింతురు. కాని జీవయాత్రను నడపుట కక్షరజ్ఞాన మవసరమని యాతడు భావింపడు. మొత్తముపైన ప్రతిభారతీయగ్రామవాసియు నీ యభిప్రాయములతోనే యున్నాడు. ఆతడు తన జీవితముతో సంతుష్టుడై యున్నాడు. ఆతనిక్షేమమునకై యితరులు పడుబాధ లేమియు నాత డెరుగడు. శుద్ధవిద్యావిహీనతయు, అజ్ఞానమును, మన గ్రామవాసుల కష్టములకు కారణములు. ఇవి తొలగనంతవఱకు నార్థికము, ఆరోగ్యము, మున్నగు విషయములలో వారు బాగుపడనేరరు. సంస్కరణాభిలాష వారిలోనే పుట్టవలెను. కాని పశుజీవనములోనే వారు తృప్తి నందుచున్నారు. ఏలనగా, ఇంతకంటె నుత్కృష్టమగు జీవనము సాధ్యము కాదనియు, నవసరము కాదనియు నాతడు తలచును. అనగా మానవ వికాసమునకు నెన్ని యవకాశములును, ఎన్ని శక్తులును నున్నవో యాత

జరుగదు. అజ్ఞాన మాతనిని గ్రుడ్డివానినిగ చేసినది. ఆతనిజీవనము పశుజీవనముకంటె హీనము. కావున నాతడు తన్ను తాను పూర్తిగ పరీక్షించుకొనుటకును, తెలిసికొనుటకును, అవసరమగు విజ్ఞాన మిప్పు డాతనికి కావలసియున్నది. విద్యద్వారా విజ్ఞానమును వ్యాపించుట యన్నిటికంటెను ప్రధానతమమైన విషయము. దాని ననుసరించియే గ్రామాభివృద్ధి జరుగును.

ఈ నడుమ గ్రామములలోని విద్యను గురించి చాల శ్రద్ధ బయలుదేరుచున్నది. ప్రభుత్వమును, ఉదారులగు అనేక సంఘములవారును గూడ నీవిషయమున విశేష కృషి చేయుచున్నారు. ఇంతవరకును జరిగిన పని బాగుగనే యున్నది.

కాని రెండుప్రశ్నలు బయలుదేరుచున్నవి. ఎన్నిగ్రామములలో విద్య వ్యాపించినది? వ్యాపించినవిద్య ఎంతవరకు సరిపోవుచున్నది?

దేశము మొత్తముపైననే చదువుకొనినవారి సంఖ్య తక్కువ. భారతవర్షమునగల మొత్తము **352,837,778** మంది జనులలో **23,485,227** మంది జనులుమాత్రమే అక్షరాస్యులు. ఇందులో సంతకము మాత్రము వ్రాయగలిగిన విద్యావంతులుకూడ చేరియున్నారు. వీరు గ్రామములలో బొత్తిగ తక్కువగ నున్నారు. ఇప్పటికి గ్రామములయందు విద్యావ్యాపనము ప్రారంభింపబడినది. చేయవలసినపని యెంతయేని గలదు. గ్రామములలో విద్య లేకుండ గ్రామాభివృద్ధి జరుగుట యసంభవము.

## విద్య ఎంతవరకు సరిపోవును?

ఇక నీప్రస్తుతవిద్య ఎంతవరకు సరిపోవుచున్నదో చూతము. గ్రామములలో నెంతవరకు విద్య యుండవలెనని యధికారులు భావించుచున్నారో చూతము. మూడు నాల్గు సంవత్సరము లభ్యసింపదగిన ప్రారంభవిద్య మాత్రమే గ్రామబాలున కవసరమని భావింపబడుచున్నది. అంతవరకు మాత్రమే యీయబడుచున్నది. మన గ్రామపరిస్థితుల నాలోచించుచో నామాత్రపువిద్య దొరకిన కుఱ్ఱవాడుకూడ నదృష్టవంతుడనియే చెప్పవచ్చును. కాని, వాని కాచదువువలన నేమి లాభము వచ్చినది? వ్రాత, చదువు, లెక్కలు కొంచెము తెలియుట నిజమే, అంతకంటె నెక్కువ రాదు. కాని, దానితో వాని కేమి ప్రయోజనము? దానిని వృద్ధిపొందించుకొనవలెను. లేనియెడల అభ్యాసము పోవుటచేత కాలక్రమమున నా స్వల్పజ్ఞానము కూడ నశించును. ఇట్లు నశించుటయే ప్రస్తుతము విశేషముగ జరుగుచున్నదని. ప్రారంభవిద్యకు పైబడి గ్రామబాలురు చదువుకొను విషయమునకు ప్రసక్తియే వచ్చుటలేదు. మనగ్రామములలో నున్నతవిద్య నభ్యసించినను దానిలాభమును గ్రామవాసులు పొందరు. మూడు నాల్గు సంవత్సరములు పిల్లలను బడులకు పంపుటకే పెద్దవారు సణుగుకొనుచున్నారు. ఉన్నతవిద్య నుచితముగ బోధించినను కూడ వారు పిల్లలను పంపరు. ఎదిగిన ప్రతికుఱ్ఱవాడును పొలముపై పనిచేసి కుటుంబమునకు పోషకుడగుచున్నాడు. దీని నంతను జూడ నీప్రశ్న యుదయించుచున్నది: "వ్రాత, చదువు లెక్క నేర్చినబిడ్డడు విద్యాభివృద్ధిని పొందించుకొనక క్రమముగా నభ్యసించిన

కొద్దివిద్యనుగూడ మరచిపోవలసినదేనా ?" వానికి విద్యను వృద్ధిపొందించుకొనుటకు వీలులేకున్నంతమాత్రమున మానసికాధ్యాత్మికాభివృద్ధికూడ కలుగుట కవకాశములు లేకపోవలసినదేనా? గ్రామబాలుడు పగలంతయు పొలముపై పనిచేయుటకై విజ్ఞానమును పొందు హక్కును పూర్తిగ వదలుకొనవలసినదేనా! మనదురదృష్టమువలన ప్రస్తుత మట్లే జరుగుచున్నది. ఇపుడు గ్రామములలో విద్య యనగా ప్రారంభవిద్యయే. ఇది యెందుకైనను ఉపకరించుచున్నదా లేదా యను ప్రశ్న యెవరిని బాధించుటలేదు. నిర్బంధ ప్రాగంభవిద్య కావలెనని యందరును గోలపెట్టుచున్నారు. అందరకు నక్షరజ్ఞానము కలుగుటకై ప్రశంసనీయములగు ప్రయత్నములు జరుగుచున్నవి.

ఒకటి రెండు శతాబ్దములలో నివి చాలవఱకు ఫలించుననియు, ప్రారంభవిద్య గ్రామములలో నెక్కువగ వ్యాపించుననియు మన మాసింపవచ్చును. కాని ప్రారంభపాఠశాల వీడినపిమ్మట బాలుడు స్వయంకృషిచే విద్యను వృద్ధిపొందించుట కవకాశములు లేనిచో, ప్రారంభవిద్యవలన నేమియు లాభముండదు. అట్లభివృద్ధికే వీలులేని పిల్లలు కొంతకాలమున కక్షరములనుగూడ మరతురు. ఉపయోగింప బడనిచో నేదైనను నశించును. అక్షరజ్ఞానముకూడ నట్టిదే. చదువు, వ్రాత, లెక్కలు నేర్చినంతమాత్రమున నెవడును విద్యావంతు డనిపించుకొనడు. అక్షరజ్ఞానము విద్యకును, విజ్ఞానమునకును, పాండిత్యమునకును, దారిని జూపగలదు. ఆ గమ్యస్థానములను పొందనిచో చేసినకృషి వ్యర్థమే. నిజమగు విద్య విజ్ఞానము నిచ్చును. ఆ విజ్ఞాన మందరకును నందుబాటులో నుండునట్లు విద్యావిధానము నేర్పరచుకొనిన దేశము నాగరకదేశము. విజ్ఞానము కలిగిననే గాని గ్రామవాసి పరిశుద్ధమగు జీవనము నలవరచుకొనలేడు. పౌరవిధులను నిర్వర్తింపలేడు. మనగ్రామస్థు డీ విజ్ఞానము నెచట పొందగలడు? తన బుద్ధివికాసమున కవకాశము లెచట నుండును? ప్రస్తుత మట్టి యవకాశము లెచటను గాన్పింపవు.

ఆధునికకాలమున నాగరకదేశములన్నిటిలోను ప్రతి కుగ్రామమునగూడ జ్ఞానమును వ్యాపింపజేయు సాధనములు-అనగా అన్ని ముఖ్యవిషయములపైనను గ్రంథములు-సేకరింపబడి అందరకును అందుబాటులో నుంపబడినవి. కాని మనదేశములో మాత్రము మానసికాభివృద్ధి కవసరమగు ప్రారంభసాధనములుగూడ గాన్పింపవు. ఇతరదేశములలో ఏవిషయముపైనైనను, నేగ్రంథమైననుగూడ నతిసులభముగ పొందుటకు వీలగు గ్రంథాలయము లున్నవి. గ్రంథాలయోద్యమ మతిత్వరితముగ నా దేశములలో వ్యాపించుటచే నిట్టి ఫలితము కల్గినది. ఈ దేశములోగూడ గ్రంథాలయోద్యమము కలదు. కాని, ఇట్టిఫలితము నెంతమాత్రమును పొందలేకున్నది. ప్రభుత్వముగాని ప్రజగాని దానికి సహాయము చేయుటలేదు. పెద్దపెద్ద పట్టణములలోనే గ్రంథాలయసౌకర్యములు లేని యీ దేశములో పల్లెటూళ్ళమాట చెప్పుట కేమున్నది? పట్టణములలో గ్రంథాలయములుగాక, యితరములగు సంస్థలద్వారాకూడ విజ్ఞానవ్యాపనము జరుగును. పల్లెటూళ్ళయందన్ననో గ్రంథాలయముతప్ప మరేవిధమగు సాధనమును నుండుటకే వీలులేదు.

కావుననే ప్రతినాగరకదేశములోను గ్రంథాలయమునకు ప్రాముఖ్య మీయబడుచున్నది.

## ఆధునిక దృక్పథము

ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయమున నాచార్యుడుగనున్న డబ్ల్యు జి. యస్. ఏడమ్స్ గారు గ్రామగ్రంథాలయములపట్ల నాధునిక దృక్పథమును బాగుగ వర్ణించియున్నారు. ఆతడు బ్రిటన్‌లో గ్రామగ్రంథాలయముల నభివృద్ధి పొందించినవారిలో నొక ప్రముఖుడు. ఆతడీవిధముగ జెప్పెను:—

"నేడు గ్రామసాంఘిక జీవనము నడుమ గ్రంథాలయ మున్నది. సమస్తవిధములను గూడ నది ప్రజలకే సేవజేయుచున్నది. అన్ని తెగలవారును, పక్షముల వారును గూడ ఏకప్రయోజన నిర్వహణమునకై యొక చోట సమావేశమగుట కది సాధనమగుచున్నది. దాని ననుభవించువారి కందరకుగూడ నది జీవితములో ప్రచ్ఛన్నమైయున్న నిధిని బయటకు గన్పరచుచున్నది. ఆలోచనలను ఆవేశములను పురిగొల్పుచున్నది. గృహజీవనమును సుఖప్రదముగ జేయుచున్నది. కర్షకులను పొలములలో నెక్కుడు మంచిపనికై పురిగొల్పును.

ఆధునిక భౌతిక శాస్త్రములు ప్రతిదినమును ప్రకృతి మన కోర్కెలను దీర్చునట్లు చేయుచున్నది. గ్రామస్థుడు ప్రకృతియే శరణమని నమ్ముచున్నాడు. గ్రంథాలయము కర్షకునికిని, ప్రకృతి శాస్త్రజ్ఞునికిని, కళా చరిత్ర వాఙ్మయశాస్త్రాభిలాషులకును గ్రామ సాంఘికార్థిక సంస్కరణనిపుణులకును వారికిని వీరికిని ననేల? యందరకునుగూడ సహాయము చేయుచున్నది. స్వజీవనమును సుఖవంతముగ జేసికొనుటయేగాక, పరులకు సహాయము చేయుటకుగూడ గ్రంథాలయ మెంతవర కుపయోగించునో కనుగొందమని యాశ్చర్యము గలుగక మానదు. అది వ్యక్తులలో నూతన జీవమును గల్గించును. సాంఘిక దృక్పథమును వృద్ధిపొందించి సంఘమును బాగుచేయును."

ఇది శుష్కప్రసంగము కాదు. పాశ్చాత్య దేశములలో ప్రత్యక్షముగ జరుగుచున్న సంగతియే. గ్రామగ్రంథాలయోద్యమము పాశ్చాత్యదేశములన్నిటిలో గూడ-అందులో ముఖ్యముగ బ్రిటన్‌లోను, అమెరికాసంయుక్త రాష్ట్రములలోను, క్రమక్రమముగ ప్రజల దృష్టి నాకర్షించి ప్రాముఖ్యము నొందుచున్నది. అమెరికాసంయుక్తరాష్ట్రములలో నడచుచున్న యుద్యమమునుగురించి యొక ప్రసిద్ధుడగు అమెరికన్ గ్రంథాలయ నిర్వాహకు డిట్లు చెప్పుచున్నాడు:—

"ఈనడుమ గ్రామాభివృద్ధికై చేయబడి ఫలించిన ప్రయత్నము లన్నిటిలోను ముఖ్యమైన వానిలో మండల గ్రంథాలయోద్యమ మొకటి."

## వివిధ ఆంగ్లేయ దేశములోని యుద్యమములు.

గతయిరువదిసంవత్సరములలోను ఇంగ్లండులోను, అమెరికాలోను జరిగిన గ్రంథాలయోద్యమములో గ్రామగ్రంథాలయస్థాపనమే ముఖ్యమయినది. గ్రేట్ బ్రిటనులో గ్రామగ్రంథాలయ ప్రచారము చురుకుగా జరుగుటకు ప్రధాన మూలకారణము కార్నెజీ యునైటెడ్ కింగ్‌డమ్ ట్రస్టువారి దానమే. ఆపిమ్మట ప్రొఫెసర్ ఏడమ్‌గారి గ్రామగ్రంథాలయములపైని నివేదిక బయలుదేరినది. 1919 సం॥ రం నాటి గ్రంథాలయ శాసనము మండల శాసనసభలు ఈ శాసనమును అమలులో పెట్టుటకుగల కొన్ని అభ్యంతరములను తొలగించినది. తత్ఫలితముగ నేడు ప్రతిమండలసభయు నీశాసనము నమలులో పెట్టి ప్రతి దూరగ్రామమునకును గూడ గ్రంథాలయోద్యమమువలని లాభములను కలిగించినది, మండలసంఘములు అమ

లులో పెట్టు గ్రామగ్రంథాలయ విధానములు నేడు దేశమునం దంతటను గన్పట్టుచున్నవని యొక రచయిత చెప్పియున్నాడు. గ్రంథాలయ మందుబాటులో లేని గ్రామవాసి యొకడును లేడు.

అమెరికాసంయుక్తరాష్ట్రములు బహు విశాలములై యుండుటచేతను ప్రజలు వెద చల్లబడియుండుట చేతను ప్రతివారికిని గ్రంథాలయము లందుబాటులో లేవు. ఐనను, గ్రామగ్రంథాలయములు బాగుగనే పని చేయుచున్నవి. క్రమముగ నభివృద్ధి నొందుచున్నవి. కొన్ని రాష్ట్రములలో ప్రభుత్వమువారే గ్రామగ్రంథాలయములను నడపుచున్నారు. అవి అన్నియు బాగుగా పనిచేయుచున్నవి. ప్రజలు విరళముగ నున్న చోట్ల సంచారగ్రంథాలయము లేర్పాటు చేయబడియున్నవి. అవి యప్పు డప్పుడు నియతముగ గ్రంథముల నిచ్చిపోవుచుండును.

ఆంగ్లేతరములగు భాషలను మాట్లాడు నితర యూరోపియను దేశములవారు బ్రిటను అమెరికాలకంటె నీ విషయమున విశేషముగ వెనుకబడిలేరు. అందు ప్రతిదేశమునకుగూడ గ్రామగ్రంథాలయ విధానము లున్నవి. కొన్ని ప్రభుత్వములు స్వయముగనే వానిని నడపుచున్నవి. మరికొన్ని వానికి సహాయము చేయుచున్నవి. డెన్మార్కులో పట్టణములలో ప్రభుత్వగ్రంథాలయము లున్నవి. అవి గ్రామగ్రంథాలయములకును గ్రామవాసులకును గ్రంథముల నెరువిచ్చును. ఇంచుమించుగ ప్రతి పట్టణ గ్రంథాలయమును గూడ గ్రామగ్రంథాలయముల కిట్టి సహాయము చేయుచున్నవి. పోస్టు, మోటారు, మున్నగు వానిద్వారా నీ గ్రంథములు పంపబడును. డెన్మార్కులో ప్రతి దూరగ్రామవాసియు గూడ తనకు కావలసిన గ్రంథమును తనదగ్గరనున్న గ్రామగ్రంథాలయము నుండికాని గ్రామగ్రంథాలయముద్వారా పట్టణ గ్రంథాలయము నుండికాని పొందగలుగును.

స్విట్జర్లెండు ప్రభుత్వమువారు సాలుకు 60 వేల ఫ్రాంకులు గ్రామగ్రంథాలయములకొరకు ఇత్తురు; మిగిలిన సొమ్ము ప్రజాసంఘములనుండి వచ్చును; గ్రామగ్రంథాలయముల కగు ఖర్చు ఒకలక్ష ఏబదివేల ఫ్రాంకులు. ఈ యుద్యమమునకు ముఖ్యస్థానము బెర్నినగరము. దీనికి 6 మండలకేంద్రము లున్నవి. 1000 కి పైగా స్థానికకేంద్రము లున్నవి. జర్మనీలో గ్రామగ్రంథాలయ సేవ మాత్రమే కాక పట్టణ గ్రంథాలయములను వృద్ధి పొందించి వానిని గ్రామముల కుపయుక్తములగునట్లు చేయుటకుకూడ ప్రయత్నములు జరుగుచున్నవి. అనేకములగు పట్టణ గ్రంథాలయములు చుట్టుప్రక్కలనుండుజిల్లాలకు కేంద్రగ్రంథాలయములుగ పనిచేయ బూనుకొన్నవి. ఫ్రాంనులో ప్రభుత్వ పురపాలకసంఘ గ్రంథాలయములు గ్రామవాసులకు గూడ నుపయుక్తములుగ జేయబడినవి.

ఇటలీలో ప్రతి గ్రామములోను ఒక గ్రంథాలయ మున్నది. దానికి స్థానిక పాఠశాలోపాధ్యాయుడు నిర్వాహకుడుగ నుండును. బెల్జియములో సంచారగ్రంథాలయములును, సాంఘిక గ్రంథాలయములును, కొంతవరకు ప్రజలచే నిర్వహింపబడుచున్న గ్రంథాలయములును గూడ గ్రామములకు సేవ చేయుచున్నవి. ఇంకను లోటుగనున్న గ్రంథములు పెద్ద కేంద్రములనుండి తేబడుచున్నవి.

1921 సంవత్సరంనాటి గ్రంథాలయ శాసనము ననుసరించి, ప్రతి స్థానికప్రభుత్వము వారును కూడ నచ్చటి నియోజకవర్గములో నైదవ వంతు ప్రజలు కోరినచో గ్రంథాలయమును స్థాపించవలసినదే! మనిషి యొక్కంటికి సంవత్సరమునకు 25 "సెంటిములు" ఇందు లకై ప్రత్యేకింపబడును. అన్ని గ్రంథాలయ ములునుగూడ ప్రభుత్వసహాయమును పొందు చున్నవి. ప్రభుత్వమువారు వానిని తనిఖీ చేయుచుందురు. కొన్ని రాష్ట్రములలో రాష్ట్రీయప్రభుత్వమువారుగూడ తమకు తోచిన సహాయము చేతురు. 1921 సం॥ నాటి గ్రంథాలయ శాసనమునకు ఫలితముగ ననేక గ్రంథాలయములు ప్రభుత్వమువారిచే ననుమతింపబడి వారి సహాయము నొందు చున్నవి. వాని సంఖ్య 1922 సం॥లో 1370 యుండెను. 1929 లో 2188 యుండెను. హా లెండులో గ్రామగ్రంథాలయములు రాష్ట్రీ య గ్రంథాలయ సంఘములవారిచే స్థాపింప బడును. బొత్తుగ చిన్నవగు గ్రామములలో కేంద్ర గ్రంథాలయమువారిచే స్థాపింప బడును. కేంద్రప్రభుత్వముగాని రాష్ట్రప్ర భుత్వముగాని రెండునుగాని వానికి సహాయ ము చేయును. గ్రంథాలయ సంఘములనుండి యు, ప్రజాసంఘములనుండియు, పాఠకుల చందాలనుండియు, గ్రంథాలయములు పో షింపబడును. పెద్ద గ్రంథాలయములు చిన్న చిన్న గ్రామములలో కేంద్రముల నేర్పరచి రాష్ట్రీయ సంఘములనుండి కొంతసహాయ మును పొందుచుండును. ఈ గ్రామకేంద్రము లా గ్రంథాలయములలోని పుస్తకముల పట్టికను చూచుకొనుచు, కావలసినవానిని తెప్పించుకొనుచుండును. అప్పుడప్పుడు పట్టి కయు మారుచుండును. కాని వెనుకటి పట్టిక లోని గ్రంథమేదైనను నెవరికైనను కావలసి వచ్చుచో నది తరుచుగ పంపబడుచునే యుండును. జుగోస్లావేకియాలో 1919 సం॥ నాటి గ్రంథాలయశాసనమువలన ప్రతి గ్రామములోను పట్టణములోను ఉచిత గ్రం థాలయములు స్థాపింపబడవలసి వచ్చినది. తత్ఫలితముగ నా స్వయంపరిపాలిత దేశ ములోని గ్రంథాలయముల సంఖ్య 5 సం॥ లలో 458 నుండి 2242 వరకును పెరిగెను. కార్ల్ బోర్టర్స్ అను నాయన సోవియటు రష్యాలోని గ్రామగ్రంథాలయ సేవను గూర్చి యిట్లు చెప్పినాడు:

"బోల్షివికులు ఇతరులను తుపాకితో బెదరించియే తమలో కల్పుకొనుచున్నారని నేటికికూడ నెవరైన నమ్మిచో వారిదేశమునం దంతటను వలవలె నల్లు కొనియున్న పఠనమందిరములను గ్రంథాలయము లను తిలకింపవలసియున్నది. ఉత్తర 'కకాసస్'లో చేరిన ఆర్చుకస్లోవ్ మండలములోని నలుబది గ్రామ ములలో నెనిమిది పెద్దగ్రామములలో పఠనమందిరము లును, గ్రంథాలయములును గలవు, అందు ప్రతిదాని కిని నిర్వాహకుడు గలడు. అన్నియు ప్రతిదినమునను తెరచియే యుండును. అన్నిటికంటెను పెద్దగ్రామము లో కేంద్రగ్రంథాలయము మాత్రమేగాక చిన్న గ్రా మములలో శాఖాగ్రంథాలయముకూడ నున్నది. ఈ కేంద్రగ్రంథాలయములలో నన్నివిషయములపైనను, ముఖ్యముగ వ్యవసాయముపైనను, రాజకీయములపైనను, గ్రంథములుండును. అంతియేగాక యా గ్రంథాలయ ములలో వివిధవిషయములకు చెందిన సమాచారములు తెలుపబడును. "మస్లోవ్‌కట్‌లో" అగస్టునెలలో ప్రజలు వ్యవసాయ కార్యవ్యగ్రులైయున్నను, సామా నులలో 110 మంది గ్రామవాసులు వివిధవిషయము లకు జెందిన వానిని—పన్నులు, భూముల నియమములు మున్నగు నసేక విషయములకుజెందిన సమాచారములను గ్రహించిరని యచ్చటి యుద్యోగి నాకు చెప్పినాడు.

ఠనమందిరములుండుట కవసరములేని చిన్నగ్రామములలో నగరకేంద్రమునుండి సంచారగ్రంథాలయముల ద్వారా గ్రంథములు పంపబడుచున్నవి. నేను లెనిన్ గ్రాడ్ గుబెర్నియాలో నొక చిన్నగ్రామమునకు పోయియుంటిని. అచట నేను బసచేసిన వారి కుమార్తె యొక యాదివారమునాటి యుదయమున వర్షము కురియుచుండగా బడియొద్ద పుస్తకములను పంచిపెట్టుచున్నది. ఆ చుట్టుపట్లనుండు ప్రజల యుపయోగార్థమై యీ గ్రంథసమూహముద్దేశింపబడినది. గ్రామవాసులు విస్తారముగ చదువగలిగినవారు కారు. కాని కట్టెదుట గ్రంథసమూహము కన్పట్టుచున్నపుడు చదువ బుద్ధిపుట్టును. కావున అక్షరజ్ఞానము దేశములో విస్తరించినకొలదియు, నీసాధనముద్వారా జ్ఞానాభివృద్ధి జరుగుచుండును.”

## భారతవర్షము.

విదేశములలోని గ్రామగ్రంథాలయ ప్రచారమును సంగ్రహముగ పరిశీలించితిమి. ఇపుడు మన దేశమునకు వత్తము. మన గ్రామవాసులకు ఎట్టి గ్రంథాలయ సౌకర్యములను కల్గించుచున్నాము? మన దేశములో విశేష సంఖ్యాకులు అక్షరజ్ఞానములేని వారేయగుటచేత మనల నీసమస్య బాధింప నవసరము లేదని యనేకులందురు. అదినిజమే. మన యక్షరజ్ఞానశూన్యులకు గ్రంథాలయములు కావలెననుట బుద్ధిహీనతయే. మనము దానిని కోరుటలేదు. ప్రస్తుత మక్షరజ్ఞానముగల కొలదిమందికే గ్రంథాలయములు కావలసియున్నవి ఇప్పుడట్టి సౌకర్యమున్నదా? గ్రామపాఠశాలయున్నచోటనెల్ల గ్రామగ్రంథాలయమున్నదా? లేనిచో పాఠశాలలోని విద్యార్థులు పాఠశాల వీడినపిమ్మట నేమి చదువుకొందురు? అనంతర విద్యకు సాధనము లేనపుడు ప్రారంభవిద్యావిధానమువలన నేమిలాభ ముండును? కావున గ్రామగ్రంథాలయము లుండనిచో గ్రామములలో చదువుకొనిన కొలదిమందికూడ ననక్షరాస్యులగుదురు. దానివలన వారి జీవితము వ్యర్థమగును. అట్లుండియు మన విద్యావ్యాపన నిరతులు గ్రామగ్రంథాలయములను స్థాపించుటకు యత్నింపకుండుట శోచనీయము. దేశములోని విద్యావిధానము, నేవిధముగ సంస్కరింపవలెనో విచారించి సూచనలను పంపవలసినదని యనేక సంఘము లిదివరలో నియమింపబడినవి కాని యొక్క సంఘమువారును గూడ గ్రామగ్రంథాలయముల యావశ్యకతను సూచించియుండలేదు. అది వారి హ్రస్వదృష్టిని సూచించును. ఒకయుదాహరణము తీసికొందము. తిరువాన్కూరుప్రభుత్వము వారీ నడుమ నట్టి సంఘమును స్థాపించియున్నారు. ఆ సంఘమువారు చాల విలువగల సూచనలను చేసియుండిరి. కాని విద్యాభివృద్ధికి గ్రంథాలయము లొకసాధనమను మాటగూడ నందు లేదు. కాని తిరువాన్కూరు సంస్థానములో నక్షర జ్ఞానము కలవా రెందరున్నారో గ్రంథాలయము లెన్నియున్నవో, పరిశీలింతుమేని మనకు కొన్ని వింతయగు నంశములు గన్పట్టును. హిందూదేశము మొత్తముపైన ననగా బ్రిటిషువారి చేతిలోనున్న రాష్ట్రములలోను స్వదేశసంస్థానములలోను కలిపి యక్షరాస్యుల సంఖ్యావిషయములో తిరువాన్కూరు మూడవస్థానము నాక్రమించుచున్నది. వేయిమంది జనములో 408 మంది పురుషులును, 168 మంది స్త్రీలును అక్షర జ్ఞానముకలవారు. కళాశాలలు, ఉన్నతపాఠశాలలు, మాధ్యమిక పాఠశాలలు, బోధనాభ్యసన పాఠశాలలు, మున్నగు

వానిసంఖ్య సుమారు 650. ప్రారంభ పాఠశాలల సంఖ్య సుమారు 3000. పండితులసంఖ్య 5,60,000. ఇది చాల ప్రశంసనీయము. కాని యీసంస్థానములో దీనికితగిన గ్రంథాలయ సౌకర్యమున్నదా? అట్టి సౌకర్య మసలు లేనేలేదని చెప్పవచ్చును. తిరువాన్కూరులో గ్రంథాలయవిధానమే లేదు. గ్రామగ్రంథాలయముల పేరైనను లేదు. ప్రధానపట్టణము తప్ప నితరస్థలములలో చెప్పదగిన గ్రంథాలయము లేనేలేదు. "కొట్టయం" "నగర్ కోయిల్" "క్విలన్", మున్నగు పట్టణములు 20,000 పైబడిన జనాభా గలవే యైనను, విశేషసంఖ్యాకులగు అక్షరజ్ఞానము గలవారికిని, పాఠశాలలకును, కళాశాలలకునుగాని, చక్కనియుచిత గ్రంథాలయము లేనే లేదు. ఇట్టియొకపట్టణములో ఉచితగ్రంథాలయము పఠనమందిరము అను పేరు వేయబడిన యొక మందిరమును చూచితిని. లోపలకు పోతిని గదా మిక్కిలి నిరాశకలిగినది. ఒక చిన్నగదిలో 3 అలమారులున్నవి. అతి పురాతనములగు గ్రంథములు కొన్ని వానిలోనున్నవి. అవి ప్రాతబడిపోయిన క్రైస్తవమతసిద్ధాంతములకు చెందిన గ్రంథములు. మరికొన్ని క్రైస్తవ ప్రచారకుల నివేదికలు. చౌకనవలలు కొలదిగనున్నవి. ప్రాత వార్తాపత్రికలుగల యొకపఠనమందిరముగూడ నున్నది. సాయంకాలములయందు మాత్రమే యిది తెరువబడియుండును. ఒందొక గుమస్తాయుండును. ప్రభుత్వమువారినుండి కొద్దిగా ధనసహాయము వచ్చుచున్నది. పండ్రెండువార్తా పత్రికలను కొనుట కాధనము వినియోగింపబడుచున్నది. ప్రతులే పండ్రెండుగాని వార్తా పత్రికలు రెండే! అవియైనను వచ్చిన వెంటనే పోషకులకును చందాదారులకును నిండ్లకు పంపబడును. తిరిగి వచ్చునప్పటికి కొన్ని రోజులు పట్టును. నలిగి పోయియు, చిరిగి పోయియు తిరిగి వచ్చును. పుస్తకములను కొననేకొనరు.

ఈ విధానమంతయు నాధునిక గ్రంథాలయ పద్ధతుల కెంత వ్యతిరేకముగ నున్నది! బ్రిటిష్ఇండియాలోగాని స్వదేశసంస్థానములలో గాని చాలపట్టణములలో నున్న గ్రంథాలయము లింతకన్న భిన్నముగ లేవు. పెద్దపెద్ద పట్టణముల స్థితియే యిట్లుండగా చిన్నపట్టణములయొక్కయు గ్రామములయొక్కయు పల్లెలయొక్కయు స్థితి చెప్పనేల!

అచ్చట గ్రామవాసులు విద్యావంతులగుటకునవకాశము లేమున్నవి? ఇట్లున్నను గూడ మనవిద్యావిచారణసంఘములు మనదేశములో గ్రంథాలయము లవసరమను సంగతినే గుర్తింపకున్నవి.

అదృష్టవశమున హిందూదేశములోని గ్రంథాలయోద్యమమును గురించి చెప్పునపుడు కొన్ని మంచిసంగతులు గూడ చెప్పవలసియున్నది. ఈదేశములో నీవిషయములో బరోడాసంస్థాన మద్వితీయమై విరాజిల్లుచున్నది. ఈసంస్థానము అతిప్రశంసనీయమైన గ్రంథాలయవిధాన సౌకర్యములతో నొప్పుచున్నదని ప్రపంచమంతటను ప్రసిద్ధిగలదు.

దివాన్ సర్. వి. టి. కృష్ణమాచారిగా రిట్లు వ్రాయుచున్నారు. "బరోడా సంస్థానములో ప్రజాసామాన్యములో విద్యావ్యాపనమునకు మహారాజాగారిచే ప్రారంభింపబడిన విధానములో గ్రంథాలయోద్య

మును చాల నైపుణ్యముతో ప్రారంభింపబడినది. 1907 సం॥లో బాలబాలికలకు ప్రారంభ విద్యావిధానము నిర్బంధము చేయబడెను. ప్రజలలోని అక్షరజ్ఞానము పరిరక్షింపకుండ వలెనన్న గ్రంథాలయము అవసరమని మహారాజావారు గుర్తించిరి. ఈయుద్దేశముతో ప్రభుత్వధనసహాయముచేనిర్వహింపబడు నుచిత గ్రంథాలయప్రణాళిక యొకటి 1910 సం॥రంలో ప్రారంభింపబడెను. నేడు అదియే విజృంభించి పట్టణములలోను పల్లెలలోను మొత్తముపై నూటికి అరువదిమంది ప్రజలకు గ్రంథముల నందజేయుచున్నది" వలవలె దేశమంతటను అల్లుకొనియున్న యీప్రభుత్వ గ్రంథాలయవిధానమును స్థలవిస్తరభీతిచే నిట వర్ణింపను. గడచిన ఇరువదిసంవత్సరములనుండియు విద్యాశాఖాధికారిచేతను, ప్రభుత్వగ్రంథాలయ ప్రధానోద్యోగిచేతను నీవిధానము జయప్రదముగ సాగింపబడుచున్నది. గ్రంథాలయములకై లక్షరూపాయలకు పైగా ప్రభుత్వమువారు వినియోగింతురు. ఈ సొమ్ము గ్రంథాలయములకై మొత్తము వినియోగింపబడుచున్న సొమ్ములో నొక భాగము మాత్రమే మొత్తము సొమ్ములో 3 వ వంతు స్థానిక ప్రజలే భరింతురు. మరియొక 3 వ వంతు గ్రామపంచాయితీవారు గాని జిల్లాబోర్డువారు గాని మ్యునిసిపాలిటీవారుగాని భరింతురు. మిగిలిన సొమ్ము అంతయు ప్రభుత్వమునుండి వచ్చును. ఈ మూడు సంస్థలవారును కలిసియే దేశమంతటను గ్రంథాలయములస్థాపించిరి. ఇప్పుడు పాఠశాల యున్నచోట నెల్ల గ్రంథాలయమున్నది. పాఠశాలను వీడిన బాలబాలికలెల్ల గ్రంథాలయమునకు సభ్యులే.

ఈవిధముగ బాలబాలికలు పాఠశాలను వీడిన పిమ్మట అనంతరవిద్యను పొంద గల్గుచున్నారు. బరోడాపట్టణములో రెండు పెద్ద గ్రంథాలయములు లున్నవి. సంస్థానములో 778 సామాన్య గ్రంథాలయములున్నవి. ఇవి గాక సంచారగ్రంథాలయములును, పఠనమందిరములును, గ్రామములలో విశేషముగ నున్నవి. 111 గ్రంథాలయములకు స్వంతభవనము లున్నవి. మహారాజావారి స్వర్ణోత్సవమునకు వేలకొలది ధనమును వెచ్చించి గ్రంథాలయభవనములను నిర్మించుట యొక మర్యాదగానుండెను. చాల స్థలములలో అన్నిభవనములకంటె గ్రంథాలయ భవనమే చక్కనిది. ప్రభుత్వగ్రంథాలయవిధానములో నున్నగ్రంథముల సంఖ్య యేడు లక్షలు. సాలుకు 5,50,000 గ్రంథములు తిరుగుచుండును. ఇవిగాక గ్రంథములను కోరినవారి సంఖ్య 87,500. బరోడా సంస్థానములో పల్లెటూరివాండ్రకును, పట్టణవాసులకునుగూడ సమానముగనే గ్రంథాలయలాభములున్నవి. ఇండియాలోని ప్రతి రాష్ట్రమువారును గూడ కొన్నివిషయములలో నైనను, బరోడాగ్రంథాలయ విధానముతో పోల్పదగినవిధానములను గావింతురు గాక. ఒక్కబరోడా సంస్థానములో మాత్రమే యక్షరజ్ఞానముగల ప్రతివారును గూడ తనకు కావలసిన గ్రంథమును పొందగలడు. యావద్భారతదేశమునగూడ నిట్టిపరిస్థితియే యుండు పుణ్యకాల మేనాడువచ్చునోగదా!

ప్రభుత్వమువారి పోషకత్వమున నిర్వహింపబడుగ్రంథాలయ మెంతశక్తివంతముగ నుండునో తెలిసికొనుటకు బరోడాయుదాహరణము చాలును. కాని ప్రభుత్వపోషణము

మాత్రమే చాలదు. ప్రజలస్వచ్ఛందప్రయత్నము కూడ నంత ప్రయోజనకారియే. దీనికి మంచి యుదాహరణ మాంధ్రదేశమే. ఆంధ్రులు విశేషధనవంతులు కారు. ఇతర రాష్ట్రములనుండి వారికి సహాయ మేమియు లేదనియే చెప్పవచ్చును. ఆంధ్రగ్రంథాలయోద్యమమునకు పితామహు లనదగిన కీర్తిశేషులగు నరసింహశాస్త్రిగారును, అయ్యంకి వేంకటరమణయ్యగారును నీవిషయములో చేసినపని మాసుషాతీతమని చెప్పవచ్చును. గడచిన 25 సం॥లనుండియు వారు గావించిన కృషికి ఫలితముగ ననేకవిధములగు 750 గ్రంథాలయములును, సంచారగ్రంథాలయములును అన్ని ప్రాంతములో నన్నితరగతులవారికిని పుస్తకములనుపంచిపెట్టు కేంద్రములును, నీరాష్ట్రములో బయలుదేరినవి. పాశ్చాత్యదేశములలోవలె నిపుడు ఇచ్చటగూడ వివిధప్రాంతములకు చెందిన గ్రంథాలయసేవకులు కలిసి పనిచేయుచున్నారు. అప్పుడప్పుడు వారు సమావేశములనుగావించుకొనుచున్నారు. వారి యుద్యమాభివృద్ధికి ప్రచారమును గావించుచున్నారు. దీనికంతకును మూలవిరాట్టు ఆంధ్రగ్రంథాలయసంఘము. ఇట్టి రాష్ట్రగ్రంథాలయ సంఘములవారు చేయుచున్న పనికి ప్రజలును ప్రభుత్వమువారును సహాయముచేయుచో నది యింతకన్నను నెక్కుడు జయప్రదముగనుండును.

## గ్రామగ్రంథాలయప్రాముఖ్యత

అదృష్టవశమున, మదరాసు రాజధానిలో ప్రస్తుతము ప్రజాసామాన్య గ్రంథాలయ చట్టమొకటి సిద్ధముగ నున్నది. దానిని తగువిధముగ నేర్పరచుచో చాలలాభకారి యగును. ఇతరరాష్ట్రములుగూడ నీవిషయమున మదరాసు ననుకరింపదగును. అట్లగుచో గ్రంథాలయముద్వారా జరుగు విద్యావ్యాపనమునకు నూతనశక్తి ముదయించును. ప్రస్తుతపు గ్రంథాలయవిధానములోగాని, రాబోవుదానిలోగాని, గ్రామగ్రంథాలయోద్యోగి కర్తవ్యమేమో ఇపుడు విచారింతము. అతనికి చాలప్రాముఖ్యముగలదు. గ్రామోద్యోగులలో నందరలో నతడే ప్రధానుడని చెప్పదగును. ప్రతిపాఠశాలలోను, గ్రంథాలయముండు కాలము త్వరలో రానున్నది. గ్రామవాసిజీవితములో గ్రంథాలయము నేటికంటెను ప్రధానము కాగలదు. బాగుగా శిక్షణను పొందిన గ్రామగ్రంథాలయోద్యోగి మంచి యుత్సాహమును సుస్వభావమునుగల వాడగుచో గ్రామములలో నాతడే ప్రధానోద్యోగి కాగలడు. పట్టణగ్రంథాలయోద్యోగులంత పెద్దజీతముల నాతడు తీసికొనలేడుగాని గ్రామసేవను విశేషముగ చేయగలడు. పాఠశాలవిద్య యెచట నాగిపోవునో, అచటనుండి ప్రయోజనవిద్యావిధానమును సాగింపగలవా డాతడే యువకులను, నంతకంటె పెద్దవారిని గూడ గ్రామపరిస్థితుల కనుకూలమగు విద్యను నేర్చునట్లు చేయువా డతడే. వైజ్ఞానికావకాశములు లేనిస్థలములలోగూడ నాతడు వానిని గల్గించును. విద్యయందు శ్రద్ధను బుట్టించును. విద్యావిషయమున ప్రజలకు నేత యతడే. ఆ విద్యావ్యాపనమునకు సాధనములు గ్రంథములే. ఆగ్రంథము లనేకగృహములకు తిరిగి వానిని వికసింపజేయును. అవి యెన్నడును ఊరకనుండకుండున ట్లాతడు చూడవలెను. ఈ విధముగ నాతడు గ్రామవాసుల యభిప్రాయములను జీవితదృక్పథము

నుల మార్చును. విద్యాదీపికను చేతబూని ప్రతి గృహమును ప్రకాశింపజేయును. సంఘసంస్కర్తయు, ప్రజాహితకారియు, రాజకీయవేత్తయు నార్థికవేత్తయు, చేయదగిన కార్యముల కీతడీవిధముగ ప్రాతిపదికలను వేయును. ఇన్నివిధముల మేలునుకలుగచేయునది యొక్క గ్రామగ్రంథాలయముమాత్రమే బ్రహ్మాండమైనట్టియు, గౌరవప్రదమైనట్టియు గ్రామసంస్కరణము ముఖ్యముగ గ్రామగ్రంథాలయోద్యోగిపైననే ఆధారపడియున్నది.



# భీమవరం తాలూకా గ్రంథాలయయాత్ర.

1934 సం॥ సెప్టెంబరు 1 మొదలు 17 వ తేదీవరకు

యాత్రాఫలితములు

| | |
|---|---|
| యాత్రాదినములు | 17 |
| మొత్తం దర్శించిన గ్రంథాలయములు | 38 |
| ఉద్ధరించిన గ్రంథాలయములు | 4 |
| నూతనముగా స్థాపించిన గ్రంథాలయములు | 5 |
| వార్షికోత్సవములు జరిపిన గ్రంథాలయములు | 5 |
| గ్రంథాలయములయొక్క ఆదాయంపు అభివృద్ధి | రు ౬00 |
| నూతనముగా బయలుదేరిన గ్రంథాలయసేవకులు | 100 |
| ఉద్ధరణకు వాయిదాపడిన గ్రామము | 1 |
| కాలినడకమీద పోయినమైళ్లు | 84 |

ప్రారంభము-కుముదవల్లి

ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు భీమవరంతాలూకా నాయకమణియని జెప్పవచ్చును. ఆంధ్రదేశమందు గ్రంథాలయోద్యమప్రారంభము నాటినుండి నేటివరకు అవిచ్ఛిన్నముగా జరుగుచున్న పెక్కు గ్రంథాలయము లీ తాలూకాయందే విరాజిల్లుచున్నవి. కాళ్లకూరి నరసింహంగారు, భూపతిరాజు తిరుపతిరాజుగారు, నిడమర్తి లక్ష్మినారాయణగారు-ఇత్యాది గ్రంథాలయ సేవకులయొక్క నిరంతర సేవవలన ఈ తాలూకాయందు గ్రంథాలయోద్యమమునకు గాఢమగు పునాది వేయబడినది. ఈ తాలూకాయందు గల 90 గ్రామములలో 46 గ్రంథాలయము లున్నవి. ఆంధ్రదేశమందే తాలూకాయును ఇంత దట్టముగా గ్రంథాలయములచే అల్లుకొనబడి యుండలేదు. ఇట్లు విరివిగా బయలుదేరిన గ్రంథాలయముల యొక్క పనిని సమీకరణము చేయుటకుగాను తాలూకా గ్రంథాలయసంఘము రెండు సంవత్సరముల క్రిందట ఏర్పడి భూపతిరాజు తిరుపతిరాజుగారి యొక్కయు, డాక్టరు పాలకోడేటి సత్యనారాయణశర్మగారి యొక్కయు పట్టుదలవలన మిక్కిలి జయప్రదముగా పనిజేయుచున్నది.

ఈ తాలూకాయందు పనిచేయుచున్న గ్రంథాలయముల పనిని ఇంకను ఎక్కువ ఉపయోగవంతము చేయుటకును, ఇప్పుడీ తాలూకా గ్రంథాలయసంఘమువారు తాలూకా గ్రంథాలయయాత్రను 17 దినముల పర్యంతము ఏర్పాటు చేసినారు.

ఈ యాత్రయొక్క కార్యక్రమము సెప్టెంబరు 1 వ తేదీ మధ్యాహ్నము శ్రీకృష్ణాష్టమీమహాపుణ్య దినమున, కుముదవల్లి గ్రామమున ప్రారంభింపబడినది. ఆంధ్రదేశగ్రంథాలయ కార్యదర్శి అయ్యంకి వేంకట రమణయ్యగారు, అఖిల భారత గ్రామగ్రంథాలయ సంఘసంయుక్త కార్యదర్శి తాడిమేటి కుటుంబశాస్త్రిగారు, సారయాత్రికులు కాశీభట్ల సీతారామయ్యగారు, కాశీభట్ల జగన్నాథంగారు ఇంకను తాలూకాలో వివిధగ్రామములనుండి పలువురు ప్రతినిధులు విచ్చేసిరి. గ్రంథాలయభవనము అంతయు వివిధదేశమందలి గ్రంథాలయములయొక్క పటములతోను, బరోడాయందును, భారతవర్షమునందును ఇతిర భాగములందును ఉద్యమము ఎటుల పనిజేయుచున్నదో చూపు పటములతోను అలంకరింపబడి గ్రంథాలయ ప్రదర్శనము ఏర్పాటు చేయబడినది. మరియు భీమవరము స్వదేశ ప్రచారసంఘమువారియొక్క స్వదేశవస్తువుల నమ్ము బండిగూడ విచ్చేసినది.

ప్రథమమున తరంగాల నారాయణరాజుగారి నాయకత్వము క్రింద భజనసమాజమువారు సంకీర్తనచేయుచుండగా ప్రతినిధులందరును ఊరంతయు ఊరేగి, హరిజనవాడకు బోయి అచటి హరిజనగ్రంథాలయమును దర్శించిరి. ఈ హరిజనవాడలోని స్త్రీ పురుషులలో నూటికి తొంబదియైదుగురు జనులు చదువుకొనగలిగినవారు. ఈ గ్రంథాలయము చక్కగా, అందముగా, పరిశుభ్రముగా నుంచబడి అందుకొరకై ప్రత్యేకముగా నిర్మింపబడిన పాకయందుంచబడినది. 150 గ్రంథములున్నవి. పత్రికలేమియు వచ్చుట లేదు. కాని సవర్ణులవాడయందున్న శ్రీవీరేశలింగ గ్రంథాలయమునుండి పుస్తకములను పత్రికలను తెచ్చుకొని చదువుకొనుచుందురు. శ్రీ గంగేశ్వరానాద యోగిగారియొక్క తోడ్పాటువలనను పి. సుందరరావుగారియొక్క పట్టుదల వలనను, ఈ గ్రంథాలయము నిరంతరాభివృద్ధి నందుచున్నది.

పిమ్మట శ్రీ వీరేశలింగకవిగ్రంథాలయ భవనమునందు గ్రంథాలయయాత్రయొక్క ప్రారంభ మహోత్సవము శ్రీ తాడిమేటి కుటుంబశాస్త్రిగారిఅధ్యక్షత క్రింద జరిగినది. శ్రీ కుటుంబశాస్త్రిగారు శ్రీ కృష్ణపరమాత్మునియొక్క మహాత్మ్యమును గూర్చి విపులముగా ముచ్చటించి గ్రంథాలయయాత్ర జయప్రదముగా జరుగుగాక యని ఆశీర్వదించిరి. తరువాత ఆంధ్రదేశగ్రంథాలయ సంఘకార్యదర్శి అయ్యంకి వేంకటరమణయ్యగారు, గ్రంథాలయ యాత్రయొక్క ఉద్దేశములను విపులీకరించుచు గ్రంథాలయములు గ్రంథములను సేకరించి ఉంచుటతో మాత్రము తృప్తినిపొందినయెడల లాభమేమియు లేదనియు, ఈ తాలూకాయందలి గ్రంథాలయముల యొక్క కార్యక్రమమును ఇంకను నిశితము చేయుటకే ఈయాత్ర ఏర్పరుపబడినదనియు చెప్పిరి.

తరువాత సారయాత్రికులగు కాశీభట్ల సీతారామయ్యగారును, జగన్నాధంగారును ప్రకృతివైద్యసేవనుగూర్చియు సూర్యభగవానుని సేవించుటవలన మన జీవితములందు కలుగు పరిణామమును గూర్చియు గంభీరోపన్యాసము లొసంగిరి.

పిమ్మట వద్దిపర్తి రాజారావుగారును, డాక్టరు పాలకోడేటి సత్యనారాయణశర్మగారును గ్రంథాలయములు జనులకు ఉపకరింపదగిన విధానములను గురించి విపులముగా జెప్పిరి.

అనంతరము మంగళగీతములతో సభ ముగింపబడినది.

ఆరాత్రి భజనసమాజమువారు తిరిగి భజన చేసి, గ్రామస్థులకు ఉత్తేజమును కలుగజేసిరి. శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు ఆ గ్రామమందున్న గ్రంథాలయ సేవకులను ప్రత్యేకముగ కలిసికొని గ్రంథాలయోద్యమము ఇంకను ఎక్కువ ఉపయోగవంతము చేయగల మార్గములను గూర్చి బోధించిరి. ఇంతటితో ఆనాటి కార్యక్రమము ముగింపబడినది.

కుముదవల్లి గ్రామమునందు గ్రామస్థులందరికిని ఉపయోగించుచున్న గ్రంథాలయము శ్రీ వీరేశలింగకవి గ్రంథాలయము. దీనిని 1897-వ సంవత్సరమున శ్రీ భూపతిరాజు తిరుపతిరాజుగారు స్థాపించి నేటికిని దానియభివృద్ధికై పాటుబడుచున్నారు. ఈ గ్రంథాలయమునకు రు 2000 లు విలువగల స్వంతభవనము గలదు. రు 1000 లు విలువల 1500 గ్రంథములుగలవు. బీదలకు ఉచితముగా మందుల నిచ్చెదరు. పత్రికలు 12 వచ్చుచున్నవి. ఈ తాలూకాకు ఆదర్శ [illegible]గా వెలయుచున్నది. తాలూకా గ్రంథాలయోద్యమ మంతయు ఇచటినుండియే నడుపబడుచున్నది.

సెప్టెంబరు 2-వ తేదీ : భీమవరం

రెండవ దినము

గ్రంథాలయ యాత్రికులును, సారయాత్రికులును స్వదేశవస్తువులబండియును నేటి ఉదయమున 8 గంటలగుసరికి చెన్నురంగని పేటకు విచ్చేసిరి. యాత్రికులందరును ఊరికి బైటనున్న కాలువయందు స్నానముచేసినవారై భక్తనారాయణరాజుగారును వారి భజనసమాజమువారును భక్తిరస ముప్పిరిలునట్లుగా తరంగములను బాడుచుండగా గ్రామమంతయు తిరిగి, గ్రామనాయకులగు శ్రీ పస్తుల సాగరంగారియింట బహిరంగ సభను జేసిరి. ఈ గ్రామమందు 29-11-1933 తేదీన అరుంధతీగ్రంథాలయము స్థాపింపబడినది. కాని జరుగవలసినంత అభివృద్ధి జరిగియుండలేదు. యాత్రికులు గ్రామస్థులను ఉద్బోధించిన పిమ్మట వేంద్ర వేంకటరావుగారు ఈ గ్రంథాలయవిషయమై తగిన కృషి చేసెదమని దీక్షను తీసికొనిరి. సారయాత్రికులగు కాశీభట్ల సీతారామయ్యగారు సూర్యనమస్కారములను చేసి చూపించి, వాటివలన కలుగులాభములను విశదీకరించిరి. అనంతరము యాత్రికులు భజనతో బయలుదేరి భీమవరమునకు బోయి డాక్టర్ శర్మగారి యింట బస జేసిరి.

తిరిగి మధ్యాహ్నము 2 గంటలకు యాత్రికు లందరు భజనతో బయలుదేరి గునుపూడియందున్న శ్రీ రామగ్రంథాలయమునకు బోయిరి. గ్రంథాలయమంతయు గ్రంథాలయ[illegible] ధ్వజముతోను ఆకుజొంపము

# భీమవరం తాలూకా గ్రంథాలయయాత్ర




దండలతో కూర్చున్నవారు :

అయ్యంకి వేంకట రమణయ్యగారు - దళనాయకులు

భూపతిరాజు తిరుపతిరాజుగారు - తాలూకా నాయకులు.

తోను అలంకరింపబడియున్నది. ఈ గ్రంథాలయము 1928 వ సంవత్సరమున శ్రీ ఆకుల సత్యనారాయణగారివలన స్థాపింపబడినది. నాలుగువందల రూపాయలు విలువగల 647 గ్రంథములు గలవు. ఉత్సాహవంతులగు యువకు లనేకులు ఈ గ్రంథాలయముయొక్క అభివృద్ధికై విశేషముగ పాటుపడియుండిరి. అయితే ఈ గ్రంథాలయ నిర్వాహకులు ఈ మధ్యను కొంత కాలము గ్రామమునందు లేకపోవుటవలన కొంత ఉత్సాహము తగ్గినది. కాని గ్రంథాలయ యాత్రికులు వచ్చునరికి తిరిగి గ్రంథాలయముయొక్క ఉత్సాహము పునరుద్ధరింపబడినది. యాత్రికులు ఉద్బోధింపగా చిన్ని అప్పారావుగారును, మోపిదేవి పద్మనాభరావుగారును గ్రంథాలయాభివృద్ధికై పని చేయుదుమని దీక్షవహించిరి.

అక్కడనుండి యాత్రికులు ఆ గ్రామమునసే కొంతకాలము మిక్కిలి జయప్రదముగ నిర్వహింపబడి నేడు నామమాత్రావశిష్టముగ నున్న గాంధిగ్రంథాలయమును దర్శించిరి. ఈ గ్రంథాలయము శ్రీభమిడిపాటి సూర్యనారాయణగారి యాజమాన్యమున చాలకాలము మంచిదినములు గడపినది. గ్రంథాలయమునకు స్వంతభవనమును ప్రారంభించి, గోడలవరకు గట్టి కొంతకాలము ఆపిరి. ఇప్పటికి గోడలపైన తాటి యాకుల కప్పును గూడ వేసిరి. యాత్రికులు భజనతో బయలుదేరి, ఆగ్రంథాలయమునకు సంబంధించిన ముఖ్యమగు సభ్యులయొక్క అందరిఇండ్లకును బోయి, వార్లతో ప్రసంగములను సల్పి, గ్రంథాలయమును త్వరలో పునరుద్ధరించుటకు వాగ్దానమును దీసికొనిరి.

పిమ్మట యాత్రికు లందరును భీమవరము గ్రామమునకు భజనతో బోయి, పరేలు గ్రంథాలయమును దర్శించిరి. ఈ గ్రంథాలయము కొద్దిమాసముల క్రిందటనే స్థాపింపబడినను మిక్కిలి ఉత్సాహముతో జయప్రదముగ నిర్వహింపబడుచున్నది. శ్రీ అత్తిలి సూర్యనారాయణగారు, తటవర్తి కృష్ణమూర్తిగారు, అరఖ్యగారి సుబ్బారాయుడుగారును విశేషముగ పాటుబడుచు, ఈ గ్రంథాలయము నింతస్వల్పకాలములో గొప్పయభివృద్ధికి దెచ్చిరి. ఈ గ్రంథాలయమునకు 500 రూపాయలు విలుగల 800 గ్రంథములుగలవు. 20 పత్రికలు వచ్చుచున్నవి. గ్రామమునకు మధ్య కూడలిస్థలమునందుండి, అన్నితరగతులవారికిని ఎక్కువ ఉపయోగకరముగ నున్నది.

అక్కడనుండి యాత్రికులు సాయంకాలము 6 గంటలకు భక్తనారాయణరాజుగారి బృందమువారు భజన చేయుచుండగా గాంధీ చౌకునకు బోయి బహిరంగసభను జరిపి గ్రంథాలయోద్యమముయొక్క వివిధదశలను గూర్చి గంభీరోపన్యాసముల నొసంగిరి. నేటి మధ్యాహ్నమునకు శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు పంపిన వుప్పెర్ల లక్ష్మీనారాయణగారు వచ్చిరి. సభ జరిగిన పిమ్మట, లక్ష్మీనారాయణగారును అయ్యంకి వేంకటరమణయ్యగారును మ్యాజిక్కులాంతరు సహాయముతో ఉపన్యాసము లిచ్చిరి. వివిధదేశములందలి గ్రంథాలయోద్యమముల యొక్కయు, ముఖ్యముగా అమెరికా దేశమునందు మారుమూలలయందున్న ప్రదేశములలోగూడ గ్రంథాలయసేవ ఎటుల జరుగుచున్నదియు జూపిరి. మరియు హిందూదేశములందు వివిధరాష్ట్రములయందు గ్రం

థాలయోద్యమమును గూర్చి జరుగుచున్న పనులనుగురించి పటములతో వివరించిరి.

ఇందుకూరుపేట ఆలమూరుగ్రామ పునర్నిర్మాణ కేంద్రములందు జరుపుచున్న పనినిగూర్చి కూడ వివరించిరి. అంతటితో నేటియాత్ర ముగింపునకు దేబడినది.

మూడవదిన కార్యక్రమము: ఉండి.

నేటి ఉదయము 7 గంట లగుసరికి యాత్రికులందరును బయలుదేరి ఉండిగ్రామమునకు చేసిరి. ఈ గ్రామమున నలువది సంవత్సరములకు పూర్వము సారోజీగ్రంథాలయము స్థాపింపబడి చాలకాలము గ్రామస్థులకు మిక్కిలి ఉపయోగవంతముగ పనిజేసినది. ఇప్పుడు అది లోకల్ కో-ఆపరేటివ్ యూనియన్ వారియొక్క ఆదరణక్రింద నున్నది. కాని గ్రామస్థులకును, దీనికిని ఎక్కువ సంబంధము లేకపోవుటచేత తగినంతఅభివృద్ధి కలుగుటలేదు.

యాత్రికులు భక్తనారాయణరాజుగారి భజనబృందముతో బయలుదేరి, గ్రామమునందున్న పెద్దలు యువకులు నగు, ముఖ్యులగు వారి అందరిగృహములకును బోయి గ్రంథాలయపునరుద్ధరణమునుగూర్చి మాట్లాడి మధ్యాహ్నము 1 గంట అగుసరికి గ్రామ పంచాయతీబోర్డు ఆఫీసునందు సమావేశమైరి. తణుకుతాలూకాబోర్డు అధ్యక్షులుగా నుండిన ముళ్ళపూడి తిమ్మరాజుగారు సమావేశమునకు అధ్యక్షత వహించిరి. యాత్రికుల ఉద్బోధనాఫలితముగ గ్రామమునందు గ్రంథాలయమును ఉత్సాహవంతముగా నడపుటకుగాను పదునైదుమంది యువకులు దీక్ష వహించి సేవకసంఘముగా నేర్పడిరి. మరియు అక్కడకు చేరినవారు నెలకు రు 20 లు చందాలు ఇచ్చుటకు వాగ్దానము చేసిరి. రు 50 లు మూలధనముగా ఇయ్యబడినది.

యూనియనుబోర్డువారివిందు.

ఉండి యూనియను బోర్డువారు యాత్రికులకు అల్పాహారవిందును గావించి, ఇంత శ్రమను తీసికొనినందులకు యాత్రికులకు వందనము లర్పించిరి.

సభ ముగింపబడినప్పటికి సాయంకాలము 5 గంట లయ్యెను. అటనుండి యాత్రికులు చెరుకువాడగ్రామము వెడలిరి.

చెరుకువాడ.

చెరుకువాడగ్రామము ప్రకృతిసిద్ధముగ మూడుభాగములుగ విభజింపబడియున్నది. ఒకటి క్షత్రియులు నివసించునది. రెండవది కాపులు నివసించునది. మూడవది బ్రాహ్మణులు మొదలైనవారు నివసించునది. మధ్యభాగమున అలుగులమ్మ దేవాలయము కలదు. ఈదేవాలయమునకు పైభాగముననే గ్రంథాలయమునకు చక్కని మేడ కట్టబడియున్నది. చాలకాలము గ్రంథాలయము ఈమేడయందే యున్నది; కాని కొన్ని భేదాభిప్రాయములవలన ఇటీవలనే దీనిని చెరుకువాడ పట్టాభిరామయ్యగారియింటికి మార్చినారు. శ్రీపట్టాభిరామయ్యగారు విద్యాధికులు. వేరే వ్యాపక మేమియు లేదు. ఉత్సాహవంతులు, సమర్థులు. వీరియాజమాన్యమున ఈ ఈగ్రంథాలయము ముందు మంచియభివృద్ధికి రాగలదు. యాత్రికులు రెండుజట్టులుగా చీలి, ఒకజట్టువారు మధ్యపేటయందు మ్యాజికులాంతరుఉపన్యాస మొసంగిరి. రెండవ జట్టువారు రాజులపేటయందు ఉపన్యాసముల నొసంగిరి. అంతటితో నేటికార్యక్రమము ముగింపబడినది.

### నాల్గవదిన కార్యక్రమము:
### ఆకివీడు.

4 వ తేదీ మంగళవారము - అనగా యాత్రలో నాల్గవదినమున యాత్రికులు ఉదయమగుసరికి ఆకివీడుగ్రామము చేరిరి. ఇది గ్రామమునుగాదు, పట్టణమునుగాదు. కాని ఎక్కువగ పట్టణలక్షణములే గలవు.

ఈ గ్రామమునగల విద్యానంద గ్రంథాలయము 1912 వ సంవత్సరమున స్థాపింపబడి, అనేక ఉల్టాసీదాలు పొందినది. దానిని పువ్వాడ వెంకట్రామయ్యగారు ఇంకను కొన యూపిరితో నిలబెట్టిరి. ఒక బీరువాయును 600 గ్రంథములును గలవు. భజనతో బయలుదేరి గ్రామమంతయు ఊరేగి గ్రామములో ముఖ్యమైనవారి అందరి ఇండ్లకును పోయి వారివారితో మాట్లాడి, తుదకు కోఆపరేటివు సంఘాధ్యక్షులగు చెలా సుబ్బారాయుడు గారిని, యూనియనుబోర్డు అధ్యక్షులగు మోటుపల్లి సీతారామయ్యగారిని, గ్రంథాలయముయొక్క కార్యదర్శి వెంకట్రామయ్యగారిని కలిసికొనిరి. వారు మిక్కిలి ఉత్సాహమును జూపిరి. పాఠశాలల ఉపాధ్యాయులును, తానా ఉద్యోగులునుకూడ ఉత్సాహవంతులైయుండిరి. వీరందరిని జేర్చి ఉదయము 10 గంట లగుసరికి లోకలుఫండు సత్రములో సమావేశము జేసితిమి. సత్రము గోడ లన్నియు గ్రంథాలయ ప్రచార పటములతో నింపివేయబడినవి. ఈసభ యొక్క ఫలితముగా గ్రంథాలయమును పునరుద్ధరణచేయుటయును, మిక్కిలి పలుకుబడి గలిగిన పెద్దలు - అనగా సహకారసంఘము యొక్క అధ్యక్షులు చెలా సుబ్బారాయుడు గారును, యూనియను బోర్డు అధ్యక్షులు మోటుపల్లి సీతారామయ్యగారును, రెవిన్యూ ఇన్‌స్పెక్టరు పసుపులేటి రామస్వామిగారును, తానేదారు మిరియాల వెంకటప్పయ్యగారును, పాఠశాల హెడ్మాష్టరు తాడిమేటి కృష్ణమూర్తిగారును, విశ్వనాథ లక్ష్మీనారాయణ బి. ఏ. యల్. టి. - మున్నగువా రందరును కార్యనిర్వాహకసంఘసభ్యులుగాను ఉద్యోగులుగాను ఏర్పడిరి. మరియు నెల 1కి రు 10లు చందాలు వేయబడినవి. సహకార సంఘము వారిచే తెప్పింపబడుచున్న ఆంధ్రపత్రిక, భారతి ఇచ్చెద మనిరి. ఈ గ్రంథాలయమునకు స్వంతభవనమును నిర్మించుటకుగూడ తగుప్రయత్నములు త్వరలోనే జరుగగలవు.

### యూనియనుబోర్డువారి విందు.

ఆకివీడు యూనియను బోర్డువారు యాత్రికులకు అల్పాహారవిందును గావించి, వందన సమర్పణమును గావించిరి. పిమ్మట సాయంకాలము 4 గంటలకు బయలుదేరి యాత్రికులు చెరుకుమిల్లి గ్రామమునకు పోయిరి. చెరుకుమిలిగ్రామమందు గ్రంథాలయమునకు చెరువుగట్టుమీద చక్కని స్వంత భవనము గలదు. గ్రంథాలయమునకు 400 గ్రంథములు గలవు. అగినన్ని పత్రికలుకూడ వచ్చుచున్నవి. గ్రంథాలయకార్యదర్శిగారగు దాట్ల బాపిరాజుగారి కొమారులు సుబ్బరాజుగారు మిక్కిలి ఉత్సాహవంతులగుయువకులు. వీరి యాజమాన్యమున ఈగ్రంథాలయము ఉత్సాహవంతముగ పనిచేయగలదు.

### చెఱుకుమిల్లి.

చెరుకుమిల్లిగ్రామము వచ్చుసరికి రావుసాహెబు వత్యం భోగప్పశాస్త్రిలుగారు (పింఛనుపుచ్చుకొన్న డిప్యూటీకలెక్టరు)వచ్చి యాత్రికులతో చేరుకొనిరి. నేటివరకు అయ్యంకి వేంకటరమణయ్యగారును, తాడిమేటి కుటుంబశాస్త్రిగారును, సారయాత్రి

కులను యాత్రాస్థలములయందన్నింటియం దును ఉపన్యాసముల నిచ్చి జనులను ఉద్బోధించుచున్నారు. నేడు భోగప్పశాస్త్రులుగారు వచ్చుటతో కుటుంబశాస్త్రిగారు వెడలి పోవుట యాత్రికు గొప్పలోటు.

నాల్గవరోజు రాత్రి భోగప్పశాస్త్రులుగారు గ్రామస్థులకు గ్రంథాలయోద్యమమును గురించి గంభీరోపన్యాసము నిచ్చిరి. వారి యుపన్యాస మైనపిమ్మట మ. లక్ష్మినారాయణగారు మ్యాజిక్కు లాంతరుఉపన్యాసము నిచ్చిరి. అంతటితో నాటి కార్యక్రమము ముగిసినది.

అయిదవనాటి కార్యక్రమము:
కోనలపల్లి.

నేడు ఉదయమునకు యాత్రికులు కోనలపల్లిగ్రామము చేరిరి. ఈగ్రామమున గ్రంథాలయము 1931 వ సంవత్సరమున స్థాపింపబడినది. 200 గ్రంథములు గలవు. ఈగ్రంథాలయపక్షమున భజనసమాజము గలదు. యాత్రికులు భక్తనారాయణరాజుగారి భజనబృందముతో గ్రామమంతయు సంకీర్తన జేసిన పిమ్మట బహిరంగసభ జేసిరి. శ్రీ వత్యం భోగప్పశాస్త్రిగారు అధ్యక్షత వహించిరి. పలువురు ఉపన్యసించి గ్రంథాలయము నెడల గ్రామస్థులకు భక్తిని గలుగజేసిరి.

మధ్యాహ్నము 4 గంటలగునరికి యాత్రికులు కాళ్ల గ్రామమునకు చేరిరి. గ్రంథములు 300 గలవు. పత్రికలు 4 వచ్చుచున్నవి. పాఠశాలపిల్లలతో గూడ నగరసంకీర్తన జరిగిన పిమ్మట వత్యం భోగప్పశాస్త్రిగారు గ్రంథాలయోద్యమమును గూర్చి గంభీరోపన్యాసము నిచ్చిరి. అనంతరము రాత్రి లక్ష్మినారాయణగారు మాజిక్కులాంతరుతో ఉపన్యాసము నిచ్చిరి. అంతటితో నేటిసభ ముగిసినది.

ఆరవనాటి కార్యక్రమము: జక్కరం

నేటి ఉదయమునకు యాత్రికులు జక్కరం గ్రామమునకు దయచేసిరి. ఉదయముననే బహిరంగసభ జేసి, గ్రామస్థులను ఉద్బోధించిరి. ఈగ్రామమున పెద్దనామాత్య గ్రంథాలయము సుమారు నాలుగు సంవత్సరములక్రిందటనే పెట్టుటకు ఏర్పాటున్నను నేటివరకు ఆకార్యము నెరవేరలేదు. యాత్రికులు వచ్చిన సందర్భమును పురస్కరించుకొని, ఈగ్రామమునగల పంచాయతీబోర్డువారు ఈగ్రంథాలయమును నేడు స్థాపించ సమకట్టుట ఎంతయు శుభావహము. ఈపంచాయతీ అధ్యక్షులు సంద్యాల వెంకట్రామరాజుగారును, ఇక్కడనున్నడాక్టరు కలిదిండి సుబ్బరాజుగారును, వేగేశిన సుబ్బరాజుగారు అను యువకులును ఈగ్రంథాలయమును ప్రారంభించుటకు తగినఏర్పాటు లన్నింటిని మిక్కిలి భక్తిశ్రద్ధలతో జేసిరి. 600 గ్రంథములు, ఒక బీరువా, ఒక స్వంతభవనము - ఇవి అన్నియు గ్రంథాలయ ప్రారంభసమయమునకే సమకూడుట మిక్కిలి సంతోషావహము. గ్రంథాలయ ప్రారంభోత్సవమును రావుసాహేబు వత్యం భోగప్పశాస్త్రులుగారు జరిపిరి. ప్రథమమున గ్రామఘోషతో సభ్యులను రంజింపజేసిన పిమ్మట శ్రీ భోగప్పశాస్త్రిగారు గంభీరోపన్యాసము నిచ్చిరి. వారి యుపన్యాసమైనపిమ్మట అయ్యంకి వేంకటరమణయ్యగారు గ్రంథాలయ ధర్మములనుగూర్చి విపులముగా ముచ్చటించిరి. గ్రంథాలయ భవనమంతయు గ్రంథాలయ ప్రదర్శన పటములతో నలంకరింపబడినది. శ్రీ భోగప్పశాస్త్రులుగారు గ్రంథాలయమును తెరచిన పిమ్మట లక్ష్మినారాయణగారు మ్యాజిక్కులాంతరు ఉపన్యాసము నిచ్చిరి.

### కోపల్లె.

పిమ్మట యాత్రికులు మధ్యాహ్నము మూడు గంటలకు బయలుదేరి కోపల్లె గ్రామమునకు బోయిరి. ఇక్కడికి నలుబది సంవత్సరములకు బూర్వమే ఈ తాలూకాయందును యీ జిల్లాయందునుగూడ, గ్రంథాలయోద్యమమునందేగాక, రాజకీయము నందును ఇంకను దేశాభివృద్ధికరములగు సకలోద్యమములందునుగూడ పాటుబడి సుమారు ఆరుసంవత్సరములకు పూర్వము పరమపదించిన శ్రీ కాళ్ళకూరి నరసింహంగారి దీయూరు. శ్రీ నరసింహంగారును, భూపతిరాజు తిరుపతిరాజుగారును, ఇంగ్లీషువాసన బొత్తిగా లేనివారు. నలుబది సంవత్సరములకు పూర్వము గ్రంథముల ప్రచారముగాని, పత్రికల ప్రచారముగాని లేనప్పుడు, సరస్వతీదేవి వారికి ప్రత్యక్షమై గ్రంథాలయోద్యమ ప్రచారమును చేయుమని ఆజ్ఞాపించినది. అందుకు ఫలితముగ ఈ తాలూకాయందా దినములలో అయిదారు గ్రంథాలయములను స్థాపించినారు. అప్పుడు స్థాపింపబడిన వాటిలో కోపల్లె గ్రంథాలయ మొకటి. ఈ గ్రంథాలయమునకు గొప్పభవనము నొకదానిని నరసింహంగారే కట్టించిరి. కాని జరుగవలసినంతయభివృద్ధి నొందలేదు. యాత్రికులు భక్త నారాయణరాజుగారి భజనబృందముతో గూడ ఊరంతయు ఊరేగి, గ్రంథాలయమందిరమున వత్యం భోగప్పశాస్త్రిగారి అధ్యక్షత క్రింద బహిరంగసభ నేర్పరచిరి. గ్రంథాలయమందు ప్రదర్శన మేర్పరచబడినది. అయ్యంకి వేంకటరమణయ్యగారును మరికొందరును ఉపన్యాసముల నొసంగినపిమ్మట గ్రంథాలయమునకు క్రొత్త కార్యనిర్వాహకుల ఎన్నిక జరిగినది. మరియు సాలునకు ముప్పది రూపాయల చందాలు వేయబడినవి. రాత్రి భోజనములైనపిమ్మట లక్ష్మీనారాయణగారిచే మ్యాజిక్కులాంతరుఉపన్యాస మియ్యబడినది. అంతటితో నేటి కార్యక్రమము ముగిసినది.

ఏడవదినము కార్యక్రమము:

### వేంపాడు.

7 వ తేదీ ఉదయ మగుసరికి యాత్రికులు వేంపాడుగ్రామము చేరిరి. కోపల్లెనుండి ఈ రోజు ఉదయముననే శ్రీ వత్యం భోగప్పశాస్త్రిలుగారు వెడలిపోయిరి.

ఈగ్రామము చాల చిన్నగ్రామము. ఇక్కడ ఒక సంవత్సరమునకు పూర్వమే గణపతి గ్రంథాలయము స్థాపింపబడినది. ఇందు 98 గ్రంథములు గలవు. క్రిందటి సంవత్సరము ఆదాయము, రు 19 లు. వ్యయము రు 15 లు. కృష్ణా, ఆంధ్రపత్రికలు రెండును వచ్చుచున్నవి. శ్రీభూపతిరాజు తిరుపతిరాజుగారి అధ్యక్షతక్రింద ఈ గ్రంథాలయముయొక్క ప్రథమవార్షికోత్సవము జరిగినది. భక్త నారాయణరాజుగారియొక్క భజనబృందముతో యాత్రికులు ఊరంతయు చుట్టివచ్చి సభాభవనమును ప్రవేశించిరి. సభామందిరమంతయు ప్రదర్శనపటములతో నలంకరింపబడినది. శ్రీయుత అయ్యంకి వేంకటరమణయ్యగారును, మరికొందరును ఉపన్యసించినపిమ్మట సంవత్సరమునకు రు 16 లు చందాలు వేయబడినవి. మధ్యాహ్నభోజనము లైనపిమ్మట గ్రామఫోనుతో గ్రామస్థులకు కచ్చేరీ జరిగెను. పిమ్మట నరసింహదేవర సత్యనారాయణగారి శిష్యులు మ్యాజిక్కులాంతరు ఉపన్యాస మిచ్చిరి.

### చిన అమిరం.

అనంతరము మధ్యాహ్నం 4 గంటలగు

వరికి యాత్రికులు చినఅమిరంగ్రామమును ప్రవేశింపగా గ్రామస్థులు భజనతో వారిని ఎదుర్కొని గ్రామమంతయు ఊరేగించి, గ్రంథాలయమందిరమందు ప్రవేశపెట్టిరి. ఈ గ్రామమందు గంగేశ్వరానంద యోగిగారిచే ప్రోత్సహింపబడి గ్రంథాలయమునకు స్వంతభవనమును కట్టిరి. గ్రంథాలయమందు 250 గ్రంథములు గలవు. 60 మంది సభ్యులు గతసాలునకు రు 30 లు చందాల నిచ్చిరి. సంవత్సరముపొడుగునను ప్రతివారమునను ఒక్కొక్కరి యాజమాన్యముక్రింద గ్రంథాలయమందు భజనలు చేయుటకై భజన సమాజము నొకదానిని ఏర్పాటుచేసిరి. రాత్రిపాఠశాలయందు 30 మంది విద్యాభ్యాసమును జేయుచున్నారు. శ్రీ గంగేశ్వరానంద స్వామివారి నామముననే ఈ గ్రంథాలయము వెలయుచున్నది. శ్రీవారు నాలుగు. వేదాంత గ్రంథములను అచ్చు వేయించి గ్రంథాలయమునకు ఇచ్చినారు. మరియు గ్రంథాలయకార్యదర్శి సాగి వెంకట్రామరాజుగారు జ్ఞానానందబోధన యను గ్రంథమును, అల్లూరి సుబ్బరాజుగారు పతివ్రతాధర్మచరిత్ర అను గ్రంథమును రచియించి, గ్రంథాలయమునకు ఒసంగియున్నారు.

గ్రంథాలయ ఆవరణయందు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారి అధ్యక్షత క్రింద బహిరంగసభ జరిగెను. శ్రీ భూపతిరాజు తిరుపతిరాజుగారును, ఇంకను పలువురును ఉపన్యసించినపిమ్మట గ్రామఫోను వినిపింపబడెను. రాత్రి భోజనములైనపిమ్మట లక్ష్మీనారాయణగారు మ్యాజిక్కులాంతరు ఉపన్యాసమొసంగిరి. ఇంతటితో నేటి కార్యక్రమము ముగిసెను.

ఎనిమిదవనాటి కార్యక్రమము:

పెదఅమిరం.

నేటియుదయమునకు యాత్రికులు పెదఅమిరం గ్రామమునకు విచ్చేసిరి. ఈగ్రామము పంచాయతీబోర్డుయొక్క పరిపాలన క్రింద ఆదర్శగ్రామముగ తయారుచేయబడియున్నది. పంచాయతీ అధ్యక్షులగు ముదిండి లక్ష్మీనరసింహరాజుగారి యొక్క పట్టుదలశ్రద్ధలే దీనికంతకును కారణము. 1933 వ సంవత్సరము జూను నెలయం దీగ్రామమున అధ్యక్షులచే పద్మనాభగ్రంథాలయము స్థాపింపబడినది. ఇది పంచాయితీ బోర్డువారిచేతనే నిర్వహింపబడుచున్నది. ఇందు 150 గ్రంథములు గలవు. ఆంధ్రదినపత్రిక, ఇంకను 10 ఇతరపత్రికలు వచ్చుచున్నవి. యాత్రికులు శ్రీగంగేశ్వరానందస్వామివారియొక్కయు, కొత్తపల్లి నారాయణరాజుగారి యొక్కయు భజనబృందములతో నగరసంకీర్తన గావింపబడినపిమ్మట చెరువుగట్టుననున్న అశ్వత్థవృక్షముక్రింద బహిరంగసభను జేసిరి. భూపతిరాజు తిరుపతిరాజుగారును, అయ్యంకి వేంకటరమణయ్యగారును ఉపన్యసించినపిమ్మట, గ్రంథాలయమందు గ్రామస్థులందరును సభ్యులుగ చేరి, సంవత్సరమునకు 40 రూపాయలచందాలను వేసిరి. మధ్యాహ్నము భోజనము లయినపిమ్మట గ్రామఫోనుసంగీతము వినిపింపబడినది. అనంతరము లక్ష్మీనారాయణగారు మాజిక్కులాంతరుఉపన్యాసము నొసంగిరి. ఇచటి గ్రంథాలయమును దేవాలయమునకు ముందున్న సావడిలో ఒక గదియం దుంచినారు.

సంచారగ్రంథాలయశకటము.

పెదఅమిరంపంచాయతీఅధ్యక్షులగు ముదిండి లక్ష్మీనరసింహరాజుగారు తమ గ్రామ

మందున్న గ్రంథాలయమందలి గ్రంథములను పత్రికలను గ్రామస్థులకు కొనిపోవుటకుగాను ఒక మనిషి తీసికొనిపోవుటకు అనువుగానుండు బండి నొకదానిని తయారు చేయించినారు. యాత్రికులు వచ్చిన సందర్భమున ఈ శకటమును బహిర్గతము చేయించి, దానిని గ్రామమంతయు ఊరేగించి ప్రచారమును ప్రారంభించినారు. దీనివలన గ్రామస్థులయందు చదువవలయు ననెడి అభిలాష నిరంతరాభివృద్ధి కాగలదు.

వాండ్రము.

యాత్రికులు పెదఅమిరమునుండి మధ్యాహ్నము 3 గంటలకు బయలుదేరి వాండ్రమునకు విచ్చేసిరి. వాండ్రమునందు క్రిందటి సంవత్సరము జూను నెలయందు శారదానిలయ గ్రంథాలయము స్థాపింపబడినది. అరవైమంది సభ్యులవలన 34 రూపాయలు చందాలు వసూలైనవి. కొంతకాలము ఆంధ్రదినపత్రికను సహకారసంఘమువారు తెప్పించి యిచ్చిరి. గ్రంథాలయమును దేవాలయము యొక్క సావిడియందు గదిలో ఉంచిరి.

ఈ గ్రంథాలయముయొక్క ప్రథమ వార్షికోత్సవము నేడు సాయంకాలము 4 గంటలకు తాలూకా గ్రంథాలయ సంఘకార్యదర్శిగారగు శ్రీ ముదిండి లక్ష్మీనరసింహరాజుగారి అధ్యక్షతక్రింద జరిగినది. ఈ వార్షికోత్సవసమయమునకు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు వచ్చి యాత్రికులతో జేరిరి. వార్షికోత్సవసమయమున శ్రీ గోపాలకృష్ణయ్యగారు, అయ్యంకి వేంకటరమణయ్యగారు, భూపతిరాజు తిరుపతిరాజుగారు, క. రామరాజుగారు, ఇందుకూరి సోమరాజుగారు, కొత్తపల్లి నారాయణరాజుగారు, వివిధ విషయములనుగూర్చి ఉపన్యాసము లిచ్చిరి. అనంతరము సహకారసంఘమువారు ఆంధ్రపత్రికను భారతిని తెప్పించుటకుగాను రు 24 లను ఇచ్చెదమని వాగ్దానము జేసిరి. ఇదివరలో చేరినవారుగాక కొత్తవారు కొంతమంది సభ్యులుగ చేరిరి.

నేటిరాత్రి భక్త నారాయణరాజుగారు ఈ గ్రామమందు నూతనముగా భజన సమాజము నొకదానిని స్థాపించిరి. ఇంతటితో నీరోజు కార్యక్రమము పూర్తియైనది.

మరు ఉదయముననే బయలుదేరి యాత్రికులు పెదపుల్లేరు గ్రామమునకు బోయిరి.

తొమ్మిదవదినకార్యక్రమము:

పెదపుల్లేరు.

తొమ్మిదవ తేదీ ఉదయమునకు యాత్రికులు పెదపుల్లేరుగ్రామముచేరిరి. ఈగ్రామము ఆకివీడు, ఉండి, మొదలగు పట్టణముల మర్యాదను బోలియున్నది. పల్లెటూరు లక్షణములు తక్కువ; సంపన్నులగుక్షత్రియపుంగవు లెక్కువ. 1933 సంవత్సరము ఫిబ్రవరి నెల 5 వ తేదీన సీతారామాంజనేయగ్రంథాలయ మను పేర గ్రంథాలయమును స్థాపించిరి. ఈగ్రంథాలయమునకు సాలునకు నూరురూపాయల చందాలను వేసిరి. అందు రు 52 లు వసూలైనవి. రు 30 లు నిలువయున్నవి. అయితే పుస్తకాలను ఉపయోగించడానికి గ్రంథాలయమును అభివృద్ధిచేయుటకు తగిన సావకాశమువృద్ధులకు లేదుగదా-యువకులకు అసలేలేదు. వారు ఎల్లప్పుడు పేకాట చదరంగపు ఆటలలో నిమగ్నులయి యుండెదరు. ఈకారణముచేతనేయీగ్రామమందలి గ్రంథాలయముకూడ సరిగా పనిచేయుటలేదు. యాత్రికులు గ్రామమునకుబోయి అడుగగా, మాకు సొమ్మునకు లోటులేదుగాని, పనిచేయువారు లేరు. అందుచేత మాగ్రంథాలయము పని

చేయుటలేదని చెప్పిరి. అందుమీద యాత్రికులు నిరుత్సాహులుగాక, భక్త నారాయణరాజుగారి భజనబృందముతోగూడ నగరసంకీర్తనజేసి బహిరంగసభ నేర్పాటు చేసి, గ్రామములోని పెద్దలను రావించిరి. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు అధ్యక్షత వహించిరి. శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు భూపతిరాజు తిరుపతిరాజుగారు, అల్లూరి సుబ్బరాజుగారు, ఇందుకూరి సోమరాజుగారు ఉద్బోధనము జేసినపిమ్మట, సభలోనుండి తొమ్మండుగురుయువకులులేచి "మేము ఇంతటినుండి చీట్లపేకలుగాని, చదరంగమునుగాని ఆడము. ఇంతటినుండిగ్రంథాలయమునకు పాటు బడెదము." అని దీక్ష వహించిరి. ఈదీక్షతో ఈగ్రంథాలయము యొక్కగీత బైటబడినది. గ్రంథాలయము పునరుద్ధరింపబడినది. క్రొత్తకార్య నిర్వాహక సంఘమును ఎన్నుకొనిరి. ఆంధ్రదిన పత్రికను ఒకబీరువాను తెప్పించుటకై తీర్మానములను గావించిరి. గ్రంథాలయ ప్రదర్శనముకూడ చూపబడినది.

### కోలమూరు.

యాత్రికులు మధ్యాహ్నము బయలుదేరి సాయంకాలము 6 గంటలగునరికి కోలమూరు గ్రామము చేరిరి. ఈగ్రామమందు నాలుగు సంవత్సరములక్రిందట గ్రంథాలయము నిర్మింపబడినది. గ్రామ ఉమ్మడిసొమ్ములోనుంచి రు 1241-7-0 లు ఖర్చుపెట్టి, గ్రామమునకు మధ్యగానుండు స్థలమున చక్కనిభవనమును నిర్మించిరి. ఇవిగాక రు 57-1-0 ఖర్చుపెట్టి 36 గ్రంథములను కొనిరి. రు 90-9-0 లు విలువగల 124 గ్రంథములను ఇతరులు ఇచ్చిరి. గ్రామ ఉమ్మడి సొమ్ములోనుండి ఆంధ్రదినపత్రిక తెప్పింపబడుచున్నది. వర పత్రిసంఘమువారు ఆంధ్రదినపత్రికను కొన్ని దినములు తెప్పించియిచ్చినారు. ఇప్పుడు భారతిని తెప్పించి యిచ్చుచున్నారు. ఇవిగాక కృష్ణదివ్యజ్ఞానపత్రికలు తెప్పింపబడుచున్నవి. ఈగ్రంథాలయమందు 85 గురు సభ్యులు ఉన్నారు. గ్రంథాలయము చక్కగా పనిచేయుచున్నది. గ్రంథాలయమునకు శాఖగా భజనసమాజము గలదు. ఇదిగాక హిందీభాషాభివృద్ధికూడ జేయబడుచున్నది.

నేటి సాయంకాలము యాత్రికులు భక్త నారాయణరాజుగారి భజనబృందముతో గ్రామమంతయు ఊరేగి గ్రంథాలయమునకు విచ్చేసిరి. గ్రంథాలయ ప్రథమవార్షికోత్సవము శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారి అధ్యక్షతక్రింద జరిగినది. వేంకటరమణయ్యగారి సేవ నుగ్గడించుచు స్వాగతపత్రము నర్పించిరి. అధ్యక్షుల ప్రారంభోపన్యాసము గావింపబడిన పిమ్మట, వావిలాల గోపాలకృష్ణయ్యగారు, భూపతిరాజు తిరుపతిరాజుగారు, మందలపర్తి ఉపేంద్రుడుగారు గ్రంథాలయము ఉపకరింపదగిన వివిధ దశలను గూర్చి ఉపన్యాసము లిచ్చిరి. అంతటితో వార్షికోత్సవము ముగిసినది. రాత్రి లక్ష్మీనారాయణగారు మ్యాజిక్కులాంతరు ఉపన్యాస మిచ్చిరి.

### పదియవ దిన కార్యక్రమము:

### పాందువ్వ

నేటియుదయము యాత్రికులు పాందువ్వ గ్రామమునకు దయచేసిరి. ఈగ్రామమందు 1928 వ సంవత్సరము ఫిబ్రవరి నెలయందు శ్రీరామ సుబ్బరాజేంద్ర గ్రంథాలయము స్థాపింపబడినది. దీనికి రు 2000 ఖర్చుజేసి స్వంతభవనమునుకట్టించియిచ్చిరి. ఒక్కొక్కరు రు 16 లు చొప్పున ఇచ్చి 17గురు శాశ్వత

సభ్యులుగా చేరిరి. వీరివలన వసూలైన సొమ్ము రు 660 లు శాశ్వతనిధిగా నున్నది. దీనిమీద రు 72 లు వడ్డీ ప్రతిసాలున వచ్చుచున్నది. ఆ సొమ్ముపెట్టి గ్రంథాలయమును నిర్వహించుచున్నారు. ఇందు రు 450 లు విలువగల 480 గ్రంథము లున్నవి. ఈ గ్రంథాలయభవనమునకు మంతెన పుల్లంరాజుగారు 1000 లు సహాయము చేసిరి. మరియు వారు ద్రవ్యసహాయమును చేయుటయే గాక నిత్యమును గ్రంథాలయమందుండి గ్రంథాలయసేవ జేయుచుందురు; వీరు తమకొమారునిగూడ గ్రంథాలయ సేవకై తయారు జేయుచున్నారు. ఈ గ్రంథాలయమును ప్రజలు ఎక్కువగా ఉపయోగించుచున్నారు. ఈ గ్రంథాలయాభివృద్ధి కంతకును వేగేశిన సూరపరాజుగారు జీవగఱ్ఱ. వీరిపట్టుదల, కార్యదీక్ష కడుంగడు ప్రశంసనీయములు. ఈ గ్రంథాలయమునందే గ్రామపంచాయతీఆఫీసును ఉంచెదరు. మరియు భజనసమాజము నిర్వహింపబడుచున్నది.

యాత్రికులు ఈగ్రంథాలయమందు బహిరంగసభ జేసి, గ్రామస్థులకు గ్రంథాలయము నిర్వహింపవలసిన ధర్మములనుగురించి బోధించి, గ్రంథాలయప్రదర్శనమును జూపి, ఉదయము 11 గంటలకు బయలుదేరి ఉప్పులూరు గ్రామమునకు బోయిరి.

## ఉప్పులూరు.

ఉప్పులూరునందు ఇదివరకు ఒక హోము లైబ్రరీ 1925 సంవత్సరమునుండియు గలదు. కాని, గ్రామస్థు లందరిచే నిర్వహింపబడు గ్రంథాలయము లేదు. యాత్రికులు భక్త నారాయణరాజుగారి భజనబృందముతో గ్రామమంతయు సంకీర్తనజేసి, పాఠశాలయందు బహిరంగసభను గావించిరి. గ్రంథాలయ ప్రదర్శనము పాఠశాలవరండాయందు అలంకరింపబడినది. ఈ సభకు అయ్యంకి వేంకటరమణయ్యగారు అధ్యక్షత వహించిరి. వారి అధ్యక్షకోపన్యాసమైన పిమ్మట, వావిలాల గోపాలకృష్ణయ్యగారు గ్రంథాలయ ధర్మములనుగూర్చి బోధింపగా, ఉప్పులూరునందు ధర్మగ్రంథాలయమేర్పడి, గ్రంథాలయమునకు కార్యనిర్వాహకసంఘము ఎన్నుకొనబడినది. గ్రామపంచాయితీ ప్రెసిడెంటుగా రగు గంధం రామారావుగారు కార్యదర్శిగా ఎన్నుకోబడిరి. గంధం వెంకట్రామయ్యగారు, యర్రా శ్రీరాములుగారు, యర్రా రామావతారంగారు, యర్రా కేశవరావుగారు లేచి తాము పేకాట చదరంగములను మానివేసి యథాశక్తిని గ్రంథాలయ సేవకై పాటుపడెదమని దీక్ష కైకొనిరి. పంచాయతీవారు ఆంధ్రపత్రికను, గంధం రామారావుగారు కృష్ణాపత్రికను, యర్రా సూర్యారావుగారు సమదర్శనిపత్రికను, హిందీప్రేమీసంఘము వారు విశ్వామిత్ర, వానర, ప్రచారక్ పత్రికలను ఇచ్చెదమని వాగ్దానము చేసిరి. పంచాయితీ ప్రెసిడెంటుగారు యాత్రికులందరికిని, ఇతర గ్రామాదులనుండి వచ్చిన ప్రతినిధులకును అల్పాహారవిందును గావించిరి. అనంతరము ప్రతినిధులు మధ్యాహ్నమున నాలుగుగంటలకు బయలుదేరి వుణుదుర్రుగ్రామము వెడలిరి.

## వుణుదుర్రు.

వుణుదుర్రు చేరునరికి సాయంకాలమయ్యెను. యాత్రికులు ఊరంతయు భజనతో సంకీర్తనము చేసినవారై పాఠశాలభవనమునందు బహిరంగ సమావేశము చేసిరి. అయ్యంకి వేంకట రమణయ్యగారు అధ్యక్షత వహించి ప్రారంభోపన్యాసము

నిచ్చిన పిమ్మట, వావిలాల గోపాలకృష్ణయ్య గారు గ్రంథాలయసేవనుగూర్చి గంభీరోపన్యాసము నిచ్చిరి. ఏతత్ఫలితముగ అదివరకు కొంతకాలముక్రిందట ఏర్పడి తీసివేయబడిన శ్రీగాంధి గ్రంథాలయము పునరుద్ధరింపబడినది. సహకారసంఘాధ్యక్షులు ఆంధ్రపత్రికను తెప్పించెదమని వాగ్దానము జేసిరి. కూనపరాజు వెంకట సుబ్బరాజుగారు కార్యదర్శిగ నేర్పడిరి. దాట్ల సూర్యనారాయణ రాజుగారు గ్రంథాలయమునకు పనిచేసెదమని వాగ్దానము జేసిరి. పిమ్మట లక్ష్మీనారాయణగారు మ్యాజిక్కులాంతరుఉపన్యాసము నిచ్చిరి. అంతటితో నేటి కార్యక్రమము ముగింపబడినది.

## పదునొకండవదిన కార్యక్రమము:

### యండగండి.

పదునొకండవ తేదీ ఉదయమున యాత్రికులు బయలు దేరి యండగండిగ్రామము చేరిరి. ఈ గ్రామమందు 1898 సంవత్సరముననే బాలసమాజమను గ్రంథాలయమును స్థాపించిరి. కొంతకాలము పనిజేసి అది ఆగిపోయెను. తర్వాత 1916 వ సంవత్సరమున గోపాలకృష్ణ గోఖలే గ్రంథాలయమును స్థాపించిరి. కొంతకాలమైన పిమ్మట అదియు అంతరించెను. పిమ్మట 1928 సంవత్సరమున కో ఆపరేటివు సంఘమువారును పంచాయతీ వారును కలసి ఒక గ్రంథాలయమును స్థాపించిరి. పిమ్మట అవియు విడిపోయెను. ఇపుడు సహకార గ్రంథాలయమునకుమాత్రము ఆంధ్ర దినపత్రిక వచ్చుచున్నది. పంచాయితీ గ్రంథాలయమునకు పత్రిక లేమియు వచ్చుటలేదు.

యాత్రికుల రాకకు ముందుగా గ్రామమంతయు తిరిగి గ్రామప్రముఖులతో సంప్రదింపులు చేసిరి. పిమ్మట ఉదయము 10 గంటలకు నగరసంకీర్తనజేసి, పాఠశాలయందు బహిరంగసభ నేర్పాటుచేసిరి. ప్రదర్శనపటములు గోడలకు వ్రేలాడగట్టబడినవి. సభకు అయ్యంకి వెంకటరమణయ్యగారు అధ్యక్షత వహించిరి. వావిలాల గోపాలకృష్ణయ్యగారు, భూపతిరాజు తిరుపతిరాజుగారు, వేగేశిన నారపరాజుగారు, అల్లూరి సుబ్బరాజుగారును గ్రంథాలయోద్యమముయొక్క ఆదర్శములనుగూర్చియు ఈ గ్రామమున అందరును కలసి మంచి గ్రంథాలయము నొకదానిని స్థాపించుటయొక్క అవశ్యకతనుగూర్చియు విపులముగా జెప్పిరి. అంతట, గోఖలే ధర్మగ్రంథాలయమును తిరిగి పునరుద్ధరించుటకు తీర్మానించి, కార్యనిర్వాహకసంఘము నేర్పరచిరి. పేరిచర్ల వెంకటాద్రిరాజు గారు అధ్యక్షులుగాను, యువకులగు పెనుమెత్స వెంకట సోమరాజుగారు కార్యదర్శిగాను ఏర్పడిరి. కో ఆపరేటివు సొసైటీ ప్రెసిడెంటుగారును, పంచాయతీ ప్రెసిడెంటుగారును గ్రంథాలయమునకు సహాయము చేసెదమని వాగ్దానము జేసిరి. ఆంధ్రదినపత్రికను సహకారసంఘమువారు ఇదివరకే తెప్పించుచున్నారు. దానిని కూడ గ్రంథాలయమున కిచ్చెదరు. ఊరిలో శివాలయమునకు వీథివైపున చావడివేయుచున్నారు. అందులో రెండుగదులుకూడ కట్టుచున్నారు. ఆగదులలో ఒకదానియందు గ్రంథాలయమును, రెండవ దానియందు భజనసమాజమును ఉంచెదరు. త్వరలోనే ఈగదులు తయారు కాగలవు.

### గరగపర్రు

యాత్రికులు మధ్యాహ్నము 2 గంటలకు బయలుదేరి గరగపర్రు గ్రామమునకు వెళ్లిరి. అచట చేరిన పిమ్మట గ్రామమంతయు భజనసమాజముతో నూరేగిరి. పిమ్మట లక్ష్మీనారాయణగారు గ్రామఫోను సంగీతమును వినిపించి మ్యాజిక్ లాంతరుపన్యాసము నిచ్చిరి. అనంతరము అయ్యంకి వేంకటరమణయ్యగారి అధ్యక్షతక్రింద బహిరంగసభ జరిగినది. వావిలాల గోపాలకృష్ణయ్యగారు గ్రంథాలయధర్మములనుగూర్చి వివరించినపిమ్మట 'ఆంధ్ర రత్న గ్రంథాలయ' మను నామముతో గ్రంథాలయము ప్రారంభింపబడినది. ఆంధ్రదినపత్రికను, కృష్ణాపత్రికను ఇదివరకే తెప్పించుచున్నారు. గ్రామములో బహిరంగ ప్రదేశమున గ్రంథాలయప్రదర్శనమును బహిరంగ పరచిరి.

## పండ్రెండవరోజు కార్యక్రమము:

### గొల్లలకోడేరు.

యాత్రికులు 12వ తేదీ ఉదయమునకు గొల్లలకోడేరు గ్రామమునకు విచ్చేసిరి. ఈగ్రామమందు గ్రంథాలయము పెట్టుటకుగూడ ఉపయోగముగా నుండులాగున పంచాయతీవారు 4 సంవత్సరములక్రిందట చక్కనిభవనమును నిర్మించిరి. అందు పంచాయతీకార్యస్థానమును సహకారసంఘముయొక్క కార్యస్థానమును ఉంచిరి. గ్రామమునసబుగారి కచ్చేరీగాకూడ ఉపయోగింపబడుచున్నది. తుదకు ఒక మాసము దినముల క్రిందట

పోతన గ్రంథాలయ మను నామమున గ్రంథాలయ మునుకూడ స్థాపించిరి. ఇందు 250 గ్రంథము లున్నవి. ఆంధ్రదినపత్రిక, భారతి, గృహలక్ష్మి, మొదలగు పత్రికలు తెప్పింపబడుచున్నవి. గ్రంథాలయముయొక్క పనులను పెనుమెత్స విజయరామరాజుగారు శ్రద్ధవహించి చేయుచున్నారు. యాత్రికులు, భక్తనారాయణరాజుగారి భక్తబృందమువారును నగరసంకీర్తనము జేసి గ్రంథాలయమునందు బహిరంగసభను జేసిరి. వావిలాల గోపాలకృష్ణయ్యగారు అధ్యక్షత వహించిరి. అయ్యంకి వేంకటరమణయ్యగారు, భూపతిరాజు తిరుపతిరాజుగారు, వేగేశిన సూరపరాజుగారు, ఇందుకూరి సోమరాజుగారు పాలకోడేటి వీర్రాజుగారు, గ్రంథాలయోద్యమ తత్త్వమునుగూర్చి విపులముగా జెప్పిరి. ఈగ్రంథాలయనిర్వహణమునకై పెనుమెత్స విజయరామరాజుగారును కమ్మెలి రామరాజుగారును ఇదివరకే పనిచేయుచున్నారు. ముందుకూడ పనిచేయుదుమని వాగ్దానము జేసిరి. గ్రంథాలయప్రదర్శనము యొక్క గ్రంథాలయము బయటిగోడలయందు ప్రదర్శింపబడినది. అనంతరము యాత్రికులు మధ్యాహ్నమున ఒంటిగంటకు బయలుదేరి పాలకోడేరు గ్రామమునకు బోయిరి.

## పాలకోడేరు.

పాలకోడేరు గ్రామమందు 1917 వ సంవత్సరమున రానడే గ్రంథాలయమును స్థాపించినారు. పిమ్మట భవననిర్మాణమునకు ప్రయత్నము చేయగా ఒక వెయ్యి రూపాయలను వాగ్దానముచేసి- ఆయిదువేల రూపాయలను భవననిర్మాణము చేయుటకును, ఒకవెయ్యిరూపాయలు శాశ్వతనిధికిని ఇచ్చినారు. దీనినిబట్టి ఈ గ్రామస్థులు వాఙ్మాత్రులు కారనియు కార్యశూరులనియు తెలియుచున్నది. ఈగ్రంథాలయమునకు విశాలమగు స్థలము, చక్కనిభవనము 1926 సంవత్సరమున కట్టబడినది. ఇందు 500 గ్రంథములు కలవు ఆంధ్రపత్రిక కృష్ణాపత్రికలు తెప్పింపబడుచున్నవి.

గ్రామస్థులు ఊరిబైటకు వచ్చి యాత్రికుల నెదుర్కొని భజనతో గ్రంథాలయభవనమునకు దీసికొనిపోయిరి. ఈ గ్రామమునగల రానడే గ్రంథాలయ వార్షికోత్సవము శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారి అధ్యక్షత క్రింద జరిగినది. అధ్యక్షోపన్యాసము అయినపిమ్మట కార్యదర్శి నివేదికను అర్పించిరి. తరువాత వావిలాల గోపాలకృష్ణయ్యగారు, కలిదిండి నరసింహరాజుగారు, పోడూరి జోగయ్యగారు, చెన్నాప్రగడ భానుమూర్తి గారు, కలిదిండి బంగార్రాజుగారు, పాలకోడేటి వీర్రాజు గారు, గ్రంథాలయోద్యమమునుగూర్చియు తదితరోద్యమములనుగూర్చియు ఉపన్యాసము లిచ్చిరి. అనంతరము తొమ్మిదిమంది యువకులు లేచి గ్రంథాలయాభివృద్ధికై పాటుబడెద మని దీక్ష గైకొనిరి. గ్రంథాలయప్రదర్శన పటములు గ్రంథాలయభవనమంతయు అలంకరింపబడెను. ఈ వార్షికోత్సవమునకు ఈ తాలూకాలో ఇతర గ్రామములనుండి నూరుమందిప్రతినిధులు విచ్చేసిరి. రాత్రి గ్రామఫోను సంగీతము వినిపింపబడుటయేగాక మ్యాజిక్కులాంతరు ఉపన్యాసముకూడ ఇయ్యబడెను.

## వేండ్ర.

యాత్రికులు 13వ తేదీ ఉదయమున బయలుదేరి వేండ్రకు చేరిరి. ఈ గ్రామమందు 18 1-1924 తేదీన శ్రీమ దాంధ్రవాల్మీకి సుబ్బరాయ గ్రంథాలయము స్థాపింపబడినది. కొంతకాలము సరిగా పనిచేసి నిద్రించినది. పిమ్మట తాలూకాలో బయలుదేరిన గ్రంథాలయోద్ధరణోద్యమఫలితముగ 7-9-33 తేదీన పునరుద్ధరింపబడినది. ఇందు రు 150 లు విలువగల 433 గ్రంథములు గలవు. నిలువసొమ్ము రు 140-2-9 లు గలదు. ఆంధ్రదినపత్రిక, భారతి, భక్తిప్రబోధిని పత్రికలు వచ్చుచున్నవి. ఈ గ్రంథాలయాభివృద్ధి కంతకును ఆధారము ఈ గ్రామమునకు నాయకాగ్రణియగు శ్రీ భూపతిరాజు సుబ్బరాజు గారు. వీరు ఈ గ్రంథాలయమునకు గ్రంథములలో చాలభాగము ఇచ్చుటయేగాక, ఆంధ్రదినపత్రికనుగూడ తెప్పించి యిచ్చుచున్నారు.

యాత్రికులు భక్తనారాయణదాసుగారి భజనబృందముతో నగరసంకీర్తన జేసిరి. పిమ్మట ఈ గ్రంథాలయ వార్షికోత్సవము శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారి అధ్యక్షతక్రింద జరిగినది. అధ్యక్షోపన్యాసమైనపిమ్మట భూపతిరాజు తిరుపతిరాజుగారు, కొండేపూడి వేంకటచలపతిరావుగారు, ఈమని తులయ్యగారు, మదునూరి రామరాజుగారు, భూపతిరాజు గోపాలరాజుగారు, కలిదిండి నరసింహరాజుగారు, వావిలాల గోపాలకృష్ణయ్యగారు, గ్రంథాలయోపయోగములనుగూర్చి విపులముగా ముచ్చటించిరి. అనంతరము మాజిక్కులాంతరు ఉపన్యాసమియ్యబడినది. గ్రంథాలయమునకు సంవత్సరమునకు రు 20 లు చందాలు వేయబడినవి.

## తోలేరు.

మధ్యాహ్నము 2 గంటలకు బయలుదేరి యాత్రికులు తోలేరుగ్రామమునకు బోయిరి. ఇక్కడ 29-3-31 తేదీన పంచాయతీవారు గ్రంథాలయమును స్థాపించినారు,

ఇందు రు 186-11-0 లు విలువగల 250 గ్రంథములు గలవు. యాత్రికులు భజనతో ఊరంతయు నూరేగి, గ్రంథాలయమునకు విచ్చేసిరి. అక్కడ పంచాయతీ అధ్యక్షులు యాత్రికులకు అల్పాహారవిందును గావించిరి. పిమ్మట వావిలాల గోపాలకృష్ణయ్యగారి అధ్యక్షత క్రింద బహిరంగసభ జరిగినది. భూపతిరాజు తిరుపతి రాజుగారు, కొండేపూడి వెంకటచలపతిరావుగారు, అయ్యంకి వెంకటరమణయ్యగారు గ్రంథాలయమును అభివృద్ధి చేయదగు మార్గములనుగూర్చి ముచ్చటించిరి. అనంతరము పంచాయతీఅధ్యక్షులు లేచి గ్రంథాలయాభివృద్ధికై పాలునకురు 30 లు పంచాయితీనుండి మంజూరు చేయించెద మని చెప్పిరి.

### తోలేరుపేట (సూరపరాజుపేట).

పిమ్మట యాత్రికులు సాయంకాలము 6 గంటలకు బయలుదేరి తోలేరుపేటకు బోయిరి. ఈ గ్రామము ఒక ఋషివాటికవలె మిక్కిలి ప్రకృతిరామణీయకమై యున్నది. ఇక్కడ ది 8-9-1933 తేదీన సూర్యరాజు గ్రంథాలయము ఏర్పడినది. ఇందు రు 150 లు విలువగల 350 గ్రంథములు కలవు. గతవత్సరమున 480 గ్రంథములు చదువబడినవి. ఆంధ్రవారపత్రిక, భక్తిప్రబోధిని, వినోదిని పత్రికలు తెప్పింపబడుచున్నవి. భజన సమాజము స్థాపింపబడినది. ఈ గ్రంథాలయమందు గ్రామములోగల 28 ఇంటియజమానులు సభ్యత్వము వహించియున్నారు.

ఈగ్రంథాలయముయొక్క ప్రథమవార్షికోత్సవము శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారియొక్క అధ్యక్షతక్రింద రాత్రి 9 గంటలకు జరిగినది. అధ్యక్షులు ప్రబోధ మొనర్చినపిమ్మట కార్యదర్శి నివేదిక నర్పించిరి. తరువాత వావిలాల గోపాలకృష్ణయ్యగారు, కొండేపూడి వెంకటచలపతిగారు, ఇందుకూరి సోమరాజుగారు, అల్లూరి సుబ్బరాజుగారు, ముదునూరి రామరాజుగారు, కలిదిండి నరసింహరాజుగారు గ్రంథాలయము ఉపకరింపదగిన వివిధదశలనుగూర్చి గంభీరోపన్యాసముల నిచ్చిరి. అంతటితో నేటికార్యక్రమము 12 గంటలకు ముగింపబడినది.

### పదునాలుగవరోజు కార్యక్రమము.

### కొండేపూడి.

నిన్నటిదినమున దైవవశాత్తును ప్రస్ఫుటించు నొక సందర్భము యాత్రికులకార్యక్రమమునందు సందర్భమైనది. వారిలో కొందరు వేంద్రగ్రామమునుండి బయలుదేరి తోలేరు వెళ్లుచు దారితప్పి కొండేపూడిగ్రామమునకుబోయిరి. అచట కాలవగట్టుమీదనున్నపుండి గ్రామములో గ్రంథాలయములేని కొరంతనుగూర్చి అచటచేరిన కొందరితో ముచ్చటించి, తోలేరు వెళ్లిపోయిరి. వీరు తోలేరు గ్రామమును వీడకపూర్వమే కొండేపూడినుండి వారికి ఆహ్వానము వచ్చినది. "మా గ్రామమున గ్రంథాలయమును పెట్టెదము. తాము దయచేసి దానిని తెరచి వెళ్ళకతప్పదు" అని బలవంతపెట్టిరి. దానిమీద యాత్రికులు అంగీకరించిరి. అందుచేత ఉదయమున చీకటితోనే బయలుదేరి కొండేపూడివెళ్లి నూతనగ్రంథాలయమును స్థాపనచేసిరి.

యాత్రికులు ముందుగా భజనతో గ్రామమంతయు ఊరేగిరి. పిమ్మట గ్రంథాలయ ప్రారంభోత్సవము శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారి అధ్యక్షతక్రింద జరిగినది. గ్రంథాలయమునకు 'బాలభారతీగ్రంథాలయ'మని పేరిడిరి. ఈ గ్రంథాలయమునకును, రామభజనగుడికిని కలిసి త్వరలోనే స్వంతభవనమును నిర్మించే ఏర్పాటులు జరిగినవి. భవననిర్మాణము నిమిత్తము తమ్మన చిట్టెయ్యగారు 250 గజముల స్థలమును ఉచితముగ నిచ్చిరి. గ్రంథాలయమునకు సంవత్సరమునకు రు 20 ల చందాలు వేయబడినవి. అవిగాక యాత్రికులను కొట్టిబలిజపేటకు తీసికొనిపోయి సంవత్సరమునకు రు 6 ల చందాలను వేసిరి.

### అండలూరు.

అక్కడనుండి యాత్రికులు మధ్యాహ్నభోజనమునకు అండలూరు వెళ్లిరి. అచట 12 గంటలకు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారి అధ్యక్షతక్రింద బహిరంగసభజరిగినది. అయ్యంకి వెంకటరమణయ్యగారు, కొండేపూడి చలపతిరావుగారు గ్రంథాలయముల ఉపయోగములనుగూర్చి ఉపన్యాసముల నిచ్చిరి. భజన సంకీర్తన, గ్రామఫోనుసంగీతము, మ్యాజిక్కులాంతరు ఉపన్యాసములు జరిగినవి.

ఈగ్రామమున రెండు గ్రంథాలయములు గలవు. వేణుగోపాలగ్రంథాలయము 1928 సంవత్సరములో ప్రారంభింపబడినది. ఈగ్రంథాలయమందు రు 80 లు విలువగల 187 గ్రంథములు గలవు. ఈగ్రంథాలయము కొంతకాలము అమ్మవారి గుడియందున్నది. పిమ్మట మేకా వెంకటాద్రియుడుగారి యింటికి మార్చబడినది. దీనిని ఇంతకన్న ఎక్కువగా ఆకర్షవంతము చేయుటకుగాను కో ఆపరేటివు సంఘకార్యస్థానమునకు మార్చిన మంచిదని యాత్రికులు ఆసంఘాధ్యక్షులను అడుగగా వారు అంగీకరించిరి. అందుమీద ఆగ్రంథాలయమును

అచటికి మార్చిరి. రెండవ గ్రంథాలయము ఈ సంవత్సరము జనవరి నెలయందు స్థాపింపబడినది. దీనిపేరు హిందూ యువజనసంఘ గ్రంథాలయము. ఇందు రు 50 లు విలువగల 150 గ్రంథములు గలవు. ఆంధ్ర వారపత్రిక, భారతి, వినోదిని, భక్తిప్రబోధిని పత్రికలు తెప్పింపబడుచున్నవి. పంచాయతీవారు ఈగ్రామమున గ్రంథాలయమునకు స్వంతభవనమును త్వరలోనే నిర్మించు ఏర్పాటులు చేసిరి. అప్పుడు ఈరెండు గ్రంథాలయములను ఒకటిగా కలుపుటకు సావకాశ మున్నది.

### నోడూరు

పిమ్మట మధ్యాహ్నము 2 గంటలకు బయలుదేరి యాత్రికులు నోడూరు గ్రామమునకు బోయిరి. ఈ గ్రామమం దిదివరకు గ్రంథాలయము లేదు. మా కార్యక్రమమందు ఈగ్రామమును చేర్చియుండలేదు. అయినను మార్గమధ్యమం దుండుటచేత ముందుగా భోజనబృందమువారు పోయి గ్రామస్థుల నందరిని ఒకచోట చేర్చిరి. పిమ్మట యాత్రికులు గ్రామస్థుల నుద్బోధించి, ఆ గ్రామమందు గల రామాలయమందు గ్రంథాలయమును స్థాపించుట కేర్పాటుజేసి, సాలునకు రు 15 ల చందాలను వేయించిరి.

### కోనితివాడ

సాయంత్రము 4 గంటలకు బయలుదేరి యాత్రికులు కోనితివాడ గ్రామమునకు బోయిరి. ఇచట యలకరాజు కనకరాజుగారను ఉదారహృదయులు, పరోపకారశీలురు గలరు. వీరు 1931 సంవత్సరమున రామకృష్ణసమాజమును స్థాపించి మోతీలాలు గ్రంథాలయమును ప్రారంభించిరి. దానికి స్వంతభవనముకూడ కొన్నారు. గ్రంథాలయమేగాక భక్తిదాయకములగు కార్యక్రమములను పెక్కింటి నీగ్రంథాలయమువారు నిర్వహించుచున్నారు. భజనసమాజము గలదు. 250 గ్రంథములు గలవు. దీనికి ఆంధ్ర, కృష్ణా, భక్తిప్రబోధిని పత్రికలు వచ్చుచున్నవి. యాత్రికులు రాగానే ముందుగా గ్రంథాలయభవనమును ప్రదర్శన పటములచే నలంకరించిరి. భోజనానంతరము మాజిక్కులాంతరుతో ఉపన్యాస మియ్యబడెను. అనంతరము గ్రంథాలయమందిరమందు శ్రీవావిలాల గోపాలకృష్ణయ్యగారి అధ్యక్షతక్రింద బహిరంగసభ జరుపబడి గ్రంథాలయప్రబోధ మొనరింపబడెను.

## పదునైదవరోజు కార్యక్రమము:

### రాయకుదురు.

ఈరోజు ఉదయమునకు యాత్రికులు రాయకుదురు గ్రామమునకు చేరుకొనిరి. ఈగ్రామమందు ప్రథమమున సుజనామోదినీ గ్రంథాలయము 1894 వ సంవత్సరమున స్థాపింపబడెను. ఇప్పుడు పంచాయతీవారిచే నడుపబడుచున్నది. 700 గ్రంథములు గలవు. సాలుకు రు 200 లు వెచ్చించబడుచున్నవి. ఆంధ్ర దినపత్రిక మొదలగునవి 10 పత్రికలు వచ్చుచున్నవి.

గ్రంథాలయ ప్రదర్శనము, గ్రామోఫోను సంగీతము, మ్యాజిక్కులాంతరు ఉపన్యాసము, బహిరంగ సభలను జేసి, యాత్రికులు సాయంకాలము 4 గంటలకు వీరవాసరగ్రామమును జేరిరి.

### వీరవాసరము.

ఇచట 1914 లో స్థాపింపబడినగ్రంథాలయముగలదు. దీనికి స్వంతభవనము, గ్రంథములు, బెంచీలు, బీరువాలు అన్నియునున్నవి. కాని పల్లెనివోటిలో కనియున్నట్లు వీనినన్నిటిని సమీకరణముచేయు శక్తిలేదు. కొంతకాలము కొంతమంది దీనిని చక్కగానే నడపుచుండిరి; వారు ఎందుకు నడపవలెను, మే మెందుకు నడపకూడదని మరి కొంతమందికి కలిగినది. మొదటివారినుండి రెండవవారికి సంక్రమించినది. అంతలో ఆర్థికదుస్థితి వచ్చినది. ఏమియు జరుగక మూలబడవైచిరి. గ్రామములో నున్న నాయకులతో మాట్లాడితిమి. గ్రంథాలయ పునరుద్ధరణకుగాను నవంబరునెలకు వాయిదావేసిరి. ఈసంచార కార్యక్రమమునందు వాయిదాపడినది ఈ ఒక్కగ్రామమునకే.

యాత్రికు లీగ్రామమున గ్రామోఫోను సంగీతమును వినిపించి, మాజిక్కు లాంతరు ఉపన్యాస మిచ్చిరి.

## పదునారవరోజు కార్యక్రమము:

### శృంగవృక్షము.

ఈరోజు ఉదయమునకు యాత్రికులు శృంగవృక్షగ్రామము చేరిరి. ఇక్కడ మొదట 1910 సంవత్సరమున గ్రంథాలయము స్థాపింపబడినది. 1916 సంవత్సరమున, 1929 సంవత్సరమున పునరుద్ధరింపబడినది. కాని చక్కగా పనిచేయుటలేదు. సహకార సంఘమువారు మాత్రము ఆంధ్రదినపత్రికను తెప్పించుచున్నారు. ఇందు 100 గ్రంథములు మాత్ర మున్నవి.

గ్రంథాలయపటములు ప్రదర్శింపబడినవి. రామాలయమున అయ్యంకి వేంకటరమణయ్యగారి అధ్యక్షతక్రింద బహిరంగసభ జరిగినది. పలువురచే గ్రంథాలయోద్యమాభివృద్ధినిగూర్చి ఉపన్యాసము లియ్యబడినవి. యాత్రికుల యొక్క ఉద్బోధన ఫలితముగా సహకార సంఘాధ్యక్షులు రు 300 లను, పంచాయతీబోర్డు అధ్యక్షులు రు 200 లును ఇప్పించెదమని చెప్పిరి. మరియు సహకార సంఘాధ్యక్షులు బీరువానుకూడ కొనియిచ్చెదమనిరి. పిమ్మట గ్రంథాలయమునకు వెంటనే భవననిర్మాణమును

చేయుటకు దీక్షాసంఘ మొకటి ఏర్పడినది. త్వరలోనే భవనము తయారుకావచ్చును.

## పెన్నాడ.

యాత్రికులను నేడు మధ్యాహ్నము శృంగవృక్షం కాపురస్థులు భజనతో తీసికొనిపోయి పెన్నాడ అగ్రహారమున దిగబెట్టిరి. యాత్రికులు ఊరంతయు భజనతో ఊరేగిరి. పిమ్మట అయ్యంకి వేంకట రమణయ్యగారి అధ్యక్షతక్రింద బహిరంగసభ జరిగినది. అప్పుడు యాత్రికులకు ఈ గ్రామమందలి సుబ్బరాయ స్మారక గ్రంథాలయ సభ్యులు స్వాగతపత్రమును సమర్పించిరి. పిమ్మట పోడూరి జోగయ్యగారు, వావిలాల గోపాలకృష్ణయ్యగారు మొదలగువారు గ్రంథాలయోపయోగములనుగూర్చి మాట్లాడిరి. అంతటితో సభ ముగిసెను. రాత్రి గ్రామోఫోను సంగీతము వినిపింపబడెను మాజికు లాంతరు ఉపన్యాసముకూడ ఇయ్యబడెను.

## పదునేడవరోజు కార్యక్రమము:

## గొరగనమూడి.

ఈరోజున ఉదయమున యాత్రికులు గొరగనమూడి వచ్చిరి. ఈయూరు కార్యక్రమమునందు చేర్చక పోయినను దారియందుండుటచే ఆగి గ్రంథాలయమును స్థాపింపవలసినదని ఉద్బోధన మొనరించి, గ్రామస్థులనందరిని చేర్చి వావిలాల గోపాలకృష్ణయ్యగారి అధ్యక్షత క్రింద బహిరంగసభ చేసిరి. సరస్వతీగ్రంథాలయమని నామకరణముచేసి అయ్యంకి వేంకటరమణయ్యగారు గ్రంథాలయమును ప్రారంభించిరి. నలువదిగ్రంథములు అప్పుడే ఇయ్యబడినవి. మరియు రు 27 ల చందాలుకూడ చేయబడినవి.

## విస్సాకోడేరు.

పిమ్మట యాత్రికులు బయలుదేరి విస్సాకోడేరు గ్రామమునకు వచ్చిరి. ఇచట బ్రహ్మానందదాయినీ గ్రంథాలయము 1-11-1923 తేదీన స్థాపింపబడినది. 740 గ్రంథములు గలవు. భజనసమాజముగలదు. గ్రంథాలయము తరఫున కొంతపాత్రసామాను కలదు. ఆ పాత్రసామాను ఎవరైని అతిథులు వచ్చిన వంటకు ఉచితముగ నిచ్చుచుండిరి. ఇచట గ్రంథాలయమందు ప్రదర్శన వస్తువులను ప్రదర్శించినపిమ్మట ఆ గ్రామమందలి గ్రంథాలయ సేవకులకు గ్రంథాలయధర్మమునుగూర్చి విపులముగా ముచ్చటించిరి. ఇక్కడ గ్రంథాలయమునకు స్వంతభవనమును నిర్మించుటకై తగు ప్రయత్నములను చేయుచు

యాత్రికులు మధ్యాహ్నము 1 గంటకు బయలుదేరి భీమవరం చేరిరి. ఇంతటితో యాత్రా కార్యక్రమ మంతయు ముగిసినది.

## అల్పాహారవిందు - బహిరంగసభ.

భీమవరమునందు డాక్టరు పాలకోడేటి సత్యనారాయణ శర్మగారు యాత్రికులకు అల్పాహారవిందును గావించి గౌరవించిరి. అనంతరము యాత్రికులను గౌరవించుటకు బహిరంగసభ గావింపబడినది. రిటైర్డు పోస్టల్ ఇన్స్పెక్టరు గాదె కామరాజుగారు అధ్యక్షతవహించిరి.

## యాత్రయొక్క ఫలితములు.

శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారు మాట్లాడుచు యాత్ర మిక్కిలి జయప్రదముగా జరిగినదనియు, యాత్రికులు ప్రతిచోటను గ్రంథాలయముల స్థితిని ఆదాయములను విజ్ఞానవ్యాప్తిపద్ధతులను అభివృద్ధి చేయుటయందు జయప్రదులయిరనియు, పనిచేయక నిలచిపోయిన నాలుగు గ్రంథాలయములను పునరుద్ధరించితిమనియు, 6 నూతన గ్రంథాలయములను స్థాపించితిమనియు 5 గ్రంథాలయములకు వార్షికోత్సవములను చేసితిమనియు, మొత్తము అన్ని గ్రంథాలయములయొక్క ఆదాయమునందు రు 800 లను అభివృద్ధి చేయగలిగితిమనియు, నూరుమంది యువకులు గ్రంథాలయసేవకు బద్ధకంకణులైరనియు, కొన్నిచోట్ల గ్రంథాలయములయందు ఐక్యభావము నభివృద్ధి చేయగలిగితిమనియు, మొత్తము 17½ రోజులలో 38 గ్రంథాలయములను దర్శింపగలిగితిమనియు 84 మైళ్ళదూరమును కాలినడకమీద నడచితిమనియు జెప్పిరి.

పిమ్మట వావిలాల గోపాలకృష్ణయ్యగారు మేధా గ్రంథాలయములనుగూర్చి విపులమైన ఉపన్యాసమిచ్చిరి.

అటుపై శ్రీయుత పోడూరి జోగయ్యగారు అధునికాభివృద్ధి విజ్ఞానసముపార్జనముపైననే ఆధారపడియున్నదనియు పవిత్రజీవితమునకు ప్రతివారును ప్రయత్నించవలయుననియు అందులకు గ్రంథాలయములే ఆధారభూతములనియు హెచ్చరించిరి.

చిట్టచివరకు శ్రీ కొండేపూడి వెంకటచలపతిరాజుగారును ప్రసంగించిరి.

అటుపైని అధ్యక్షుని అంత్యోపన్యాసముతోడను తాలూకా గ్రంథాలయసంఘముతరఫున ప్రచారముగావించిన యాత్రికులకు శ్రీ డాక్టరు పాలకోడేటి సత్యనారాయణశర్మగారి వందనసమర్పణముతోను సమాప్తి చేయబడెను.

శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య, భూపతిరాజు తిరుపతిరాజు, వావిలాల గోపాలకృష్ణయ్యగార్లు పెదనంద్రకొలనువారి ఆహ్వానముపై గ్రంథాలయప్రబోధ మొనర్చుటకచటికి సాయంత్రము 7 గంటలకు బయలుదేరి వెడలిరి. ఇంతటితో భీమవరంతాలూకా గ్రంథాలయ యాత్ర జయప్రదముగ ముగింపుచేయబడెను.

## యాత్రికుల వివరములు.

ఇంక యాత్రికులనుగూర్చి కొంత ముచ్చటించవలసియున్నది. యాత్రికులలో కెల్ల వృద్ధు భూపతిరాజు తిరుపతిరాజుగారు. డెబ్బదిసంవత్సరముల వయస్సుగల వీరు సరస్వతీదేవియొక్క ధ్వజమును బుజముమీద పెట్టుకొని తన సన్నని బక్కపలుచని దేహముతో పవిత్రవంతమైన దృక్కులతో ముగ్గుబుట్టవలె నెరసిన తలవెండ్రుకలతో - అడుగులు తప్పబడకుండ నడకయందు ఎగుడుదిగుడులు లేకుండ పడుచు కుర్రవానివలె నడచుట యాత్రికులయందేగాక, యాత్రపోవుచున్న గ్రామములయందుగూడ ఉత్సాహము నినుమడింపజేయుచుండిరి. ఈ తాలూకాలో వారి నెరుగనివారు లేరు. వెళ్ళినచోటనెల్ల ప్రతిఊరిలోను వారిని బాబుగారనియు, మామగారనియు, తాతగారనియు వరుసలతో బిలుచువారే. అందరును వారిని పరమ ఆప్తబంధువువలె ప్రేమించువారే. వచ్చినపనిని తెలిసికొని భక్తిశ్రద్ధలతో ఆపనిని పూర్తిజేసి పంపువారే. ఈయన చలిపిడుగు, ఆడంబరము లేదు. భయము లేదు. మోసము లేదు. ఊరక వర్షము కురియడమే. ఉద్రేకములేకుండా మాట్లాడుతారు. ప్రతిమాటవినేవారి హృదయములో నిశితముగా దూరవలసినదే.

తిరుపతిరాజుగారికి ప్రైవేటు సెక్రటరీ సుబ్బరాజుగారు గలరు. ముసలివారికి ముసలివారి తోడ్పాటు. సుబ్బరాజుగారిసలహా తోడ్పాటులేనిదే తిరుపతిరాజుగారికి ఒక్కయడుగు సాగదు.

అయ్యంకి వేంకటరమణయ్యగారు యాత్రికులకెల్ల నాయకుడు. యాత్రాసంసారమునకుయజమాని. ఎల్లప్పుడు జరుగుచున్న కార్యక్రమమును నడపుచుండును. ముందు కార్యక్రమమును సూచించుచుండును. సంసారమందు ఏయేవ్యక్తి ఏయేకార్యములను చేయవలెనో వారివారిచేత పనులను గైకొనుచుండును. అందరికిని తలలోని నాలుకవలె ఎవరికెటుల నచ్చచెప్పవలయునో అటుల చెప్పుచు సంసారచక్రమును నడపుచుండును.

ఈయన మిక్కిలి పట్టుదలగలవాడు. తాను తలచినది చేసినగాక విడిచిపోడు, పట్టుదల వదలడు. ఈయాత్ర ఆంధ్రదేశమున కంతకును మొదటిది. యాత్రికులు చేయుపని గ్రంథాలయోద్యమముయొక్క ఉద్బోధన మాత్రముకాదు. ఆ గ్రామమందు గ్రంథాలయము చక్కగా పనిజేయుచున్న సరియే. చక్కగా పనిచేయుచుండనియెడల సరిగా పనిచేయునటుల తగు ఏర్పాటులు జేసినారు. స్వరూపనాశనమైనచోట తిరిగి స్వరూపమును ఏర్పాటు చేసినారు. కొత్త గ్రంథాలయములను స్థాపించినారు. ప్రతిగ్రంథాలయమునందును సరస్వతీదేవికి పూజారులుగా యువకుల నుద్బోధించి ఏర్పాటుచేసినారు. ఈయనది మంకుపట్టు. తన ఆశయము నెరవేరనిచోట్ల దీనివలననే నెగ్గించుకొన్నారు. ఎక్కడికి వెళ్లినను జయమేగాని అపజయ మెంతమాత్రమును లేదు. వీరియుపన్యాసములు ఎంతవరకును అనుభవపూర్వకములై, ప్రతినిత్యమును గ్రంథాలయజీవితమునందు ఆచరణలో పెట్టదగినవైయుండును. మాటలసందర్భమున తనపనిని మరచిపోరు. వీరియొక్క ఓర్పును, నిపుణతను వర్ణించుటకు వీలులేదు; వీనిని పరీక్షించుసందర్భములనేకములు యాత్రాసందర్భమున తటస్థించినవి. అట్టి సందర్భములయందెల్ల వీరు చూపిన ఓర్పును, నిపుణతయును అద్భుతములు. మరియు వీరి త్యాగశక్తిని కూడ మరువదగినదిగాదు.

తాడిమేటి కుటుంబశాస్త్రిగారు—వీరు యువకులను ఆకర్షించి వారిచే పనిచేయించుటయందు కడు నేర్పరులు. కార్యోత్సాహమును, ఉద్రేకమును ఎల్లప్పుడును వెలిగ్రక్కుచుండును. వీరు మొదటి అయిదురోజులు మాత్రముండి అనారోగ్యముచే వెడలిపోయిరి.

రావుసాహేబు వత్యం భోగషుశాస్త్రిగారు—వీరియుపన్యాసములు గంగానది ప్రవాహముమాదిరిగా తీవ్రవేగముతో ప్రవహించుచు జనులందరిని తనప్రవాహమున ముంచి తేలనెత్తుచుండును. వీరు మూడుదినములు మాత్రము యాత్రికులతో ఉండగలిగినారు.

కొత్తపల్లి నారాయణరాజుగారు—వీరు పాలకోడేరు గ్రామమందున్న నారాయణత్రయమునం దొకరు. (నారాయణత్రయమనగా సంగీతపు నారాయణరాజుగారు, పురాణపు నారాయణరాజుగారు, తరంగాల నారాయణరాజుగారు.) ఇందులో వీరు తరంగాల నారాయణరాజుగారు. వీరును వీరిభజనబృందమువారును యాత్రికులతో ఎల్లప్పుడును ఉండి, అసలుయాత్రను సాధ్యము చేసిరి. వీరు యాత్రకు జీవిక. వీరులేనిది యాత్రయొక్క జ్ఞానప్రబోధమే లేదు, ఆకర్షణయే లేదు. వీరు నిజమైన భక్తవర్యులు. వీరు భజనచేయునప్పుడు వారు భక్తిపారవశ్యులై, వినువారందరిని భక్తిపారవశ్యులుగా జేసివైచెదరు. ఎంతసేపు భజనచేసినను వీరికి విసుగు ఎంత

మాత్రము లేదు. వీరియొక్క తోడ్పాటు అమూల్యము.

వావిలాల గోపాలకృష్ణయ్యగారు వీరు 8వ తేదీన నాంధ్రమహాసభకు వచ్చి కలసికొనిరి. వీరు వ్యగ్రోత్సాహులు వీరు ఏవిషయముమీదనైనను నిరర్గళముగా చక్కనిశైలిని మిక్కిలి ఆకర్షవంతముగా ఉపన్యాసము లిచ్చిరి. వీరియొక్క సహాయము మరువదగినదిగాదు.

యాత్రికులలో శ్రీ నరసింహదేవర సత్యనారాయణ గారియొక్క శిష్యులగు ఉప్పెర్ల లక్ష్మీనారాయణగారి యొక్క సహాయమును వివరించుటకు వీలులేదు. మద్రాసు ప్రావిన్షియల్ కో ఆపరేటివు యూనియను కార్యదర్శులగు శ్రీ సత్యనారాయణగారు దయతో వీరినిపంపి యాత్రకంతకును వన్నె దెచ్చిరి. వీరు యాత్రికులతోనుండి ఎప్పుడు అడిగితే అప్పుడు మ్యాజిక్కులాంతరు ఉపన్యాసములను ఇచ్చుచుండిరి. కొన్ని దినములయందు రాత్రులయందేగాక, మధ్యాహ్నముల యందుకూడ మ్యాజిక్కులాంతరు ఉపన్యాసములనిచ్చిరి. వీరు ఎల్లప్పుడును నవ్వుచు ఆనందమును కలిగించుచుండురు. వీరికి కష్టమనునది అసలు తెలియనే తెలియదని చెప్పగలను. మరియు ఇతరులు కష్టపడుచున్నప్పుడు వారికి హుషారును కలుగజేయుచు నిరుత్సాహమును తీసివేయుచుండును.

ఇక యాత్రికులలో ఇందుకూరి సోమరాజుగారు, అల్లూరి సుబ్బరాజుగారు, గొట్టెముక్కల రామచంద్ర రాజుగారు, కలిదిండి సూర్యనారాయణరాజుగారు, వేగేశన లక్ష్మీపతిరాజుగారు, పెనుమెత్స జగన్నాథరాజు గారు మొదలగువారు భజనచేయుటయందేమి, యాత్రికుల కార్యక్రమమును నిర్విఘ్నముగా కొనసాగించుటయందేమి అమితమైన సహాయమును జేసిరి. వీరి సహాయము లేనియెడల యాత్రికుల కార్యక్రమము ఇంత జయప్రదముగా సాగుటకు ఎంతమాత్రమును సావకాశముండెడిదిగాదు.

భీమవరమునందుండి శ్రీకృష్ణునివలె యాత్ర నంతను నడపుచున్నవారు ఇంకొకరు గలరు; వారు డాక్టరు పాలకోడేటి సత్యనారాయణశర్మగారు. తాలూకా గ్రంథాలయసంఘ కార్యదర్శి. వీరియొక్క ఏర్పాటుల సామర్థ్యమువలననే యాత్ర యింత జయప్రదముగా జరుగుటకు కారణమయ్యెను.

భీమవరం తాలూకాలో ఇప్పుడు నిల్వయున్న గ్రంథాలయములు.

1 ఉండి = నాకోటి గ్రంథాలయము
2 ఆకివీడు = విద్యానంద గ్రంథాలయము.
3 చెరుకుమిల్లి = శ్రీకృష్ణదేవరాయ గ్రంథాలయము, రు 1500 ల స్వంతభవనము కలదు
4 కోనపల్లె = విద్యారణ్య గ్రంథాలయము
5 కాళ్ళ = భారతి పుస్తకభాండాగారము
6 జక్కరం = పెద్దనామాత్య గ్రంథాలయము రు 300 విలువగల స్వంతభవనము గలదు
7 కోపల్లె = వివేకానందగ్రంథాలయము రు 6000 ల విలువగల స్వంతభవనము కలదు
8 వెంపాడు = గణపతి గ్రంథాలయము
9 చినఅమిరం = గంగేశ్వరానంద గ్రంథాలయము రు 600 లు విలువగల స్వంతభవనము గలదు
10 పెదఅమిరం = శ్రీపద్మనాభస్వామి గ్రంథాలయము రు 400 లు విలువగల స్వంతభవనము గలదు
11 గాంధ్రము = సరస్వతీపుస్తకభాండాగారము రు 400 లు విలువగల స్వంతభవనముకలదు.
12 పెదపుల్లేరు = సీతారామాంజనేయగ్రంథాలయము
13 మహదేవపట్నం = శ్రీకృష్ణ గ్రంథాలయము
14 చిలుకూరు = యువజనానంద గ్రంథాలయము
15 కోలమూరు = వేణుగోపాల పుస్తకభాండాగారము రు 1200 లు విలువగల స్వంతభవనముగలదు
16 పాందువ్వ = శ్రీరామసుబ్బారాయ గ్రంథాలయము రు 2000 లు విలువగల స్వంతభవనముగలదు
17 ఉప్పులూరు = ధర్మగ్రంథాలయము
18 ఉండుదుర్రు = గాంధి గ్రంథాలయము
19 యండగండి = గోపాలకృష్ణ గ్రంథాలయము
20 గరగపర్రు = ఆంధ్రరత్న గ్రంథాలయము
21 గొల్లలకోడేరు = పోతన గ్రంథాలయము; రు 600 విలువగల స్వంతభవనము గలదు.
22 పాలకోడేరు = రానడే గ్రంథాలయము; రు 5000 విలువగల స్వంతభవనము గలదు
23 కుముదవల్లి = వీరేశలింగకవిసమాజ గ్రంథాలయము రు 200 లు విలువగల స్వంతభవనము గలదు.
24 వెండ్ర = ఆంధ్రవాల్మీకి గ్రంథాలయము
25 లోసరి = శ్రీరామ గ్రంథాలయము
26 నారపరాజుపేట = నారపరాజు గ్రంథాలయము
27 కొండేపూడి = బాలభారతి గ్రంథాలయము
28 [illegible] = వేణుగోపాల గ్రంథాలయము
29 [illegible]

30 కొణితివాడ = హీరాలాల్ గ్రంథాలయము రు 600లు విలువగల స్వంతభవనము గలదు.
31 వేలపోగుల = సర్దార్ నారాయణ గ్రంథాలయము
32 రాయకుదురు = సుజనానందని గ్రంథాలయము
33 వీరవాసరం = ధర్మగ్రంథాలయము; రు 1000 లు విలువగల స్వంతభవనము గలదు.
34 శృంగవృక్షం = శ్రీ లక్ష్మీనరసింహ గ్రంథాలయము
35 పెన్నాడఅగ్రహారం = సుబ్బరాయస్మారక గ్రంథాలయము
36 గొరగలమూడి = సరస్వతీగ్రంథాలయము
37 విస్సాకోడేరు = బ్రహ్మానంద గ్రంథాలయము
38 చిన్నరంగనిపేట = అరుంధతీ గ్రంథాలయము
39 గునుపూడి = గాంధి గ్రంథాలయము; రు 1200 లు విలువగల స్వంతభవనము గలదు.
40 భీమవరం = శ్రీరామ గ్రంథాలయము
41 భీమవరం = పటేలు గ్రంథాలయము
42 చెరుకువాడ = సీతారామాంజనేయ గ్రంథాలయము
43 సిద్ధాపురం = సువర్ణసతీ గ్రంథాలయము; రు 2000 లు విలువగల స్వంతభవనము గలదు
44 మోగల్లు = రామరాజా గ్రంథాలయము
45 కోరుకొల్లు = రామచంద్ర పుస్తక భాండాగారము
46 కొవ్విడి = అంజుమన్ యిస్లామీ గ్రంథాలయము

---

## విషయసూచిక



---

## 15 వ డిశంబరున వస్త్రదానము

ఏలూరు అన్న, వస్త్ర, వైద్య, విద్యాదాన సమాజమువారు ప్రతియేటా జరుపుచున్న అశక్తుల వస్త్రదాన మీసంవత్సరముకూడ ది 15—12—34 తేదీ శనివారము నాడు జరుగును గాన నెవరికిదోచిన ధర్మమును వారు చేసి రశీదులు పొందవచ్చును. శాశ్వతనిధిధర్మమయినచో రు 10—0—0 లు లగాయితు నిచ్చిన రశీదులు, పట్టాలు యివ్వబడును. వడ్డీతో ప్రతిసాలున నీధర్మము జరుగును. ఇతరవివరములకు

మద్దుల వేంకట చినరాజు శ్రేష్ఠి, వైస్ ప్రెసిడెంటు అండ్ ట్రస్టీ, ఏలూరు.

---

## "ఏలూరులోని మూడు ధర్మసంస్థలు" (ఉచితము.)

1. హిందూ యువజనసంఘ గ్రంథాలయము. (Y. M. H. A.) స్థాపితము 1904 సం॥రం

2. అన్న, వస్త్ర, వైద్య, విద్యాదానసమాజము. ( స్థాపితము: 1913 సం॥రం. )

3. గోసంరక్షణ సమితి. స్థాపితము: 1918 సం॥రం.

సంవత్సర రిపోర్టులు, రూల్సుబుక్కులు, కరపత్రములు, బ్యాలన్సుషీట్లు మున్నగునవి రు 10 పదిరూపాయలు లగాయతు శాశ్వతనిధిధర్మముయిచ్చి రశీదులను ప్రత్యేకం పట్టాలను 5 గురు శాశ్వత ధర్మకర్తల (రు 500ల దాతల సంతకములతో పుచ్చుకొన్నవారికి ఉచితముగా సప్లయి చేయబడును. ఎల్లరు యథాశక్తిని సహాయపడ ప్రార్థన. ఇతర వివరములకు —

మద్దుల వేంకట చినరాజు శ్రేష్ఠి, శాశ్వత ధర్మకర్త.

# అపూర్వాద్భుత సుప్రసిద్ధ వైద్యగ్రంథము!

ప్రతి ఆంధ్ర గ్రంథాలయమునను, ప్రతి ఆంధ్రవైద్యునియొద్దను, ప్రతి ఆంధ్రగృహమునను, భద్రపరచవలసిన గ్రంథ మిదియే!

వ్యాధిచికిత్సలలో నిదియే
రారాజు!




[ క్రౌను 8-వ సైజు 160 పుటలు; దళమగు గ్లేజు కాగితముపై ముద్రణము; 9 చిత్రపటములు; చక్కని అట్టబైండు; వెల రూ 1-4-0 మాత్రమే; వి. పి. ఖర్చులు 7 అణాలు వేరైయుండును; రూ 1-6-0 ను మనియార్డరు చేయువారలకు తిరుగుటపాలో నీ గ్రంథము బుక్ రిజిస్టర్డు పార్సెలుగా పంపబడును; ఇందుమూలమున 3 అణాలు తగ్గగలదు; ఆంగ్లమునందైనచో నిట్టి శాస్త్రీయగ్రంథముయొక్క మూల్యము మూడు నాలుగు రూపాయ

శరీరారోగ్యమును, మానసికానందమును, గుఱించి నిర్ణయించిన మనోరాజ్యాంగసంస్కరణమే మానసికచికిత్సా శాస్త్రముగ బరిణమించుచున్నది. "మందుమాత్రలనుండి భిన్నమగు చికిత్సాశక్తి సాధ్యము లుండియున్న" వని బ్రిటిష్ మెడికల్ జర్నలు చెప్పుచున్నది. మీ శరీరమునందు నూతనరక్తమును బ్రవహింపజేయు నిట్టి గ్రంథమును మీరెన్నడు నిదివరకు జదివియుండరు.

## గ్రంథస్థాంశములు.

(1) మానసిక చికిత్సయన నేమి? (2) మానసిక చికిత్సయొక్క కర్తవ్యము. (3) సహజమానసికశక్తి. (4) జీవాణువుల యొక్కయు జీవజాలముల యొక్కయు మనస్సు. (5) స్మృతియన నేమి? (6) గతయుగములలోని చికిత్స. (7) ఆరోగ్యత-అనారోగ్యత. (8) మనోవ్యాకులత, అస్థైర్యము. (9) నిద్రయొక్కయు మనశ్శాంతి యొక్కయు చికిత్సా ప్రయోజనములు. (10) మానసిక చికిత్సా మహిమ. (11) దినదిన ప్రవర్ధమానములగు వ్యసనములు. (12) యోగనిద్ర, సూచనావిశేషము. (13) మానసిక చికిత్సాపద్ధతులు. (14) ప్రాణచికిత్సావిధానము. (15) లయబద్ధమగు శ్వాసయుత ప్రాణచికిత్స. (16) ఆకస్మిక పునరారోగ్యప్రాప్తి. (17) మానసికౌషధము. (18) సుస్వభావము. (19) వ్యాధిరక్షణశక్తి. (20) గొప్పడాక్టరుల అనుభవములోని ఆకస్మిక వ్యాధిచికిత్సలు. (21) మానసిక చికిత్సను గూర్చి పండితాభిప్రాయములు (22) కొన్ని ముఖ్యజాగ్రతలు.

## పండితాభిప్రాయములు.

అఖిలభారతాయుర్వేద వైద్యసమ్మేళనాధ్యక్షులును, వైద్యప్రదీపికా సంపాదకులును నగు ప్రొఫెసర్ డి. రంగాచార్యులుగారు :— "ఆంగ్లేయ వైద్య చింతామణి ఆంగ్లేయౌషధగుణదీపిక మున్నగు ననేక వైద్య గ్రంథముల రచించి వైద్యలోకమునకు సేవజేయుచున్న ఈ గ్రంథకర్తనుగురించి వ్రాయనేల! పాశ్చాత్య ప్రాచ్య సాంప్రదాయముల రెంటిని జోడించి వ్రాసిన వీరి 'మానసిక చికిత్సను, వైద్యులెల్లరును జదివి తల్లాభమును బొందుదురు గాక!"

తూర్పు గోదావరి జిల్లా సేకి గ్రామములోని ఉన్మాద చికిత్సాలయమునుండి ఆయుర్వేద వైద్య పెద్దింటి వెంకట జనార్దనాచార్యులుగారు :— "మీ గ్రంథరాజమందు చెప్పబడిన విధానప్రకార మాచరణచేయగా మాఉన్మాద చికిత్సాలయమున నలుగురు రోగులు ఉన్మాదము కుదిరి బాగుగా ఆరోగ్యవంతులై యుండిరి."

రామచంద్రపురంలో ఆనరరీ అసిస్టెంటుసర్జన్ యగు తోలేటి కనకరాజుపంతులు యల్. యమ్. & యస్., గారిట్లు వ్రాయుచున్నారు :— "వ్యాధిచికిత్సలనుగూర్చి వివిధవిషయములు మీరీ గ్రంథమునందు బొందుపరచిన రీతిని విషయపరిశీలన వలనగాని గ్రంథసంక్షేపమునగాని యింతబాగుగా వ్రాయబడిన గ్రంథ మాంగ్లమునగాని యాంధ్రమునగాని వ్రాయబడి యుండలేదు.

ఈ గ్రంథము పామరులగు రోగులకేగాక వైద్యులకును అత్యంతోపయుక్తముగా నుండును. అందరకును బాగుగా తెలియునట్లు మంచి విషయములతోనున్న యీ గ్రంథమును రచించిన మీరు వందనీయులు."

గృహలక్ష్మి పత్రిక యిట్లు వ్రాయుచున్నది :— "మనస్సునకును సకలశరీరావయవములకును గల సంబంధములను సచిత్రముగ దెలిపి మనశ్శుద్ధితో సర్వలోపములు నివారణమగుటను జర్చించి మనశ్శుద్ధి సిద్ధించు తెరవు లనేకము లీ గ్రంథమునందు సూచింపబడియున్నవి. ఇది కేవల మాధ్యాత్మిక గ్రంథముగాక శుద్ధవైద్యగ్రంథము. మనశ్శుద్ధి లేక వ్యాధులు శాశ్వతముగ కుదరవని యిందువలన గ్రహింపనగును. ప్రాచ్యపాశ్చాత్య పండితుల అభిప్రాయములను, కేవల మానసిక చికిత్సవలన నారోగ్యము నందిన వివిధరోగుల యుదాహరణములను, గలిగి యీ గ్రంథము రసవంతమై యుత్సాహదాయకమై యున్నది."

ఇందు జెప్పబడినవిధానముల ననుసరించినచో మీ చికిత్సా విజయములు ద్విగుణీకృత మగుననుటకు సందియము లేదు.

---

చిల్లరిగె సేతుమాధవరావు, గవర్నరుపేట, బెజవాడ.

సంచార గ్రంథాలయశకటము



కౌమారగురుకులము,

మన్నారుగుడి.